శ్రీ [illegible]

# శ్రీ పదసర్ఘరాఘవ ప్రశంస

★

సీ। శబ్దసౌష్ఠవంబుఁ, బ్రసాదసౌమ్యంబును
భావనిర్మలత, యన్వయము క్రమముఁ
ద శబ్దార్థగతను, సద్ప్రయోజనమును
వ్యంగ్యప్రధానత, పాకశుద్ధి,
ప్రక్రమాధంగత, పరిష్కృతి సాత్త్వికస్ఫృతి,
రసపరస్పరగుణ రమ్యతయును,
అపారమధురిమ, యౌచిత్యమును, హాయి,
యాకాంక్ష, జనకలాదికమును,

గీ॥ గలిగి భువనంబులటు వ్యాప్తి నిలసి గిరుల
తెను సుస్థిరభావమ్ము నొలసి యొసఁగు
"భువనగిరి" వంశవార్నిధి పూర్ణచంద్ర
"విజయరామ" కవిత్వంబు వెలయుఁగాత!

ఇట్లు
చల్లా పిచ్చయ్యశాస్త్రి
శతవధాని

# కవిమనవి

(శ్రీ) జ్ఞానానుభవోరు రాజ్య విలసత్సింహాసనస్థాయియై
జిజ్ఞాసాపరసంశితవ్రతమనస్సీమావిహారంబులన్
బ్రజ్ఞల్ నేరుపఁ గూర్పఁ దీర్ప సకలస్వాతంత్ర్యచిన్మూర్తితో
నాజ్ఞాబంధురుఁ డో మహామహుఁడు నాయం దావ్హా గుప్పించుతన్॥

ఉ॥ భారవితో గురుండు "ప్రతిభారవి" నాఁదగు లే! మురారివా
గ్ధోరణిఁ గుప్పతిప్పలుగఁ దోఁచు విచిత్రిము, లూహాలం, దలం
కారములందు, వ్యాకృతివికారములన్, బహుశాస్త్రసంవిదా
కారముల; న్దెలుంగునుడికారముఁ గూర్పుము నేర్పుఁ జూడనౌ!॥

చ॥ అని, హితుఁ డెట్టి మేల్సమయమం దడికించెనో నన్ను, దీన రా
మునికథ వ్రాయుపున్నె మగుఁబో యనుబుద్ధియు నుబ్బ, నుబ్బునన్
బనివడి పూనుకొంటి బులుపాటపువాటముమీఁట, నేమియం
దు? నదిర! తమ్మిమొగ్గరముతోఁ దులయై తలఁపు న్గలంచెఁబో॥

ఉ॥ హెచ్చుగ నభ్యసించియు, నయించియు శిష్యులకోస, మెట్టిఁ డేన్
ముచ్చెమరూర్చు భాష్యపథము న్గన కర్థముఁ జెప్ప మన్నచో!
మచ్చికకాని జీబ్రయసుమావును బోలుప్రవృత్తి నున్న దీ
యచ్చెరువౌ మురారికృతి! హావడి, హా! వడి నెంచ నైతిఁగా!॥

ఉ॥ శిష్యత కీడుగా దిపుడు, చెప్పఁగ నేరికిఁ దీఱ, దుండవే
భాష్యము లొక్కమూఁడొడలువంచి కృతి న్పఠియింతు మేల్కృషిన్
దూష్యతయున్నె, యన్నమదితో మొదలెత్తినవేళ యెట్టిదో
యేష్యము నాఁడునాఁటఁ బరువెత్తఁగసాఁగె ఫలోన్ముఖంబుగన్॥

ఉ॥ భావమెఱుంగుగ డ్డొకటి, భాషయుఁ జల్కనసేఁత లోని గాం
డీవము మొండు, శైలిఁ గమనీయతఁ గూర్చుసమస్య, వ్యంగ్యమున్
జేవ లగింపు నా నిటులనేకము లెల్లా సమన్వయించుచున్
నావశమైనధార వలనత్వరఁ గూర్పఁ దెలుంగొనర్చితిన్॥

ఉ॥ పేనినకొంత చెళ్ళపిళవేంకటశాస్త్రిమనీషిసన్నిధిన్
గాన మొనర్చ నాబుధుఁ డఖండకృపాపరమార్ద్రచిత్తుఁడై

తోనె యుపన్యసించెఁ దగుత్రోవఁ, దెలుంగొనరింపఁబూనునె
వ్యానికిఁగాని యానుడు లవశ్యముఁ మాన్యము; లిత్తు నిచ్చటన్॥

“ఉ॥ ఒక్కెడఁ జక్కనౌపదము నొక్కటి చేర్చిన ముచ్చటౌ, మఱిం
కొక్కెడ నున్నదాన సగముంచిరచించిన ముచ్చటౌ, మఱిం
కొక్కెడ నున్నదాన సగమూచిన పీలగుఁ దెల్గొనర్చు నా
మక్కికిమక్కి యన్నటులు మార్చినఁ గావ్యము శ్రావ్య మెట్లగున్॥

ఏబదియేళ్ళనాడు నాబాల్యగురువులలో నొకరు నన్ను మురారి శ్లోకం పరీక్షకుఁ దెలిఁగింపుమన్నారు. శ్లో॥ ఏకైకే నివసంతి తే భుజభృతః కస్మై నిగృహ్ణీమహే। వీరక్షేత్ర మిదం పున ర్వసుమతీ పౌలస్త్యమాబిభ్రతీ। వాలీ త్వాహ్వాయమాన మేన మపియ చ్చక్రే, కృతే చక్షుషీ। పశ్యామ శ్శ్వపశ శ్చ తేచ శృఃఖమ స్తద్వక్షు మల్పే పయమ్॥

నా తెలిఁగింపు:—

చ॥ ఒకరొకరుంద్రు వీరవరు, లొక్కరికొక్కటు తీసిపోరు, భూ
మికియశమబ్బె రావణుని మెచ్చుననం చనుకొందు నేని వా
లికినితఁడింతజంకె, లవలేశము లొక్కటడించి, కన్నులుం
టకుఁగని వీనులుంటకు వినందగు నల్పులనేమి చెప్పఁగన్॥

దీనిని మా బంధువులు లోకోత్తర విద్వాంసులు తెలిఁగించారు. బాల్యగురువుగారు నన్ను వారి తెలిఁగింపు యెట్లున్నది అని అడిగినారు. బాగు లేదనినాను. దానిమీద నీవు అంతకన్న బాగా తెలిఁగింపగలవా! అన్నారు. వెంటనే తెలిఁగించి చూపినాడను. సంతసించినారు. ఆంధ్రీకరణం స్వతంత్ర రచనవలె నుండడమే కావలసినది. సంస్కృతంలో కొన్ని సందర్భాలు హృద్యంగానుండును. తెలుఁగులో కొన్ని సొగసుగా నుండును. చ॥ తెలుఁగునఁగొన్ని సంగతులు తియ్యనివై యల రారు, సంస్కృతమ్మున మఱికొన్నిసంగతులు ముద్దులు మూటలు గట్టఁజాలునం దును మఱియిందునన్ సొగసుతోఁ దులదూగునుకొన్ని సంగతుల్ పనిఁగొని చెప్పనేల యిది పండితవేద్యము కాకయుండునే! నేననువదించిన మురారి శ్లోకంలో నొకలోకోక్తి—“కృతే చక్షుషీ

పశ్యామః శ్రవసీకృతే చస్మృణుమః" అంటూవున్నది. దాన్ని యిమిడ్చిన భాగం పరిశీలింపఁగోరినాను (కన్నులుంటకు......) కింబహునా? మూలంలోవున్న సారం వచ్చినదా లేదా అనే అనువాదకుఁడు చూడవలయును. నేను మురారి శ్లోకంలో "లవలేశము లొక్కఁటడించి" అన్నది మూలంలో లేదు. లేకున్నను జేర్చినాను. "కస్మైనిగృహ్ణీమహే" అను వాక్యానికి సరిగా తెలిగించక "ఒక్కరికొక్కరు తీసిపోరు" అని సందర్భోచితంగా చేర్చినాను. "అహ్వాయమానం" అనేదానికి గూడా సరిగా తెలిఁగించలేదు. తెలిఁగించేయెడల వాలి రావణుని స్పర్ధగల వానిగా జేసెను. అనఁగా రావణునికన్న గొప్పవాఁడని తాత్పర్యార్థాన్ని పుచ్చుకొని వాలికి నతఁడింతజంకె అని 5 అక్షరాలలో నిమిడ్చినాను. కింబహునా, ఎంతో పరిశీలిస్తేనేగాని నాపద్యం ఆ శ్లోకానికి అనువాదమని తేఁదు."

(ఇది శ్రీవారి 19-9-46 లేఖనుండి యుద్ధృతము)

శా॥ ఈమార్గంబున సల్పి, భ్రాంతిత్రసముఁ డెంతేన్ముఖ్యుడున్సూరి స
త్తాముద్రాఢ్య విమర్శకుండుఁ గవి మేధాదక్షిణామూర్తి నే
సౌమిత్రుండని పద్యముల్పనిచి శిష్టాంకున్ హనూమత్కళా
గ్రామున్ మత్పురవాసి డాయఁగనియెన్ బ్రస్తావనాభాగమున్॥

ఉ॥ దైవిక రాజకీయ వివిధ ప్రబల ప్రళయాంగారాయని
త్యావిలవృత్తిఁ గాగితములందమి నచ్చున కిచ్చుకార్యము
ల్లే విరమింపఁగా వలసె నేండ్లుగ; నాఁటికిఁ జూడలేమియ
న్భావముచే సఖుం డెనయుపద్దెము లూయెల నిల్పి యూపఁగన్॥

ఉ॥ ఆదరబాదరయ్యో దుదికచ్చున కిచ్చెడి పీఠెసంగఁగా
నాదటవ్రాయు పీఠికకు నల్లియవాంతవ విఘ్నమైననుం
గాదనకెట్లో దీక్ష పొలిగా మెలఁగన్ రచియించి పంపె, న
య్యాదృతి పెంపు నింతయననౌనె కడుంగడుమెచ్చుఁ గూర్చెఁగా॥

గీ॥ దక్షిణామూర్తి దాక్షిణ్య దర్శనమున
దక్షిణామూర్తి దాక్షిణ్య దర్శనమున

నతని కలరుతవాంఛితార్థానుభూతి
నతని కలరుత వాంఛితార్థానుభూతి॥

శా॥ ప్రేరేపించిన వారికిన్ సుపథసంవిద్దర్శనాచారికిన్
ధీరోదాత్త గుణాత్మపాఠక లసద్వ్యాఖ్యా కళోద్ధారికిన్
సారోదారకథాగ్ర నాయక మహాంత ప్రౌఢి మచ్ఛారికిన్
గీరాజ్జ్వల్యా మురారికిన్ ప్రణతిగాఁ గేల్మోడ్పులర్పించెదన్॥

148 A శివాలయవీధి
అగ్రహారము, గుంటూరు
27-5-1949

ఇట్లు, సుజనభజనుఁడు,
భువనగిరి విజయరామయ్య
ప్రతిభారవి, ఉభయకవిమిత్రుఁడు.



శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# ఆంధ్రీకృతానర్ఘరాఘవము - పీఠిక

"కవి"యన నెట్టివాఁడు? పండితుఁ డని శ్రుతి బోధించును. "కందమల్లిననేకవి"యని చాటూక్తి. గణబద్ధముగా నేమాత్రము కూర్చినను "గవి"బిరుదమును జేర్చికొనుటకలదు. అరసినకొలఁదిని, "శుచి, ర్దక్ష, శ్శాన్త, స్సుజనవినుత, స్సుశ్రుతరసః, కలావేదీ, విద్వాన్, కలమృదుపదః, కావ్యరచనః, కృతజ్ఞో, దైవజ్ఞ, స్సదయహృదయ, స్సత్కులభవ, శ్శుభాచార, శ్ఛందోగుణగణవివేక, స్స హి కవిః॥"అన్న ట్లాయా యిలక్షణములు గలవాఁడే "కవి" శబ్దవాచ్యుఁ డని తెలియనౌను.

"కవే రిదం కావ్య"మ్మనికదా. "చతుర్వర్గఫలప్రాప్తి స్సుఖాదల్పధియామపి, కావ్యాదేవ"యని దర్పణప్రదర్శితమైయున్నది. "ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేన కృతకేనవా పుంసాం యే నోపదిశ్యేత తచ్ఛాస్త్ర మభిధీయతే"యన్నట్లు వ్యంజనావృత్తిచే నుపదేశించుటవలనఁ గావ్యములందుఁ గాన్తాసమ్మితత్వ మెంచఁబడినది. వ్యంగ్యజీవితములౌనాకృతులకు "సగుణాలంకృతీ కావ్య"మ్మనుటలో సమవాయరూపముగా నయ్యవి రసోపస్కారకము లౌనని తేలును.

ఇట్టివి శ్రవ్యములు దృశ్యములునని ద్వివిధము ఇం దభినయముచే వస్తువును రూపించురూపకములవలనఁ "జిత్రతురగన్యాయము"న ద్రష్టల హృదయములందు సుకరముగా "రతి, హాసము, శోకము, క్రోధము, నుత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము" ననుస్థాయి భావము లుదయించుటయు నప్పటిసాత్త్వికాంతఃకరణవృత్తి యానందరూపమునొందఁగా "శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, భీభ,త్సాద్భుత, శాన్త, రసాభివ్యక్తి యొదవుటయు సంఘటించును. తత్తద్రసోదయభాసురకవితావైభవము "దోషరహితగుణాలంకారయుక్త శబ్దార్థజన్య"మని మమ్మటుఁడును, "రమణీయార్థకశబ్దః కావ్య"మని జగన్నాథుండు నెంచ, విశ్వనాథపండితుఁడు, "వాక్యం రసాత్మకం కావ్య"మ్మనెను.

ఇంకఁ బాశ్చాత్యవిమర్శకులందు, హడ్సను (Hudson) గవిత యన నెట్టిదనఁగా గల్పనలద్వారమున మనోవేగముతో జీవితవ్యాఖ్య యొనర్పఁజాలునదె యనియెంచ, ఎమర్సను (Emmerson) కల్పనా మహిమకన్నఁ బ్రకృతివిషయములను గ్రహించి వానియాంతర్యమును దెలియఁజెప్ప సమర్థమైనదే యనినిర్వచించె. మఱి బ్రాడ్లే (Braudely) "మానవచక్షుర్మాత్రగమ్యములు కానిప్రకృత్యంతర్లీనవిషయములను విభావనామహిమచే గ్రహించి లోకుల కది సుబోధము కాఁదగునట్లభివర్ణింపఁగలుగునదే కవిత్వ మనిపించుకొను" ననినిరూపింపఁగా నసన్యసామాన్యశేముషీవిశేషుం డౌ షేక్స్పియరు (Shakespear) మహాశయుడు "కవికల్పన మజ్ఞాతవస్తుజాతమునకు రూపకల్పన మొనర్పజాలెడి" ననెను. ఏమైన, వర్డ్సువర్తు (Wcrdsworth) ప్రభృతు లెంచిన భావప్రాధాన్య మెవరైనఁ బాటింపవలసినదే. కల్పనము తదభివ్యక్తి సాధనము కాఁగలుగును. దాన నొకవిధ యోజనకాంతిసౌకుమార్యార్థవ్యక్తిస్ఫురణాదికములవలన మానవుని మానసికప్రవృత్తి మేల్కొల్పఁబడినప్పుడు స్వార్థ ముడిగి లోకకళ్యాణాభినివిష్టత రూపొందుచుండును.

అట్టి నాటకము లాయాభాషలలో నప్పుడప్పు డేర్పడిన రంగస్థలముల కెక్కఁగలుగుటయో పండితపామరహృదయంగమములై తత్తద్రసానుగ్రహ నర్తనావర్తనము లందుచుంటయో సంఘటించుచుండును. గీర్వాణమునం దిట్టివి వెలయించినవారిలోఁ బ్రముఖమార్గదర్శి యనఁదగు శ్రీ భాసమహాకవి తరువాత, "పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః అద్యాపి తత్తుల్యకవే రభావా దనామికా సార్థవతీ బభూవ" యన విఖ్యాతుండౌ శ్రీకాళిదాసకవిశేఖరుఁడు నాతని "యభిజ్ఞానశాకుంతల"ాదికములు నటుండ "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" యనఁ బేర్మిఁగాంచిన యమ్మహాకవి "పదవాక్యప్రమాణజ్ఞత"నుగూడఁ దలఁదన్నె నన్న వన్నెఁ గన్నమిన్న "మౌద్గల్య" సగోత్రోత్పన్న "భట్టమురారి" విజ్ఞేయుం డొక్కరుండు వెలసెను.

ఈతని దేశకాలాదికములు సువ్యక్తములు కాకయున్నవి. గోదావరీభీమేశ్వరవర్ణనాదికములనుబట్టి తత్ప్రాంతీయుఁ డనియూహా.

మఱి, యీనాటకము సముద్రతీరమండలి (జగన్నాథములోని) పురుషోత్తమభగవానుని రథయాత్రకై చేరినవారియెదుట నాడఁబడుట ప్రస్తావనాంతర్గతమగుట నెన్నఁదగియున్నది. 12వ శతాబ్ది కీవలదికాఁగ "కవీంద్రవచనసముచ్చయ"మం దుదాహృతము లైనయీతనిశ్లోకములనుబట్టి తత్పూర్వుండనియు, భల్లటవాచస్పతిమిశ్రాదులకు సమకాలికుఁ డగుచో నవమశతాబ్దిలోనివాఁడే కానువచ్చుననియు నెంచుచున్నారు. నిజకుల గోత్రవివరణము దానే యొనర్చియుంట మహాకవి యూవర్ధమానుని సూనుండనియు తంతుమతీగర్భశుక్తిముక్తాయమానుం డనియుఁ దెలియఁగలము. ఆతఁ డేమేమిపల్కినను "అసత్కృత్తనకాన్తారపరివర్తనపాంసులాం వాచం శౌరికథాలాపగంగయైవ పునీమహే॥" యన్నచందాన నున్న పరమపవిత్రశ్రీరామచంద్రచరిత్రప్రతిపాదకం బయిన "అనర్ఘరాఘ"వాభిధాననాటకప్రబంధంబే మనకు లభించినది. "అలంకారకౌస్తుభ" 'కువలయానం' దాదులం దుదాహృతము లైన 'దేవీంవాచము పాసతే' మున్నగు నెన్నియోశ్లోకములు గ్రంథస్థములుగా మన కగపడమిని తత్కర్తృకము లింక నున్నవనిమాత్ర మూహింపఁగలుగుదుము. "సౌరభ్యనిర్భరగభీరమనోహరంబు"లై "వాల్మీకియోగమృతకూపనిపాన లక్ష్మీవిలసితము" లైనయీతనివాక్కులను పండితరాయ, విశ్వనాథకవిరాజ, సర్వజ్ఞసింగభూపాలాదు లెందఱో సేకరించియుండ, రఘువీరచరిత్రకారుఁడు "మాధుర్యైకభువాం మురారివచసా మాస్వాదివైస్వాదిమా సంతుష్యంతి తయేవ నూతనసుధా వేఃషువాణీషు నః" యనియగ్గింపఁగా, నొరులు "మురారిపదచిన్తాయాం భవభూతేస్తు కా కథా భవభూతిం పరిత్యజ్య మురారి మురరీకురు" యన్నది మున్నుగాఁ గలవెన్నో మనకిఁ దగులకమానవు.

"ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ" యన్నభవభూతిమహాకవివాక్య స్సార్థకమానా? "యత్రౌచిత్య ముదారతా చ వచసాం యత్రార్థగో..., గౌరవం తచ్చేదస్తి తత స్తదేవ గమకం పాండిత్య వైదగ్ధ్యయోః" అన్నసుకవివాగ్భవభూతి నిబ్బరముగా నిల్చిన విద్వత్కవివాక్యాభాగమునం

"బాలవాల్మీకి" బిరుదాభిరాముండు నిజసూక్తిముక్తాఫలమ్ముల విషమదృష్టివిరహితసూరివరేణ్యకహారహీరాయమానంబుగా నొనరించియున్నాఁడు. పూర్వోక్తపరిణతప్రజ్ఞాధురీణుండు "తామేతాం పరిభావయం త్వభినవై ర్విన్యస్తరూపంబుధాః శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతప్రజ్ఞస్య వాణీ మిమామ్"అన్నదానికిఁ బైమెట్టుగా "సమున్మీలత్సూక్తిస్తబకమకరంద" బిందుసందోహతుందిలాయమానశ్రవణరంధ్రుం డీతండు "న శబ్దబ్రహ్మాఖ్యం పరిమళ మనాఘ్రాయ సుజనః కవీనాం గంభీరే వచసి గుణదోషా న్రచయతు" అని యానవెట్టుటలో శబ్దబ్రహ్మవేత్తృతాగరిమంబు నందిననే, కాని యిందలిరస మాన నందఁ గందనేర దని రూఢపరచినవాఁడయ్యెను. కావుననే, వ్యాఖ్యాత, హరిహరపండితుఁడు "హృదయాకలితాశేషశబ్దశాసనసంవిదః మురారే రిహ శబ్దార్థతత్త్వం కో వేద తద్వద !"యని యడుగఁజొచ్చెను

అట్టియీతండు వల్మీకోద్భవుని భాసదిఙ్నాగభవభూతిప్రభృతుల నుద్దేశించి "యది క్షుణ్ణం పూర్వై రితి జహతి రామస్యచరితం గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః ?" అనుచు "ధీరోదాత్తగుణోత్తర" నాయకగుణగ్రామోపసంవర్ణనంబునకుం గడంగెను; గాని, నాటకలక్షణాదికముల నెందు నతిక్రమింపకున్నను నీతని "పంథ" మాత్రము వేఱయ్యె నన్నంతవఱకైన వినని వా రుండరు. సాధారణముగా నాటకరచయితలు వర్ణనాంశబాహుళ్యంబునందుఁ గాక స్వభావోన్మీలనానుకూలతత్తత్పాత్రవాగ్రచనౌచిత్యంబునందె లగ్నచిత్తత వెలయించి హృదయావర్జకకథాసన్నివేశముల సంఘటించుచుఁ గౌతుకోద్దీపికముగా, శ్రోత్రపేయమృదుశయ్యాలంకారవిశిష్టద్రాక్షాపాకఫక్కి నెక్కొనఁ బల్కఁ జూతురు. ఇయ్యది చంపూరచనంబో యనఁ బోయినపోడవున నక్కడక్కడఁ గథాగమనంబున కిదేటియంతరాయ మనికూడఁదోఁచఁదగు నంతగా నేవేవో వర్ణించుచువచ్చినదిగాక యించుమించుగ నష్టాదశ వర్ణనము లెల్లెడఁ జొప్పింప నెంచెనో యన్నట్లు సప్తమాంకమంతయు దేశపర్వతవాహినీపట్టణాద్యభివర్ణనబహుళంబు గావించియుండెను. "గురుకులక్లిష్టం" డీతనికిఁ బిండి వెండుగా నుండుటంగావలయు శ్రీనాథ

మహాకవికే యొరవడిగా "ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల జ్వాలాజాలజటాలజాంగలతటీనిష్కూజకోయష్టయః" అన్నరీతి నాఁభటి మెఱయ నిజప్రచండపాండితీస్ఫోరకవాగ్ఝరిని సెలయేటివాటమున దొరలించువశ్యవాక్త్వంబు వెలయించుచు "వీరాద్భుతారంభగంభీరోదాత్త వస్తువిన్యస్తహస్తుండై సమస్తపదజాలంబులతో నడిపి నారికేరస్ఫోరకత కల్పించినవాఁడయ్యెను. అంతియ కాక, "చేతశ్శుక్తికయా నిపీయ శతశః శ్శాస్త్రాబ్ధిమృతాని క్రమాద్వాంతై రక్షరమూర్తిభి స్సుకవినా ముక్తాఫలై ర్గుంభితాః" అని తాఁబల్కినయట్ల శబ్దశాస్త్రంబు నందలి తన నూతనోపజ్ఞ నగపఱప గూఢప్రయోగంబు లెన్నే ననుసంధించి యుజ్జ్వలదత్తభట్టోజీదీక్షితాదులకే భిక్షముఁ బెట్టఁజూచినదిగాక "ప్రకృష్టకర్తృభిః ప్రియక్రియాఫలవతో విధేః ప్రియుంజానా స్త్వయా వీర పరిపాల్యామహే వయమ్" అనుటం "క్రియాపదే కర్తృగామిని స్వాంతేతః జతశ్చ ధాతో రాత్మనేపది స్యా" త్తను దానిని సూచించి యున్నట్లే 'జనకర్తుః ప్రకృతి' యన్నచో 'జాయమానస్య హేతు రపాదానం స్యా' త్తను కారకాంశము సేకాదు, 'స్థానివద్భావము'లే కా "దాకృతిగణ"ములే కా దిచ్చవచ్చినన్ని యిమిడ్చెను. ఇంక, "ధన్యస్థేయం తవైవ వచాంసి" యనుచో మిమాంసాపరిభాషఁ జొప్పించెను. మంత్రశాస్త్రపరిభాషయు నట్లే. ఆయాసందర్భములెల్లం బరికింపఁగా నిది పాండిత్యప్రకర్షకై కడుంగడు శ్రద్ధతోఁ గూర్పఁబడినట్లు తెల్లము కాకమానదు. అందలిభాషయు దఱుచుగా బహుళ నైఘంటికాద్యాధారములవలనఁగాని భేదిల్ల నట్లుండును.

కాని, పదసన్నివేశముమాత్రము శ్రుతిసుఖావహమై యీతఁడు "సంగీతసాహిత్యపారదృశ్వ" యనుటను సందియ మింతయు నుండఁగూడ దనిపింపకమానదు. అందంముఁ బొందుపఱుపఁబడిన యుపమానోపమేయసామగ్రి యనన్యోచ్ఛిష్టమై నూతనభావోదయంబునకుఁ దావలంబై చూపట్టెడు. ఇంకఁ గథావిషయమందన్ననో, రంగస్థలానుకూల వ్యూహాసంఘటనంబు నందుఁగూడ సద్వితీయత నగపఱపఁగలిగెను. ఇందు జనస్థానమున ఖరదూషణాదులను రావణుఁడు వాలికొఱకే

నిల్పెననుటయు, విశ్వామిత్రాశ్రమముననే వామనమూర్తి తపంబొనరించె ననుటయు. వార్తాహారిణిమంథర శ్రమచేగతింప శ్రమణి పరకాయప్రవేశవిద్యచే జాంబవతునితోడి సంధానమును గల్పించెననుటయు, గుహుఁడు లక్ష్మణసచివుండై రామసుగ్రీవులనడుమను దౌత్యంబు నెఱపెననుటయు మున్నగాఁగల వెన్నో చాణక్యకల్పన లనిపింపఁదగునవి యింపలి నిగూఢశైలిహృద్యములనడుమఁ బొడకట్టుచుండును.

ఇట్టియనన్యసామాన్యవైదగ్ధ్యంబు వెలయించు నవరసభరితాగాధకూపస్థితిఃబుల నుద్ధరింప సాధారణుల కెట్లైన దుస్సాధ మనకతీఱదు. ఉద్ధర్తలు కాఁజూచు శబ్దబ్రహ్మవేత్త లెవరైనను 'ఉక్షారథో భూషణమస్థిమాలా భస్మాంగరాగో గజచర్మవాసః ఏకాలయస్థేపి ధనాధినాథే సఖ్యౌ దశేయం త్రిపురాన్తకస్య" యని చదివినమాత్రనే సహాసంబుగా నాలకింపఁడు? ఇంక, "స్థానేషు శిష్యనివహై ర్వినియుజ్యమానా విద్యాగురుం హి గుణవత్తర మాతనోతి ఆదాయ శుక్తిషు వలాహక విప్రకీర్ణై; రత్నాకరో భవతి వారిభి రంబురాశిః" అనిచదువఁగా విన్నప్పటికంటె.

మ॥ ఉపదేశించినవిద్యఁ బ్రౌఢులయి శిష్యుల్పెక్కుచందాల ని
   క్కపుఁగీర్తి న్బహుచోఁ గనన్ గురుఁడుత్కర్షంబు నొందౌను, దా
   నుపయోగించినయబ్ధినీ ర్మొయిలు వర్షోద్యోగతన్ శుక్తివా
   రపుటి న్జిల్కుటఁగాదె వార్ధి యలరున్ రత్నాకరంబై భువిన్॥

అన్నయాంధ్రీకరణము చెవినిసోఁకినంతనే సాదృశ్యలక్ష్మిప్రసాదమొదవి, యీధారయే "భువనగిరి"నుండి యవతరించె ననిపించును.

అంత నిట్టివానికై తడవఁగాఁ బడేడనతాబ్దిలోనే యొకతిమ్మభూపతియు, నాధునికుఁడు శ్రీకూచిసత్యనారాయణకవియు ననురూపముగానే శ్రవ్యప్రబంధములుగా మార్చినట్లు విందుము. ఇంక, శ్రీ ఆకొండి వ్యాసపండితప్రభృతులు ననువదించుటంగందుము. అందుఁ గొన్ని ముద్రితము లయ్యుం గాకయు నెట్లైన నందఱ కందుపాటుకానేరవు. ఇప్పుడు తుద కిద్దానిసేకరించి పరికింతము.

కర్త విజయరామకవి. రసజ్ఞు లెఱింగిన "ప్రతిభారవి". భువనగిరి ప్రసిద్ధకులజాతుఁడు. ఈతనియగ్రజు లస్మన్మిత్రవతంసులు శ్రీకోదండపాణిగా "రుత్తరరామచరిత్ర" మతిపేశలమైన శైలి నాంధ్రీకరించియుండ, నీతం డొక్కటికాదు-మున్ముందే "కిరాతార్జునీయము"ను దెలిఁగించి పండితామోదముం బడసినమీఁదట, విభిన్నగుణగణవిశిష్టము లైనగాళిదాసకర్తృకములు "మేఘసందేశాభిజ్ఞానశాకుంతలము"లను శ్రీమదాచార్యవిరచిత 'సౌందర్యలహరీ' 'శివానందలహరు'లను "శ్రీమద్భగవద్గీత"ను దాఁ బునరాంధ్రీకరణంబు లొనర్చినదేకాక, 'లోకకళ్యాణంబు' స్వతంత్రముగను నొనరింపంబూనియున్నాఁడు. అట్టియీతని నొక్కట నొక్కమిత్రవతంసుఁడు "ప్రతిభారవి"ననిపించికోఁజాలితినని మురియుట కాదు. మురారిం జూచిన నెంతటిసరళవాక్కైనఁ బరారికావలసినదే యన్నమీఁదటఁ దా నిది రచియింపంబూనితి ననుచు నిందలిపద్యములం దెచ్చి యథామూలముగాఁ బరికింపుమని కోరుచు మాకుఁగలసోదరన్యాయమున నన్నిటియట్ల నాయొద్ద విడిచెను. కొంతకాల మైనవెనుక,

"ఉ॥ నాకడసారిపిల్ల పయిన న్గలమక్కువ పెక్కువ న్గుణా
ల్రాకడఁ గోర్కెమై, గురుకులక్రమశిక్ష లభింప సాధువా
క్ఛ్రీకరు లైనమీకడకుఁ జేర్చితిఁ, గందువకందు పేరుటు
ల్లాకున గర్వి కాదుగద! లక్ష్యసమన్వితయై చెలంగునా?"

చ॥ అనఁగలకల్పుకోల్చెలిమి నందుకొన, న్గొనలందు సాధువే
యనఁగలకల్పనన్ జెలఁగునా, తనమాతృకమాద్రిఁ ప్రౌఢగుం
ఫనముల మానకాదుకద! మాటకుమా టెసకొల్పి వ్యంగ్యవ
ర్తనమును మానకే, భవదుదంచితవత్సలతన్ గడించునా!॥

ఉ॥ అంకపుసందునీక, భవదంకపుఁ బొంకము మేల్మికల్మి, స
ప్తాంకములందు, దివ్యఘటితాంకయుతంబుగనై, సదస్యస
ర్వాంకవిజేతృతన్ వెలయునట్లయి, నాకడసారిబిడ్డ నా
యంకముఁజేర సాగుననునంకముకై కుతుకంబు గాంచెదన్॥

అని వ్రాసినదానిలోనే పాఠకలోకమున కీతని రసవత్కవితా నైపుణ్యము చూపబడుటగాదే! అందుల కీయనైనప్రత్యుత్తర మిది చిత్తగించునది.

చ॥ అవిరళకీర్తిధాముఁడు మురారిమహాకవి, తా ననర్ఘరా
ఘవ, మిల, నారికేరగతిఁ, గల్పనసేయఁగ దృశ్యకావ్యముల్.
"భువనగిరిం" జనించుటను, బోలదె నీ కది భేదిలన్ ? వచః
ప్రవణలసచ్ఛవీ! విజయరామకవీ! రచితాంధ్రభారవీ!॥

మ॥ సకలాంధ్రీకృతపద్యజాలములు, "తూ–చా" తప్పకుండంగ, 'మ
క్షికికిమక్షి' యనులెక్కఁగాక, రుచిరోక్తిస్ఫూర్తి దీపించుపూ
ర్వకవిశ్రేష్ఠులబాట వీడక, స్వయంవ్యక్తిత్వముల్ జూపుచు,
ప్రకటానర్గళభావసంపదురుశోభ స్మిమ్మ, నేఁ గాంచితిన్॥

క॥ "కాలేజిగరల"యయ్యున్
శీలంబును గుణముఁ గల్మి, శృంగారవధూ
ప్రాలంబలక్షణాన్వితఁ
గా లీలఁ బరిష్కరింపఁ గడుఁగూర్చునదౌ॥

గీ॥ తల్లి గడుసైయైనఁ దా మృదుభాషల
కిక్కయాచు నొప్పు నక్కజముగ,
జిలుగుపలుకు లొలుకఁ దెలుఁగుఁదనం బెందు
నిలుపఁగలుగు, నౌర! నేర్పుమీఱ॥

శా॥ మూలంబు న్దరినుంచుకొంచు, నిది, యామూలాగ్రముంగాంచు చో
శైలిం బ్రౌఢిని, గూఢసారతయు, ద్రాక్షారీతికిన్ మార్చుభా
షాలాలిత్యము, నర్థగౌరవము, వాక్చాతుర్యమే, యిందు, నే
మూలన్ జానుగఁ గానుపించుట, యశమ్మున్ జిమ్ముఁ దానిమ్మలన్॥

ఇట్లనుటలో నిజాభిప్రాయము సూచితమైనను గేవల మిది యభినందనమాత్రముగ నెంచకుండుటకై యీయాంధ్రీకర్త రసపోషణ మేయేవిధమునఁ గావింపఁ జూచినదియు దిఙ్మాత్రముగా వివరింపఁబోవుచు మచ్చునకు మూలములోనిభావములఁ బోషించినవిధాన మొక్కింత

యగపఱతును. "విద్యా శ్చతుర్దశ చతుష్షు నిజాననేషు సంబాధదుస్థితవతీ రవలోక్య వేధాః తా భ్యోఽపరాణి నియతం దశ తే ముఖాని స్వస్య ప్రణప్తు రకరో త్స కథం జడోఽసి?" యనుదానికి, (౬-౮)లో మూలములోని దిందుఁ బద్యార్థమనునే యిమిడిపోఁగాఁ దాదిముక్కకు (కథం జడోఽసి) = "మిడిమేలపుజడ్డ మునింగి నీ విట స్థాలి కుమారిల స్థలఁపుఁగొంటివి దెచ్చటినుండి వచ్చెరా? "యని చేర్చుటవలన సకల విద్యాప్రణేతృబ్రహ్మసంతతిసంభూతుండవయ్యు జగన్మాతృకల్పసీతాపహరణ మొనర్చునంతటి కార్యాకార్యవివేకశూన్యతకుం బాల్పడితివే మనుమూలస్థితభావమునకు మఱింతవన్నెఁదెచ్చినది. ఈమాత్రము స్వాతంత్ర్యమైన నూనరాదని యెంచుదోషైకదృక్కులు కొండ ఱిది యమూలకమనియు నామూలస్థితార్థం బేదో యిందుఁ గానరాదనియుఁ దడవ్రుట యెఱుంగుదుము, అట్టికైననులఁ గొందఱు సూత్రిధారుండు పిలువఁగా వచ్చినంటి ఇయమస్మి! యన్నదానికి 'ముక్కకు ముక్క'గా నేనయితి ననుమాదిరి భాషాంతరీకరణంబు లొనర్చుటయుం గందుము. అట్టి వెంతయింపుఁగొలిపి లోకాదరణపాత్రములు కాఁగల్గునో యోజింపుఁడు. అవి యడుగుబద్దతోఁ గొలిచిసరిపుచ్చఁజాచు గణబద్ధవాఙ్మాత్రములే యగును. ఉచితజ్ఞత వెలయించుస్వాతంత్ర్యమగపఱపఁగలిగిననే కవిత్వమనిపించుకోఁగలుగు నన్నది రసజ్ఞహృదయైకవేద్యము. ప్రత్యేకమూర్తిత్వవిభ్రాజత్కీర్తిసాంద్రంబు లౌబహువిధ సుప్రసిద్ధగీర్వాణకవిశేఖరవాగ్జాలంబుల నలవఱచికొఁ జాలినయీయాంధ్రీకర్త వాగ్రీతి నిజనైపుణ్యమగపఱుప సముచితస్థలంబుల నన్వేషించుకోఁజాలు ననుటలో నబ్బురము లేదు.

నలుదెసల నొక్కటఁ బొడసూపినయీచతుర్ముఖములఁ బ్రపౌత్రునిదుర్వృత్త 'మాచెవి నాచెవి బోవ'ప్పాడు 'విష్వగ్వృత్తిచే, నల్వయాతెఱఁగై యాతలవంపుల స్గొదచునో!' యనుటలో 'అసంగతా నమయితుం' (౫-౧౪) అన్నది ధ్వనిమాత్రవ్యంగ్యముగా స్ఫురింపఁజేయఁబడదయ్యెనా? చూడుఁడు. రఘురాముసకుం బరశురాముండెదురై, 'యీశకరపీడనపీతసారం'బై 'తునిగవిల్లు నిమిత్తమాత్రుఁడవెనీ'యనుచు, 'ఆకర్ణకార్ముకం గరుడధ్వజస్య' యని చేతికిచ్చుటెఱిని, 'చాలుదేస'

న్వీకరించి యని యనువదించుచో మూలస్థిత 'భ్రమర'శబ్దమునే గ్రహించుట భ్రమణశీలత్వధ్వనిసంపాదనమునకొఱకే యని గుర్తించి ముదమం దుదము.

'అథేదే నోపాస్తే కుముద ముదరేవా స్థితవతో విపత్పా దంభోజా ముపగతవతో వా మధులిహః అపర్యాప్తః కోపి స్వపరపరిచర్యాపరిచయ ప్రబంధ స్సాధూనా మయ మనభిసంధాన మధురః (6-6)" అని కుముదవృత్తమునకును సాధువృత్తమునకును మూలమం దుపమానోపమేయభావరూపవ్యంగ్యమూపాదించిన ఓటుండ "కోకః ముత్ సంతోషో యస్మాత్" తను వ్యుత్పత్తిచే ఘూసంతోషప్రద శ్రీరామచంద్రమూర్తియు 'అంభోజా'శబ్దగ్రహణంబున నిందిరాభిన్న జానకీదేవియు, 'మధులి'ట్ఛబ్దమువలన వానరరాక్షసులును 'ఉదర'శబ్దలక్షణార్థగ్రహణంబున స్వసేనాస్థితులు ననుస్మరణముకూడఁ గలుగునవకాశ మొదవ నయ్యెడు, నది తెలుఁగులో నొప్పింపఁబడెనా యని ప్రశ్నింతురేని, నానార్థనిఘంటుసాహాయ్యమున మైదాపిండివలె సాగింప నానానిర్జర వాక్కులపొందిక నెందు నందింప వలనుపడదన్నది తత్ జ్ఞతకల్మిని విశదముకాఁగలదే కాన 'సాధు లెప్పుఁ దనవారొరులం చెడసేయఁబోవకే వినుతుకు సేవ నెవ్వరికినేని సుధామధురక్రియాధురీణ" అనునర్థాంతరన్యాసమునందలి వాక్సుధామధురక్రియారూపధురి నోలలాడి దాన సంతుష్టి నందవలసినదే యని చెప్పకతీరదు. ఇట్టికవితాధురీయయ్యు స్వభావోక్తి నొప్పించుచొప్పుగా 2 24 లో 'శ్రమ వదలి నిలిచి నిలిచి యెట్లుప్రవహించెడినో' యనునది గమనించునది.

"స్యాదేవ తోయ మమృతప్రకృతి ర్యదిస్యా న్నైకకాంత మద్భుత మిదం పున రద్భుతం నః లక్ష్మీం సుధాకర కౌస్తుభ పారిజాత ధన్వంతరి ప్రభృతయో యదపాం వివర్తః (7-12)" అనుచోఁ పారిజాతమైననేమి వేల్పుగిడ్డియైననేమి యిష్టార్థప్రదం బౌనట్లుగానే "అయిన న్గాదగులే సుధాప్రకృతి యీయంభోధినీరంబు వింత యొకింతేనియు లేదు దాన, సిరియుఁ, జాబిల్లియుఁ, వేల్పుగిడ్డియు ధన్వంతరి, కౌస్తుభాదు లటఁ బుట్టినన్గఁ త్రైలోక్యవిస్మయమానాద్భుతగాథకాదె" యని తుదకు

'మహీశ! సంద్రంబు సామాన్యమే?' యనికూడఁ జేర్చుటవల్ల సుధా-ప్రకృతి యైనీకవితారసాంబుధిమహిమంబు నసామాన్యంబ యని తోఁప నిందలి యాయారసంబులం జవిచూత మనిపించును.

ఇది వీరరసప్రధాన మహానాటకముగాన ముందు రౌద్రవీరాద్భుతము లొప్పించినవిధమును బరికింతము. అవి యెక్కువగాఁ బరశురామ ఘట్టమునను నడుమ నాయారాక్షసులతోఁ దలపడినసందర్భములం దుదకు రామరావణసంగ్రామమందు నత్యధికముగాఁ గాన్పించుచుండును. 'కల్పాంతకర్కశకృతాంతభయంకరంబు' (6-77) నాఁగా 'సకలభూమిని నీరాక్షసం బొనర్పనిడుతఁ బుణ్యాహమంగళం బీధనువు' (6-33) అనుచుఁ గౌశికయాగంబుఁగాచి "దిక్కూలంకషకీర్తిధౌతంబు"గా "ఎంతెటి మేటిరాజులకు నేనియుఁ దేటికనంగరాక భాస్వంతమునై సమస్తసుర సంఘకళాపరిపూర్ణసారసంక్రాంతి నెసంగు శంకరుని కార్ముకరాజము నెవ్వఁ డాతఁ డిం తింతలుగాఁగఁ ద్రుంచె నపుడే" (4 16) అన్నదియు, 'అలశివు నష్టమూర్తు లొకటై కదియంబడె, నష్టదిక్తటుల్ వ్రలపల మ్రోఁగె, నల్వచెవుల న్గడుగింగురు పోఁకె నెన్మిదౌ కులగిరు లయ్యె నుగ్గురగకోటి కులాష్టక మక్షులా శెక ద్దో ర్బలరఘురామకర్షితపురారాతిశ కార్ముకభేదనధ్వనిక్' (3-54) అన్నదియు విన్నంతనే శివధనుర్భంగం బెంతయద్భుతావహంబైనదియు మూలాతిరిక్తముగాఁ బ్రదర్శిత మయ్యెననిపింపకమానదు.

అంతతోఁ బోయెనా? ఆధ్వని 'కృ[illegible]ష్వప్రియంభావుక' నారాచుండై 'హేలామాత్రముగా సమూలముగ భూమీశాన్వయస్తోమముల్ కూలంజేసిన' యా 'విపులభుజశిలాస్తంభ విభ్రాజమానజ్యాఘాతశ్రేణిసంజ్ఞ' నకు శ్రుతిపుటగోచరమైనంతనే "ఎంతో యాఁకట న్నాదుగొండ్లి యి ట్లీతనికోసమై వెదకఁ జెందెన్ జండవహ్నిక్రియ" నని తెలుపడగా, "జాతస్నేహం దినకరకులక్షత్రియ శ్రోత్రియేభ్యో విశ్వామిత్రాదపి భగవతో దృష్టదివ్యాస్త్రపారః అస్మిన్ వంశే కథయతు జనో దుర్యశో వా యశో వా విప్రే శస్త్రగ్రహణగురుణః సాహసిక్యాద్బిభేమి", (4-49) అనికదా రాఘవుండుపలికి, యేమైనను

"దుర్మదబాహుం డగు కార్తవీర్యుని సహస్రసముద్ధలహస్తాళిపైఁ బొదలం జేసిన నీభుజాబలము పెంపుఁ జూపుమా నాపయిన్," (4-53) అని డీకొన్న యెడఁ "బులిపయిపుట్రిగా గురుధనుస్సును ద్రుంచుటఁ బ్రోదిఁ గూర్చె" (4-54) ననుటంగొని లోకోక్తిగ్రహణమువల్ల నిట మఱింత ప్రోదిఁ గూర్చెడినిగాదే! ఇంక భయానకంబుగా "కౌశికయాగమే మొదలుగాఁ బగ రాఘవసూనులందు లంకేశున కిప్డు బంధువులునే స్తాతులైరి, త్రిశక్తిసంభృతా వేశుఁడు, మాయలాఁడు, బలవిక్రముతుఁ డెమ్మెయి ముక్కులుంజెవు ల్గాశిలు చెల్లిమోముఁ గనినన్ మది సైఁచునో రేఁగకుండఁగన్" (5-5) అన్నప్పటిస్థితియుఁ 'బులిపయిపుట్ర' యన్నట్లే తోఁచును. దాన భీభత్సంబు దోఁప-'వానరదైత్యసంచయకబంధము లేగతి నిప్పుడైన లోకానకు భీప్రదస్థితులఁ గన్పడునో! వెయి నెత్తురేఱు లంభోనిధిక్రొత్తభార్యలుగఁ బొర్లుఁ బాఱునో! వేలవేలుప్పం జానలు నూత్నవీరవరసంగతిఁ గాంచునో!' యనిపించును. తుద కెట్లైన జమదగ్నిసూనున కైనట్లే "సిగ్గలముకొన్న" మీఁదట "శివాస్తే పంథానో వ్రజ నిజగృహేభ్యో నిజగృహాన్ కిమన్యత్సర్వేషాం గుణమయశిరోమాల్యమపి నః" అని శాంతవాక్యములకు దిగినమీఁదటఁ గరుణంబు దీపించు ఘట్టములు మదికి రాఁగా శ్రీరాముఁడు భరతునితో "అయ్యయో! యెంతపాలెను ద్వ్యంగము! వెన్నెలకంబ నయ్యోనే మయ్యా! కవుంగిలిం గొనఁగదయ్యా నను న్ముదముబ్బునట్టు, లోయయ్యా!" యన్న సాదరవాక్కు లాలింతుము. అంతఃశ్రీఁ బోక "కడుంగడుం బవలయాకమలాలయ కౌస్తుభంబుపై నెయ్యపుసోదరప్రియత నేకద వీడదు విష్ణువక్షమున్!" అని చమత్కరింపఁగా, నింక శృంగారవిలసితంబైన రోమాంచోచ్ఛ్వసదంగసంధిసిబిడై రాలింగనై ర్యామినీం, శేషీకృత్య విసృజ్య తే నిజరహశ్చాతుర్య మేణీదృశః" అనుపట్టునఁ 'గిరినిడల్లను కౌనుబంటి మలయు న్నేరెంత నేత్రాక్షులతాన్యానందంబుల వెల్లడింతు ననుభూతంబు బ్రహశ్చాతురుల్' అనుటలో 'నాభిదఘ్నము'ను 'గౌనుబంటి' సేయుఁగా కది రహశ్చాతుర్యపేదులకే పసలి "కర్ణోత్తంసయుమాంసరం కరతలే కృత్వా హసిత్వా మిథస్సంహూతాః పురుహూతపౌరయువతీ

వర్గేణ కౌతూహలాత్ గ్రాసార్తిక్షుభితో యమంకవారిణం కుర్వీత కింకిం కలా కంధా మిందుమతీ మజస్ర ఘటనోద్ఘాటశ్లథావస్థితాం" అన్నహాస్యోక్తికిం 'జివరకుఁ గందులేడి మెదిసేయునా! సళ్ళిన చంద్రుగాసెనఁ' అన్నది మఱింతయింపుఁ గొల్పునదిగానే యెంచఁగలుగుదుము. ఆపైనెట్లో కంటఁబడిన యాచందురు నీడక "ప్రత్యాసన్నతుషారదీధితికరక్లిశ్యత్తమోవల్లరి"యై 'రాజన్యూనత్నమృణాళఖండరుచితో రాజీవసంవర్తికా తేజంబు న్మిడిఁగించు, న 'య్యమృతాంశుఁడు ప్రొద్దుక్రుంకిరాన్వీముఖతఁ జూపుతమ్మిగ్రహిణిక శశిపాప మూనఁగా "గౌరాంగీవదనోపమా సుకృతమాదత్తే పతిర్యజ్వనా" మన్నది కన్నంతనే "ఒక్కల్డించి సంధ్యానలశ్వసనంబందు గరంచి పోత నిటులే సాధించి"రో యను దీన "నిందుమురారి" యన్నది మదికిఁ దవులకమానదు. ఇక్కడికే గ్రంథవిస్తరమైనది ఇంకెన్నిటి నిం వెత్తిచూపనౌను.రసజ్ఞులే పరికింతురుగాక!

అట్లుపరికించుచో (5 50) "అడ్డాదిడ్డి"ప్రయోగా లేవైనఁదగుల (3-39) సరీల్న, (4-47)'సవాల్'సేయక తెలుఁగులెక్కువగావాడుచో, 'మూపులెగిరించుకొను' (3-50) మాద్రి జాతీయములకును, 'పూటకాపు' (1-15) 'మిణుకు' (3-8) 'చెట్టబట్టు' (3-12) నట్టు లావాడుక పదాలకును బ్రవేశముఁ గల్పించుట నందముపెంపొందించుపూనికయే యని యథాయోగ్యముగా సేకరింపఁ జూచునది. భక్తివిభక్తుల లోటు లేనప్పు డుపవిభక్తు లంతగాఁ బాటింపమి క్షంతవ్యముకాదా? 12 వ పుటలో 28 పంక్తిలోని బాలులారా! వంటి యచ్చుతప్పులు మీరే దిద్దుకొందురయ్యో. ఇంకఁ గ్వాచిత్కముగా వటుకలహంసికాదిపాత్రములచే నెటనేని వాడనైన గ్రామ్యములను గూర్చి మాత్ర మిం మక ప్రస్తావింతును.

ఇది శిష్టుల కనిష్టమేయైనను బ్రస్తుతకాలవిశిష్టత యద్దానికే సర్వవిధాలఁ బ్రకృష్టతను గల్పించుటలో, నూతనప్రియాభినందనలాలసులౌ పెద్దలనే యందుడించుటం జూచిన యిక్కవి మూలమందుఁ బ్రాకృతమున్నెడ నందును వచనభాగముననే యానడక నడచినముచ్చటఁ దీర్చికొనెను. ప్రాకృతమట్లిది వ్యాకరింపఁబడిన భాషాంతరముగాక యు

"రాకుమారుం' డనువానిచే లగత్తించినట్లే తెన్నుమాలినదయ్యు నుండక తప్పదు. ఈమాత్రమున నీగ్రంథమంతయుఁ బామరలోకసుగమముం గానేరదు. అయినను బ్రస్తుత మిది నిమ్నజాత్యుద్ధరణరూపపురోభిగమ నంబువంటిదే కాదా ? ఇంతకు నిది నాటకమయ్యె. అందు నే నీచపాత్రల నోళ్ళనో పలికింపఁబడినదయ్యె. అది యటుండె.

ఇంక ఛందోవిషయమున నేయఖండయతులో యేతాదృశములో బహుళాధునికకవిప్రయుక్తము లైనవానినిగూర్చి ప్రత్యేకించి వివరింప నక్కఱలేదు. ఏమైనను నానారసపోషక మైనరమణీయపదగుంఫనముఁ గలిగి, మూలమునందలి కాఠిన్యమును జాలవఱకుఁ దొలఁగించి లోకమున కందింపఁబడిన యీనాటక మర్థావిద్యార్థిలోకపఠనీయమై సర్వసంస్కృతభాషానభిజ్ఞతారకంబును బహుళగుణగణ ప్రస్తారకంబునై "యాంధ్రమురారి" కీర్తినిస్తారకం బయ్యెడుఁగావుత !

''ఉద్దామభ్రమివేగవిస్తృతజటావల్లీప్రణాళీపత
త్స్వర్గంగాజలదండికావలయితం నిర్మాయ తత్పంజరం
సంభ్రామ్య ద్భుజదండపక్షపటలద్వంద్వేన హంసాయిత
స్త్రైలోక్యవ్యయనాటికానవనటస్స్వామీ జగత్త్రాయతామ్॥"

బందరు
15-5-49

ఇట్లు, సుధీవిధేయుఁడు,
నాదెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రి

# కవికృతులపైఁ బండితాభిప్రాయములు

ఆంధ్రమేఘసందేశముపై శ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి కవిగారు 3-1-1937 :—

చ॥ సుభువనగిర్యుపాంకకవిసోమ! యశోవిభవాభిరామ! వా
క్ప్రభ గురుఁ డుబ్బి మున్ను 'ప్రతిభారవి'యంచనె, నేఁడు దాన నీ
వభినవకాళిదాసబిరుదాంకమునుం గయికొంటి వుగాపుతన్
సభలకు నెక్కె నీకృతి ప్రశస్తిఁగనన్ జయరామనామకా!॥

19-5 1936 న మాధవశతకాదులపైన :—

ఉ॥ వింటిని మున్నె త్వత్కృతుల పేరుల విం దొసరింపఁజేయఁగాఁ
గంటిని వానినే యిపుడు కన్నులపండువుగాఁగ నచ్చునన్
దొంటిభవంబునన్ జనని నోచిననోములపంటలో యనన్
దంటలు మీరలై సుతులు ధారుణిఁ గీరితికెక్కఁ గల్గిరా॥

ఉ॥ సారవిహీనపుంగృతులు చాలఁగ నచ్చయి మేలుఁగూర్చునే?
యారవితారకంబులు రసాశ్రయభావవిశేషభవ్యశో
భారవితేజము ల్సుకృతివర్యముల న్భువి నిల్పుధీనిధు
ల్భారవిముఖ్యు లాట నెటువల్కినఁ దచ్చరితంబు లింపులౌ॥

ఉ॥ శైలి మనోహరంబగు రసంబులఁ జిల్కు వచఃప్రచారధా
రాళత యొప్పఁటం గురులు రంజిలనే సిగ చుట్ట నందమా
లీలను నీకృతు ల్మదిఁ దలిర్పఁగఁజేయవె? మాధవాదృతిం
గ్రాలునభీష్టముల్ విజయరామకవీ! రచితాంధ్రభారవీ!॥

ఆంధ్రభగవద్గీతపై శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు, శతావధానులు, 25-10 48 మీరు ఎంతయోప్రతిభతో వ్రాసినగీతలు చూచి చాలనానందించితిని. భాషాంతరమునకు లొంగనటులు కనఁబడె డుపలు శ్లోకములు మీకండదరువునఁబడి చచ్చవుకముగా తెలుఁగుమీఱెను. మీయీకృతి నింకొకమాఱు కొండాడి విరమింతును.

శ్రీమద్భాగవతాంధ్రీకర్త యగు శ్రీమాన్మడుంబ సింగరాచార్యవర్యులుగారు. జగ్గయ్యపేట 3-5-49 విద్యార్థికిఁ బాఠముఁ జెప్పుసందర్భమున (మీ) యాంధ్రకిరాతార్జునీయమును జూచుట సంభవించినది. "భారవేరర్థగౌరవమ్" అను ప్రసిద్ధి తెలుఁగుకావ్యములోఁ బ్రత్యక్షము కావింపఁబడినది. (మీ) "భారవి" యను స్వతంత్రకావ్యమునుగూర్చి యెంతవ్రాసినను జాల దని నా యభిప్రాయము. పూర్వకవులపక్కిలో సర్వాంగసుందరముగాను సర్వలక్షణసమన్వితముగాను ఉన్నదని చెప్పుటలో నేమియు సందేహము లేదు. మీయాంధ్రాభిజ్ఞాననాటకమును జూచి మిక్కిలి సంతసించితిని. మూలమునందలి భావములను సరిగా నర్థముఁ జేసికొని చక్కని తెలుఁగులో నిర్దుష్టములైన పదపదార్థముల పొందికతో ఇది కూర్పఁబడినది.

కొవ్వూరు సంస్కృతపాఠశాలాముఖ్యాధికారి శ్రీ కె. వి. నృ అప్పారావుగారు 6 5-49 మీయాంధ్రాభిజ్ఞానశాకుంతలము నామూలాగ్రముగాఁ జదివితిని. ఇప్పటికే యిన్ని యనువాదము లున్నవే! ఇదియు నేల? అనిపింపక కొన్ని క్రొత్తపోకడలచే దనవిశిష్టతను స్థాపించుకొనుచున్నది. తమయనువాద మిప్పటికున్న యనువాదరత్నములలో నొక రత్నమై ప్రకాశింపఁగలదని నావిశ్వాసము.

శ్రీ అడిదము రామారావుపంతులుగారు, సీనియరు తెలుఁగు పండితులు. M. R. కాలేజి, విజయనగరం :—14-5-1949

మీయాంధ్రీకృతశాకుంతలమును శ్రద్ధమై నోపికతోఁ జదివి యానందించితిని. అంకములతుదల మీరు పొందుపఱచిన స్వాంతపద్యములో నుడివినట్లుగ "సుపేశలోక్తిమధురవ్యాపార మేపా" రుచు మీయనువాద మెంతయు హృద్యముగా నున్నదని నామనవి. అచ్చటచ్చటఁ బద్యములకుఁ బాఠాంతరములుగ వేఱుపద్యముల నిచ్చుచు వచ్చితిరి. అట్టిచోట్లఁ గలపద్యములలోఁ జిన్నపద్యములే కడుంగడు మిన్నగా నున్నవని నాయాశయము. 8 పేజిలో 15 వ పద్యమున "మంచియాకృతి కేదికాదు మండనంబు" ఈపద్యపాద మెంతయు ముద్దులు మూటగట్టుచున్నది. ఇంక శిష్టజనవ్యవహారభాష యాలం

శారికమతానుసారముగ మీ రాచరణలోనికిఁ దెచ్చుట మీ గ్రంథమునఁ జూపట్టు క్రొత్తందనము, గాని యది నిరక్షరాస్యుల వాడుకకు దగ్గరకాకుండ నచ్చటచ్చట సంస్కరింప నవసరమా యని నాయోచన, పండితప్రకాండులును గవితల్లజులు నగు బ్ర॥ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారును, మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులుగారు మున్నగువారి యభిప్రాయములే చాలును. ఇంక మఱికొన్నిటిం జేర్చునగత్యము లేదనినా తలంపు ప్రాక్తనపుణ్యవిశేషముచేత మీకు నిస్తులకవితావిభూతి యలవడినది.

శ్రీయుత K. V. N. Apparao మహాశయులు M., A. Principal, Sanskrit College, Kovvur, 22-5-49 'తమ రంపిన' "అనర్ఘరాఘవము" నాంధ్రీకృతిని గృతజ్ఞతతో నందుకొని ఆమూలాగ్రముగఁ జదివితిని. తాము చేసినకృషియు, పడినశ్రమమును గ్రంథమున స్పష్టముగాఁ గన్పించుచున్నది. అనువాదమన్నదే కష్టము. అందునను, మురారివంటి ప్రౌఢకవి ననువదించుట కష్టతరము. అయినను దా మిందు సఫలురైరనియే నాతలంపు :—

మ॥ తతసారస్వతదుగ్ధవారిధికి మంథానాచలంబై సుధా
ప్రతిరూపంబు "ననర్ఘరాఘవము" నుత్పాదించె మున్నా మురా
రి; తదాస్వాదపినాకృతుల్ దనియ నాంధ్రీకర్తవై బల్సమ
ర్థత మీ రిచ్చితి రిప్డు డాసుధను నేత్రశ్రోత్రపేయంబుగన్॥

శ్రీమద్భాగవత 11 వస్కంధమును సమర్థతతో మనోహరముగఁ దెలిఁగించిన బ్ర॥ ఉభయభాషాప్రవీణ, వేదాంతపారీణ, మిన్నికంటి గురునాథశర్మగారు, ప్రధానాంధ్రోపాధ్యాయులు, హిందూకాలేజి హైస్కూలు, గుంటూరు. 31-5-49 ప్రతిభారవీ! తమనుదయతో నొసంగిన శ్రీ మదాంధ్రాభిజ్ఞానశాకుంతలమునుజూచి, కవియైనవాఁడు రామకథంబోలె శాకుంతలముగూడఁ దాఁకవలయునాయేమి? యని లోఁదలంచుచు నట్టె పుటలవిప్పి చదువుచుంగదా! ఇఁక నేమన? హృదయము గిజ్జుంపనిండి పొర్లుచు దరుల నొరయుచున్న యానందరసము నట్టె భరింపలేక వాగ్ద్వారపుటలువుఁ జూపవలసివచ్చెను. మహాకవీ! మీ

కవితాధార సుధాసారానుసారియనుట యమృతము తియ్యగనున్న దను టయే. సందర్భోచితశబ్దములతోఁ బద్యముండుననుట రాకాచంద్రబింబము కళలతోఁ గూడియుండుననుటయే. అరితేటిన మీకలమున వ్యర్థపదము లురలంబడవనుట సూర్యగోళమును దిమిరపటలములు చేరవనుటయే. భారవి మున్నుగాఁ బెక్కుపొత్తముల వ్రాసిన మీరు చక్కఁగాఁ గవిత్వము వ్రాయఁగలరన్నచో నాబోంట్లనచార మొనర్చుటగాదే ?

జిలిబిలి తెలుఁగుఁబలుకురవ్వల నెచటఁ బొదుగవలయునో, బంధుర సాంస్కృతిక బంధానుగంధము నెచట సంధింపవలయునో, యలఁతియలఁతి పదముల నెచటఁ జిలుకవలయునో, దీయని జాతీయముల నెచట నేయవలయునో, ఏవృత్తము నెత్తటి నెత్తికొనవలయునో, ఏయవసరమున సమరసవిసరము బుసబుస పొంగులువాఱ విసరవలయునో, ఉభయకవిమిత్రా ! మీకుఁదెలిసిన ట్లొరులకుఁ దెలియదనుట సాహసోక్తిగాదు.

అచటనచట నొకేభాగముగల రెండురెండు పద్యములుంటచే నేమోకాని, లేనిచో, మీ శాకుంతలమాంధ్రీకృతముగాఁగాక స్వతంత్ర కృతిగా నున్నదని యే కవితామర్మజ్ఞుఁడు తలంపఁడు ? గీతానర్ఘ రాఘవములు-సరే-వ్రాసితిరి. ఐపోయినవి. ఇటుపైఁ బూర్వులంబోలె 'నవారిత సత్కవికల్పనావిభూషావహ పూర్వవృత్తములు సానలఁ దీటినజాతి వృత్తముల్'' గావున నట్టి క్కావ్యముల్వ్రాయ దీర్ఘాయురారోగ్యములు మీకుఁ బ్రసాదింప భగవంతుని బ్రార్థించెదను.

## అభినవసరస్వతి - 1937 జూను సంచిక

''భారవి:-ఇందలి కవిత్వము మృదుమధురభూయిష్టము. మిక్కిలి మనోహరము. లోకోక్తులనేకములు. అవధానమందలి యాకాశపురాణమున భారతకథ పలుపద్యముల బాగుగాఁ జెప్పించిరి. కవితాస్వరూపమునుగూర్చి పెద్దనాదుల మాలికలవంటి పెద్దపెద్ద మాలికలే అల్లించిరి. ఏ పట్టునఁ జూచినను నెంతయు రసముట్టిపడునట్టు వ్రాసిరి.''



# శ్రీ సౌందర్యలహరి - మచ్చుపద్యములు

ఉ॥ పూలె ధనుస్సా? తేంట్లె గుణమో? విశిఖా లయిదేనా? చల్లనౌ
గాలియె పోరుతేరా? దరికాపు వసంతమొ? వీనితోనె మే
న్మాలినవాఁడె యొంటరి సమర్థత గెల్చుటొ లోకమంతయున్?
శైలసుతా! ఇదెల్లఁ గృప చాల్కొను నీకడకంటి వెంపెగా!॥

ఉ॥ నీకడకంటిచూపు పడునే నతఁ డెట్టికురూపి వృద్ధు న
రైన్మకజడుండునైనఁ బరుఁగెత్తుదురే బడి వేలజవ్వనుల్
రైఁకల కొప్పుపైఁట పడ, వ్రాలుచుఁ గొప్పులు తూఁగియాడఁ, గాం
చీకలనంబు వీడిచనఁ, జేలము లూఁడ, నెఱుంగ కీశ్వరీ!॥

చ॥ తిరుగుటయే ప్రదక్షిణము, తిండియె యాహుతి, నేల వ్రాలుచున్
బొరలుటయే ప్రణామ, మెదొ పొర్లుగవాగుటయే జపంబు, శి
ల్పరచనలన్ని ముద్రలు, నవాప్తమదీయసుఖాలు సేవలై
వెలలునుగాత నీకు సదుపాస్తి మదాత్మసమర్పణంబుగన్॥

మ॥ కవ గోమైన'విశాల'గా, రుచులు నిక్కన్నేటి"కళ్యాణి"గా
కువలవ్రీడి 'కయోధ్య'గాఁ, గృపకు నిగ్గున్ "ధార"గా "భోగవ"
త్యవతంసంబుగ, నిద్దమా"మధుర" ని"త్యావంతి"గా, నేల్పురి
ప్రవరజ్యేష్టత నీదుదృష్టి "విజయ"త్వప్రౌఢ మా నీశ్వరీ!॥

శా॥ కెంపు న్వజ్రము నీలము న్దగడు నక్షిత్రైకసౌభాగ్య మూ
హింప న్ముమ్మఁ బవిత్రిల న్నలుప నెంతే న్నిక్కృపాపూర్తి సిం
డింపన్ శోణగ, గంగగా, యమునగా నిల్పొందినట్లా విచా
రింపన్ మూఁడిటిసంగమం బటనె సిద్ధించుంగదా! ఈశ్వరీ!॥

చ॥ భవు బహుశౌర్యగాథల విపంచిపయి న్బలికించువాణి, నీ
"వవురవురా!" యటంచుఁ దలనాడిచి పల్కిన నాకలోక్తి నెం
తో వెలితిచే నపశ్రుతులతోఁ జెడుతంత్రులవీణె గొబ్బునన్
గవిసెనలోన దాఁచుకొనుఁగా! పెనువిస్మయ మూఁప! నీశ్వరీ!॥

—o—

# శ్రీ మ ద న ర్ఘ రా ఘ వ ము



శ్రీమద్రామ గుణాంబురాశి స్వమనశ్శ్రీఁజిల్కి పేరాద్భుత
గ్రామాపూర్వవచఃపరంపరితధారాళోరుధారాఝరీ
స్తోమావేశముతో మురారి కళఁబొందు ల్కూర్ప నద్దాని కాం
తిశ్రీమాధుర్య మిడన్గడంగునెడ నర్చింతున్ దదౌన్నత్యముల్॥

## ప్ర స్తా వ న ము — నాం ది

శా॥ శ్రీకామోదికి తోడుగాఁగ భగవచ్ఛ్రీమూర్తి యేకన్గనన్
గోకప్రీతిఁ జకోరపారణము వల్గుజ్యోతులన్గూర్చి నా
భీకంజంబున నర్థబోధ దరసుప్తి న్గంబుసాపత్న్యమున్
బ్రాకెత్తించునో, అట్టికన్గవను నిష్ప్రత్యూహ మర్చించెదన్॥

మఱియు,

చ॥ ప్రళయ మడంగ బొ డ్డునికిపట్టున నాత్మభువుండు ముజ్జగం
బులతొలిశిల్పి సృష్టికని పూనఁదలంచి, యెదెందునుండికాఁ
గలదొ వ్యవస్థయెట్లొ యెఱుఁగంగఁ బ్రతిక్షణ మేరిబొజ్జలో
పలికిని బోవు, నాసకలవంద్యజగన్నిధి కేను మ్రొక్కెదన్॥

సూత్రధారి:—ఓహో! ఏమందో! క్షారపారావారతీరకాంతారవారం
బునకుఁ దమాలభూరుహకందళంబై త్రిభువనశిరోలంకారభూతమహా
నీలమణియై, లక్ష్మీకుచకుంభద్వయకేళీరచితకస్తూరికాపత్రాంకూర
మైనశ్రీపురుషోత్తమభగవానునిరథయాత్రికొఱకై చేరినసభాస్తారు
లారా! ఎవియో ద్వీపాంతరమునుండి వచ్చినకలహాకందళుం డను
కుశీలవునిచే రౌద్రభీభత్సభయానకరసపూర్ణ మైనయేదో ప్రబంధము
నిత్యము నభినయింపఁబడుచుంటచేఁ బ్రజలెల్లరుఁ గంపితు లైపోయిరి
గదా! కావున, నెద్దియే నభిమతరసప్రసిద్ధ మైననాటకముఁ బ్రద
ర్శింప ననుజ్ఞ నిచ్చి నాట్యవేదోపాధ్యాయుని యనేకనాటకములలో
నంతేవాసియై మధ్యమదేశవాస్తవ్యుత న్బరఁగుసుచరితనాముఁ డగు
యీభరతపుత్త్రుని మీ రెల్ల రనుగ్రహింతురుగాత!

గీ॥ ఏజనములకు రంగమే యెల్లబ్రతుకొ
ప్రియమె వారికి సభ్యులప్రీతియనఁగ
దాని దొంగిలి చనినట్టివాని గెలిచి
యిట్లిదే తెచ్చుకొనువాఁడ నిపుడెదాని।

(వినుటనభినయించి) ఏమనియెదరు ? నీవు దేశాంతరమునుండి వచ్చినవాఁడవు. ఎందుకు వట్టిప్రగల్భములనియా ? (నవ్వి) పెద్ద లిట్లందురా ? తమబోంట్లసభను సేవించుప్రయత్నమే సంపూర్ణ పాత్రాసాదనసామర్థ్యము నొసంగుఁగదా ! కనుఁడు.

గీ॥ న్యాయమగుబాట విడువనియట్టివాని
కగునుబాసట తిర్యక్కులైనఁగాని,
చెడుగుదారిని బడిపోవుచెనటిజనుని
దవ్వుగా వీడిచను సహోదరుఁడుగూడ॥ 4

(వినుటనభినయించి) ఏమంటిరేమంటిరి ! అట్లైన నిదిగో చీటి నంపెద మనియా !

(నటుఁడు ప్రవేశించి చీటినొసఁగును.)

సూ: — (అందుకొని చదువును)

మ॥ తనియఁగ శాస్త్రసుధ ల్లతంబులుగఁ జేతశ్శుక్తిఁ బెల్లాని క్ర
న్నన వాంతాక్షరమూర్తిమౌక్తికకళానద్ధోక్తిహారావళు
ల్తనర గూర్చినకావ్యము ల్విరిసి తత్తన్నాయకోత్కృష్టస
ద్గుణభూషాయుతమై సుహృద్గళముల న్డాగాడుచుండున్గదా॥ 5

కావున నెందు సమస్తపురుషార్థరసములుం జిప్పిలుచుండునో అట్టి,

క॥ వీరాద్భుతరసగంభీ
రారంభోదాత్తవస్తుహారిశుభకథా
పూరితమై జగదుత్సవ
నీరద మగునాటకొఁటికె ని న్వరయిడుటల్॥ 6

(వితర్కించి మందహాసమున) మారిషా ! వింటివా రామాయణ మనుదానిని ?

న: — అదియేమి ?

సూ:—భగవానుఁడును కవిత్వావతరణమున కాదిమోపాధ్యాయుఁడు నగువాల్మీకిమహామునియొక్క వాణీనిస్సరణమునుమా! ఇక్ష్వాకుల కీర్తికాయమది!

న:——కాకేమి.

సూ:——ఆకథకు సంబంధించినదే సభ్యులయానతి.

న:——(నవ్వి) ఎల్లకవుల కవితావ్యాపారముల కీవాల్మీకిసుభాషితము సాధారణమూలధనాంగణమయ్యెఁగదా!

సూ:——మారిషా! ఏమనుచున్నావు!

ఉ॥ అమ్మొయిఁ రాక్షసేంద్రుఁడు మహార్తి జగత్త్రయి నేడిపించు టెం
కమ్మొయిఁదార్క్ష్యకేతనుఁ డహర్పతివంశమునందుఁ బుట్టు టెం
కమ్మొయి మానివాక్కులు స్వయమ్ముగఁ గావ్యరసాప్తి వెల్లుటల్
ముమ్మరమై సమస్తకవిపుణ్యము లమ్మొయిఁ బండుటేగదా!॥ 7

అందుఁగూడ సదస్యజనాజ్ఞానురూప మగురూపకమునుగూర్చి యోచించెదను. (కొంచెమాగి) (జ్ఞప్తిదొలకునుల్లాసమున) మాద్గల్యగోత్రసంభవుండును మహాకవియు నగుభట్టశ్రీవర్ధమానుని తనూజుండును తంతుమతీహృదయనందనుండు నగుమురారికృత మగు నూత్నమైన "అనర్ఘరాఘవ"మను నాటక మొండుకలదు. దానిం బ్రయోగించుటకు సామాజికులనందఱ వేడుచున్నాను. (యోచించి సంతసముతో) ఈపరిమత్తు నారాధించుట కెట్టిరమణీయసామగ్రీ సంపత్తుకుదిరినది.

చ॥ తగు రసపాఠగీతిగతి దక్షుఁ డొకొక్కఁడె మానటాళి! యె
న్నఁగఁ గవి ముద్గలాన్వయుఁడు నవ్యగభీరరసామృతోక్తిపా
రగుఁడు! గుణోత్తరుండు రఘురాముఁడె నాయకుఁ! డాచరిత్రి ధ
న్యగతిగ దివ్యవాణిని బొనర్చెఁ బ్రచేతసూతి దక్షత౯॥ 8

ఎంతమందిచేతనో యెన్నివిధములుగనో రచియింపఁబడిన యీ ప్రాచేతసకథావస్తువునే యీశ్రోత్రియపుత్త్రుఁడు నాటకంబుగ నొనర్చియు నపరాధి కాఁజాలఁడు. కనుము:

ఉ॥ ఎందఱో రాముగాథ రచియించిరటంచును వ్రాయమానఁ బృ
థ్వీం దదమేయదివ్యగుణదీపితు డన్యుఁ డొకండు కల్గెనే!
చెందుదురెట్లు తద్గుణవిశేషగభీరసుధోక్తిమాధురీ
సుందరవాగ్విరించనులు చొక్కముగాఁ గృతిసార్థకత్వముల్॥ 9

కావున, స్వయముగాఁ దనముఖమున నావిర్భవించినసరస్వతిఁ గలయాదిమగురు వగునల్లప్రాచేతసునివాణి నిక్కవి యీనాటకము రచింపంబూని యిట్లు వినుతించెడి.

గీ॥ స్వర్గమందుండి పృథివికి నిర్గమించు
వాణి కధ్వశ్రమంబును బాపుకొఱకు
ఎవరు విశ్రామశాఖగా నెసఁగిరనతి
దూరమం దాఋషికి నమస్కార మిడుదు॥

మఱియు,

గీ॥ నాల్గుస్రోతలు గలిగిన నలునకంఠ
మనెడిచదుకంబున విహారణము సల్పు
జాణ, నిత్యప్రగల్భవాచాల యైన
దేవికి సరస్వతికి భక్తి సేవఁ గూర్తు॥ 11

నః— (సంతోషముతో) బావా! బ్రహ్మర్షులగు ముద్గలాన్వయులలో శ్రేష్ఠుండై "బాలవాల్మీకి" బిరుదమును వహించినమురారియొక్క సుధారసబిందువులఁ గురియువాఙ్మయమునకై నామానసము కుతూహలము గుబ్బతిలుచున్నది. ఉపక్రమింపఁబడుఁగాక!

సూ:— మారిషా! యుక్తమేసుమా నీయీకుతూహలము!

ఉ॥ అంతమహోజ్జ్వలం బయినదయ్య! కవిత్వఫలంబు, తద్దిగ
కాంతయశఃపరీమళనిగాఢగభీరమనోహరత్వభా
స్వంతము లామురారి నెఱపల్కులో! ఎల్లికజాతువాక్సుధా
త్యంతనిగూఢకూపసవిధంబున గాఁబలుకావు టబ్బనే!॥ 12

(తెరవెనుక - ధ్రువాగానము)

క॥ మొగిడిన తమ్మియొడులలో
దిగులున భ్రమియించునళులఁ దిగుచుమహిమతో

జగమును మేలుకొలుపుదార
తొగరురుచులు దెసలఁ బెంపుతోఁ బ్రసరించు॥ (లేక)

గీ॥ ముకుళితాబ్జాంకపాళి సమ్మోహిత మగు
మధుకరంబు నాకర్షించుమహిమఁ గలిగి
జీవలోక ప్రజాగరస్థితి ఘటించు
దినకరారుణకిరణదీధితులు చెలఁగు॥ 13

సూ:—(ఆలకించి) ఇదియేమి! దశరథు నోడినుండి రామభద్రు లాగికొని కొనిపోవు విశ్వామిత్రుని ప్రవేశమునకై ధ్రువపాడుచున్నారే! (ముందుఁబరికించి సంభ్రమముతో) ఆహా! భగవానుఁడగుబ్రహ్మ మానసపుత్త్రునివసిష్ఠుని యాశ్రమమునుండి తిరిగివచ్చిన ఋత్విజుం డగు వామదేవుఁడు వసిష్ఠుని యాదేశమును దెల్పుచుండ నదిగో మహారాజగుదశరథుఁడు వినుచున్నాఁడు. వారిమంతనములలో నితరు లుండఁగూడదు. మన మనంతరకరణీయముల నాయత్త పఱుతము రమ్ము! (నిష్క్రమము)

ఇ ది ప్ర స్తా వ న ము.



# శ్రీమదనర్ఘరాఘవము

— మొదటి యంకము —

రంగము:- సభ (ఆసనముల నాసీనులై దశరథ వామదేవులు)

ద:—ఆహాహా! ఎన్నిమారులో వినియుండియు వసిష్ఠభగవానుల యీ యనుశాసన మెప్పటికప్పుడే క్రొంగ్రొత్తదిగ నన్ను సంతోషపెట్టు చుండును.

గీ॥ అల్లమధుకైటభుల మెదడగుట భూమి
మురిగి గాలీనుమాంసంపుముద్దసుమ్ము!
దానిఁ దమకీర్తిసురభిసంతతులఁ గోదివి
యనుభవింతురు భూపు లనాదిగాఁగ॥ 1

(వితర్కయుతమందహాసమున)

గీ॥ ఆనఁ దలఁదాల్చి ప్రజనేలుటందె ముదిమి
నెరయఁగాఁజేసెఁ జెవులసన్నిధులకురుల,
నైనఁ బసివాని దిద్దెడునట్లు దిద్దు
నన్ను గురుఁడౌర! వాత్సల్య మెన్నదరమె! 2

వా:—మహారాజా! ఏమంటివి! సమానవృత్తి కలవారలఁగూడ నొక్కొక్కని కొక్కొక్కనితోఁ దారామైత్రి యుండుచుండుంగదా! అట్టులే నీయం దమ్మహానుభావునకు,

గీ॥ రఘుకులోద్భవు లగునెల్లరకును గురుఁడె
తా నయినఁ జూచుఁ బక్షపాతమున నిన్ను
అందఱను దన్పుచుండియుఁ జందురుండు
కలువ తనసర్వమని కళోత్కళిక లిడఁడె। 3

ద:—వామదేవా! ఇంద్రియము లెట్లులాఁగిన నట్లు సంచలించు నాచిత్త సామజమునకు మద్గురూత్తమాదేశము నాలకింపవలయు ననునాశే యంకుశమై నివారించినది. వారింకేమి సెలవిచ్చిరి?

వా:—మహారాజా ! అంతయుం జెప్పితిననుకొందును. అయినను, సకల సందేశముల సంగ్రహసార మైనయిద్దానిని మఱిమఱి నీకుఁ జెప్పుమని యెప్పటికిం దెప్పమనిరి.

దిః—(ఆదరముతో) అవహితుఁడను వారియాన యేమని ?

వా:—

గీ॥ అర్థు లెల్లను నీదుగృహంబునుండి
కోరికలు నిండుగాఁ గొనఁ గూరఁ జనుట
నీదుకులధర్మము న్మఱచితపంబు
నీహితము నీదుయజ్ఞమ్ము నిశ్చయముగ॥ 4

దిః—(సంతోషమున) గురునానఁ జక్కఁగాఁ దలఁదాల్తును. ఎఱిగినదే కదా !

ఉ॥ మాకులకర్తభాస్కరుఁడు మాన్యత నేఁడు సురాగ్రగణ్యుఁడౌ
టేకత నేఁడు జన్మముల నే మొనరించుట, పూజ్యభూమి నేఁ
డే కుదురైనభర్తఁగను, టింద్రుఁడొ నాబల మేరు గొల్వఁ డా
నే కృతినా, నరుంధతి కధీశుఁ డిటుల్లము నేలనేకదా !॥ 5

వా:—ఓ రాజర్షిశేఖరా ! అదియట్లేసుమా ! పుట్టుటతోడనే యంతులేని యైశ్వర్యవిశేషముగల మీబోంట్లే యిట్టికీర్తికిం దగువారు. మేమో ! ఊరక నుపదేశించువారమే.

ఉ॥ శారదరాత్రి శాణపటుశాతమున న్బొరలూఁడకుండియు
న్నైరవమిత్త్రిఁ డక్కలువకాంతల లేపుఁగదా ! ద్వితీయపం
కేరుహగర్భుఁ డన్న పెనుకీరితిఁ గాంచువసిష్ఠమానిబృం
దారకు ప్రజ్ఞఁ జెప్పవలెనా ? కలనా ? జతనం బొనర్చియుఁ॥ 6

ఇటుచూడుము !

ఉ॥ యాజుల రైనమీ రనుదినాభ్యుదయంబుల నేఁడు కాంచుటా
రోజుల నిష్టిపూర్తి సగరుండు మహార్ణవకర్తయౌట, గం
గాజనయిత్రి మీపితల గాథయశంపుఁబతాక యౌట, లో
రాజ ! త్రిలోకసద్గురుతఁ గ్రాలువసిష్ఠుప్రభావమేకదా !॥ 7

మఱియు నొం డిటువినుము !

గీ॥ ఆన మీఱుత్రిశంకభూజాని కప్పు
డల్లకౌశికునండ సంధిల్లికూడ
నిలువఁగానైన యోగ్యత కలుగదయ్యె
స్వర్గమునఁగాని తుదకు నీవసుధఁగాని॥ 8

ప్రతీహారి:–(ప్రవేశించి) మహారాజుగారికి జయము! జయము! భగవాను లగుకౌశికమహర్షులవారు ద్వారముదరి కేతెంచినారు.

ద:–(సంభ్రమముతో) ఎట్లూ! కౌశికభగవానులే!

ప్ర:–అవును మహాప్రభూ!

ద:–ఎవరైన రక్కుడ!

వా:–నేనెదురేగి శ్రౌతవిధిపూర్వకముగ నాతపోధను నిచటికిం దోడ్కొని వచ్చెద! (నిష్క్రమము)

ద:–(సంతోషముతో)

సీ॥ తపము లనుచిత్రికల క్షత్త్రితనువుఁ జెక్కి
మలిచి బ్రహ్మర్షి దేహంబు సలుపుకొనుచు
నమలసత్త్వగుణాగాధుఁ డైనగాధి
పుత్త్రుఁడటె నాగృహాని కిప్పు డరుదెంచె!॥ 9

(వామదేవుఁడు విశ్వామిత్రునితోఁ బ్రవేశము.)

వి:–మిత్రమా! వామదేవా! చెప్పవూ! వసిష్ఠాశ్రమమునుండి నీవిప్పుడేవచ్చితివా? జ్యోతిస్స్వరూప యగునరుంధతీపతివ్రతతో మైత్రావరుణుఁడు కుశలియై యున్నాఁడుగదా!

వా:–అడిగెదరా! తనశిష్యులు యాజ్యులు నైనపేరియింటికిఁ దనచిరకాలమిత్రు లగుకౌశికు లేతెంచుటచే విశేషకుశలముగదా!

వి:–సఖా! వామదేవా! దశరథుని జూతమనునుత్కంఠ చాలకాలము నుండి యన్నిమనోరథములమించి యుండెడిదిసుమా!

వా:–(వినయముతో) భగవానుఁడా! తాముగూడ నింతటియనుగ్రహవంతులగుట నీభానువంశసార్వభౌముఁడు నిక్కముగ ధన్యుఁడు.

వి:–మిత్రమా! ఈతఁడెట్లుధన్యుఁడే

ఉ॥ చాఁగిలుఁ దేండ్ల హాళిమణిచంద్రిక లొత్తుగఁబర్వ విస్ఫుర
ద్భాగము లైనతచ్చరణపల్లవము ల్భుజసంపదున్నతిన్
బ్రోగిడ, నశ్వమేధసవము క్రతురంగఖురాంకచంద్రిక
శ్రీ గడియించుమేదినిఁ బ్రసిద్ధములౌఁగద తత్పవిత్రతల్॥ 10

(ముందుఁజూచి, హర్షముతో)

చ॥ గురువిజయంబు నింద్రునకుఁగూర్పఁ ద్రిలోకములాక్రమించుబం
ధురసహజప్రతాపగతిఁ, సకలాసురభామినీకచా
భరణవిపాటనప్రసభభావుకదివ్యభుజాఢ్యుఁ డౌగుణో
ద్ధురు, మనువంశజుఁ డశరథు, న్ననఁ గన్నులపండువ తీర్చెఁగా॥ 11

నేస్తుడా! వామదేవా! చల్లనినీటికణముల వర్షించుజలదమాలికను దూర్పుగాలి యెట్లనంతము లగుచిలువపలువల న్గొల్పునో అట్లే అమృతబిందుసందోహముల జిందుసత్పురుషసంవాదకౌతుకము నీలోకనాథుఁడు వేయిముఖములుగఁ గొనసాగించుచున్నాఁడోయి!

వా:—విశ్వామిత్రభగవానుఁడా! ముల్లోకములకు సనాతనగురువు లగు తమ రీమహారాజుపై నిట్టిసదభిప్రాయముం గలిగియుంట నిశ్చయముగా నేఁటి కీదిలీపవంశకుశలమనుకల్పవృక్ష మనంతములగు చివురులం దొడిగి శోభిల్లుచున్నదనినమాటే. (ఇరువురుం బరిక్రమింతురు)

ద:—(వినయముతోఁ ద్వరగా గద్దియనుండి లేచి యెదురేగి) కౌశికభగవానుల కైక్ష్వాకుఁ డగునీదశరథుఁ డభివాదన మొనర్చుచున్నాఁడు.

వి:—నీకు నీపరివారములకు స్వస్తియగుఁగాత!

ద:—(వినయమున) విశ్వామిత్రభగవానుఁడా!

చ॥ కలుగదుగా ఉపద్రవము కానలఁ గ్రూరమృగాళిబాధచేఁ?
దొలఁగదుగా సుర క్రతుమధుద్రవమానక విఘ్నహానిచే?
నెలయదుగా కుతూహలము సృష్టికి నీధర యెల్ల నీవిచే?
భళి! రఘువంశసంభవతపఃపరిపాకమె తెచ్చె మిమ్మిటుల్॥ 12

వి:—(నవ్వి) గీ॥ కడుపులోఁజల్ల సుంతయున్గదలకుండఁ
బరిజనులతోడనింద్రు దిక్పాలురిండ్ల
నట్టనీయేలుబడి శతక్రతువనెడిమాటె
వినుసోకదు, భయమింక దేనవెలయు॥

అదియునుంగాక,-

ఉ॥ వాసవు నోడకుండుమనుపాటి మహోద్భుతబాహుశక్తి నీ
వే సమకూర్ప, విష్ణు, వతివేలముదంబునఁ బాలవెల్లి ది
వ్యాసమసౌరభోచ్ఛ్వసితమానుచు నుబ్బెడి శేషుపైని మే
న్వైసి ప్రపంచరక్షణము వీడ్కొని నిద్రిలునట్టు లుండఁడే!" 14

ద:- (నివ్వెఱ నగవున) కౌశికభగవానుఁడా! సర్వజ్ఞుల రగుతమ రే యిట్లు నన్నుఁ గొండాడిన నేనేమి చెప్పఁగలను! శత్రుసంఘముల నెదుర్కొను పురందరుసేనాముఖంబు నూఱకపూరించుమాత్రమున కైన నే నొకవేళ ధనువు నించుక యెత్తితినే యనుకొనుఁ డంతకే కలిగిన వట్టిజనప్రవాదమును తమరు నిట్లనువదింతురా! అట్టిది మీకును మెచ్చఁగొల్పెనా!

వి:- (పరిహాసపు టెలనగవున) నీవటులుగా కెట్లందువులే!

ఉ॥ ఐతివి పూటకాపు భువనావన మూని, సురేంద్రుఁ డందుచేఁ
జేత క్షణాబ్దభాగ్ధనువుఁ జేర్పమిఁ దత్కళ విస్మరించి, నీ
వేతఱిఁ గూర్చుహవ్యముల నెప్పుడు మెక్కుచు ప్రేలఁ బొఱు పై
మూఁతలకన్నదోయిఁ దడవున్నదబాటల నేఁడు భూవరా!" 15

వా:-(నవ్వి)మహారాజ! భూతలమహేంద్ర! కౌశికభగవానులు సెలవిచ్చినదట్లుండ దేవసభలో నేను స్వయముగఁ జూచినదింకొకటిటు వినుము!

శా॥ నీవర్థాసనమెక్కఁ గిన్నరవరు ల్నీవీర్యముల్పాడ నా
దేవేశుం డుడుకేచ రానిముదము న్దెప్పించుకొం చెల్లొపై
పైవిన్నాణముఁ గన్నులన్ బుడిబుడి న్బాష్పార్ద్రతన్ జూపెఁ గా
దే వే గద్గురు దేఁజునీకుడిభుజం బింతంత తన్నంటఁగన్॥ 16

ద:- (నవ్వుచు) వామదేవమహాశయా! మీరుఁగూడ భగవానులగు నిగ్గాధినందనుతోనే యేకీభవించినారే! కనుండు!

మ॥ పిడుగు ల్పుట్టువెలార్చువజ్రము చలద్భమోరుహాస్తంబునం
దడరన్ నిప్పులఁ గ్రక్కుదృగ్వితతు లెం దాగ్నేయబాణస్పృహ
ల్వెడలింపన్ గదనాగ్రభూమిఁ గుదురై భీరేఁపు జంభారిముం
దిడుమై పాఱి కెదుర్చువైరి కలఁడే యారేడులోకంబులన్? ॥ 17

వి:— (సగౌరవముగా భుజాగ్రమున దట్టుచు) వసిష్ఠశిష్యుఁడవైన యోరాజర్షి శేఖరా!

మ॥ అమరేశుం డిపు డంతరాయరహితం బౌ రాజ్యలక్ష్మిన్ ద్వదీ
యమహాబాహులనీడ నిల్చునను గ్రొత్తా? వింతయా? నీయశం;
బమరీగండదళాళిపై మకరిక ల్వ్రాత్తించు మేల్పాళుపా
ల్యము లైక్ష్వాకులు వ్రాసి వర్ణనలచే నార్జించిరే కాదొకో!॥ 18

హ:— భగవానుఁడా! సకలాద్భుతములకు నిధులరైనతమతో ననుసరించుటకు నేమెంత వారము. త్రిశంకుమహారాజునుగీర్తించునుపాఖ్యానము సారము నెఱింగినపౌరాణికు లిట్లుచెప్పుదురు గదా!

ఉ॥ పట్టుదలన్ శపించి ప్రతిభన్ బ్రతిసృష్టిని మీరొనర్ప నె
ట్టెట్టు! మఱొక్క యింద్రు సృజియించునొ యంచు సుధర్మ వేలుపుల్
జట్టులు వజ్రి తన్మకుటసన్మణిపుంజన వార్కభానుసం
ఘట్టన మీపదంబు వెలుఁగన్ శరణంబని క్రమ్మఱింపరే!॥ 19

(నవ్వి) అదియునుగాక,

మ॥ నినుశాంతింపఁగఁజేయ సర్వసురలు న్వేపర్వుచో నంచ తే
రున మందత్వరఁ జిక్కి నాకమలగర్భుండైన నాఁ, డట్టిచో
వినుతి న్మానుటయెట్లు మద్రసన మీవిశ్వాతిగప్రౌఢి? నై
నను బీయూషఝరు ల్వెలార్చుభవదాజ్ఞ న్వింట కేవేచెదన్॥ 20

(అంజలింబట్టి) ఓభగవానుఁడా! దయాతరంగితాంతరంగుఁడవు కమ్ము! పురుషులమనంబు లధికాధికోత్సవంబు లమరుచున్నను దృప్తి నొకప్పుడేనిఁగాంచవు కావున నిప్పుడు తమరిందురాకచే సుకరముగ సంభావనాదిగౌరవముల నర్పించుకొనుట కనువగుటచే నామనము సంగీతనర్తకవ్యాపారదర్శనసాభిలాషయై తమయనుగ్రహమున కెదురుచూచుచున్నది.

వి:—ఓయిందుమతీనందనా! నియోగింపవలసినదితరమేమున్నది!

చ॥ పౌర విడుశేషు నచ్చతెలుపుంబస, మంధనగానఁ ద్రచ్చుపె
న్వార నడిసీమఁ బాల్కడలిఁ బర్వెడిసాంద్రసితాభ పెంపు, చం

దురు బహుళార్థకృత్తకళఁ దోఁచు మహోజ్జ్వలధౌతకాంతియ
ట్లుర వగునీయశఃప్రభల నొప్పగ విశ్వము శోభనొందెగా !! 21

ఇంక నేమనిన:-

ఉ॥ అద్దిర ! పండువెన్నెల యటంచుఁ జకోరవిలాసినీమణు
ల్పద్దుగఁ గ్రోలరాఁ గొఱుకఁజాలనికీర్తిప్రథ న్గడింపుమా !
యొద్దిక నీప్రతాపమున గోడి తమంబఱ నాశలేలి మీా
పెద్ద దివాకరుం డుఱక వింటఁ జరించుహితంబుఁ గూర్పుమా !॥ 22

ప్రస్తుతమున నాయుధసహితుం డగురామభద్రునిచే సన్నిహిత మగుచున్న మావైతానికవ్రతరక్షణమునకై మాయాశ్రమమును సనాథముగ నొనరింపవలయును.

ఉ॥ తా జలరాశి స్వీయజలదానము మేఘముఖానఁ గూర్చి,నీ
రేజహితుండు స్వాభల హారి త్తమమూర్చు ననూరు నిల్పి, య
ల్లై జగ మేలుమీావు స్వపటిష్టత మున్నుగ రామునుంచి, యీ
యోజయె మిమ్ముఁ బోలినపరోక్షకృతీడ్యుల నైజమౌఁగదా !॥ 23

ఇం కొం డిటు వినుము:-

సీ॥ సాక్షాత్కృతిగ నాకసార్వభౌముఁడు కాంచు
నతివేలముగ నెప్పు డసురవిజయు,
మపుర ! మాత్స్యన్యాయ మనుసరించును వారు
ణీదండనీతి, మానితగుణాఢ్య !
నిత్యానుషక్త మహానేకాదె పాతాళ
మందైనఁ బరికింప నహిభయంబు,
మాపుణ్యఫలము సంభవమునా వీరరా
జన్యతి, ధర నీదు శాసనమున,
గీ॥ స్వర్గమునఁ బ్రక్కఁఘర నాగవసుధఁగూడఁ
గలయనేకదోషముల నొక్కలనమైన
వఱలకుండ మహాకీర్తి మఱఁగి యేలు
దీవు కడుదూర మిటుచెప్ప నేటికయ్య !॥ 24

ద:—(విషాదముతోఁ దనలో) సకలప్రాణివర్గములకుం గలుగుదుఃఖో
త్పాదకశల్యముల నిర్మూలించుటయే శీలముగాఁగలయీకౌశిక
పాదులనుండి, రామభద్రుఁడు ప్రవాసమేగవలయుటచే నాకుఁ జిత్త
వైకల్యము యెట్లుకలుగఁగలదు ?...దానికేమి ? ఎలర దానందముం
గురియుచుండు చంద్రకిరణసమూహములలోనేగదా పద్మముల
ముకుళింపఁ జేయుకళంకముండుట ! (యోజించి) ఏదిదారి ?

(ప్రకాశముగ)

మ॥ అదిరా ! ఈతఁడు కూర్మరా జనుచు, వ్యాళాధీశుఁడే యంచు నే
ల్కడు రౌస త్తకులాద్రిసంఘ మని, కన్గో దిగ్గజాహ స్తిసం
పద యంచు న్వసుధాభరోద్వహనసామ్యత్వంబునన్ మాకులం
బెదిగించె న్నను నర్థిఁ గాదనుచు నౌనే నేఁటి కానిందకున్॥ 25

వి:—(నవ్వుచు) చూడుము

గీ॥ వాఁడిసూదుల తొలి తొలిబాధయొందు
సంతతము ద్రోయవలయుకష్టం బొకండుఁ
గాదె కుండలములు వీనుగవకుఁ గూర్చఁ
జెంతఁ జెక్కుళ్ళు లాసొంపుఁ జెంది కులుక॥ 26

ద:—(వినయాన్వితమగు వెనుబాటుతో) భగవానుఁడా ! మీయిట్టిమన్న
ననే మేమతివేలముగ ననుగ్రహింపఁబడితిమి. ఐనను, మాయీ
కుఱ్ఱఁడు పల్గాఱుపసివాఁడనియేకాక ధనుర్విద్య నారితేఱనివాఁడు
నని యేమియుఁజెప్పలేనిముగ్ధుఁడ నగుచున్నాను.

వి:—(నవ్వి) సఖుఁడా ! మైత్రావరుణి యగువసిష్ఠబ్రహ్మర్షి యే పురోహి
తుఁడుగా నీతఁడు బ్రహ్మచర్యవ్రతానుష్ఠానమున నారితేఱెనుగదా !
ఇఁక భృశాశ్వగురూపదిష్టమగు ధనుర్వేదమంతయు నాయధీనము
ననే యున్నదాయె !

ద:—(వినయయుతమగు వెనుబాటున) రఘురాజకుమారులయూర్పులే త్వద
ధీనములన విలువిద్యాసాంప్రదాయములనుగూర్చి తిరిగి చెప్పవలసి
నది యేముండును. మాసహస్రకిరణుఁ డగుభానునికులముపైఁ
బొడసూపిన పక్షపాతవిశేషముననే భృశాశ్వ సహస్రసంవత్సరము
లుపాశ్రయించి దివ్యాస్త్రరహస్యముల నేర్చితిరనినమాట !

వి:— నీయవిశ్వాసమును మానుము రాజర్షీ! రాముఁడు కేవలమ్ము బసివాఁడని తలంపకుము ఆకసమందలి సూర్యుఁడు మన కతిసూక్ష్మరూపిగ గనిపించుఁగదా! ఆయనవ్రికాశమో! భూమిని రోదసిని మలయుచీఁకటుల నిట్టె చిమ్మివైచుట లేదా!

ద:— (నవ్వి) ఓభగవానుఁడా! కౌశికవంశకేతువు లగుత్రమ్మంత వారే కోరిన నెట్టినీచమగు వాచాలునకైన హీనోత్తరము నీయమనస్కరించునా! (చేయిముఖమునకడ్డుంచి) వామదేవమహాశయా! భగవాను లగుకౌశికు లిట్లనుచున్నారే?

వా:— ఓరాజర్షి చంద్రమా! ఇందు మేము చెప్పవలసినది యేమున్నది?

గీ॥ అర్థి కౌశికులట! దాతయంట తమరె
గొప్పక్రతువంట! రక్షణ న్గోరునంట!
రామభద్రుఁడె తద్యాగరక్షకైన
నిండుసమ్మతి మే మియ్యకుండఁ గలమె! 27

అదియునుగాక:-

క॥ అడిగినది నిండుగాజత
పడ నర్థిముఖానఁ బొంగిపడుచుముదము నే
ర్పడఁ జూచుటేకదా శ్రమఁ
మడఁచుట భూభారకున్న లగువిభుబోంట్లకు॥

ఇంకొక విశేషమిందుఁ గలదు:-

గీ॥ కులగురుండు వసిష్ఠుఁ డెక్కుడుగ నీకు
యాచకులవాంఛల న్దీర్ప నాన నిడఁడె!
తన సమాధి నియ్యఖిలంబుఁ గనియె యేమొ
తెలిపె నారీతి నీ కుపదేశవిధిగ॥ 29

ద:— అది యట్లెలకాదు-

క॥ ఈకాలం బీదేశముఁ
నా కన్నిట ధ్యానదృష్టి నడపఁగలుగు ని
ష్ఠాకలితులు తలఁచినచో
నేకథలు న్గనులయెదుటనే యగుపడుగా॥ 30

(విమర్శతోఁ దనలో)

ఉ॥ పంపనె చూడు రాముఁ గ్రతుపాలనకై యపు డేమియూఁ గడుఁ
దెంపున నిమ్మహామహుఁడు దిగ్గన నింటికిఁ జేరుకొంచు లే
శంపుదపోవ్యయంబున నె చక్కఁగ విఘ్నములార్పి పూనిక
నింపుకొనున్నదా! ఇఁకను నిల్చునె మత్కులకీర్తి సుంతయుఁ॥ 31
(విశ్వామిత్రునితోఁ బ్రకాశముగ) త్రైలోక్యగురుండ వగునో భగ
వానుఁడా!
గీ॥ యజ్ఞదీక్షఁ గొనఁగనాయత్తులై మీరు
నాకుమారు రాము నన్నె యడుగ
సీధరాపురంధ్రి యెపుడుఁ బతివ్రతా
నియతి మాయెడ న్గణించునటులె॥ 32
(తెరవైపు చూచి) ఎవరెవరక్కడ! దౌవారికుఁడు (ప్రవేశించి) మహా
ప్రభూ! ఏమి సెలవు!
ద:- రామభద్రునిం బిలువుము వా॥ లక్ష్మణకుమారుఁగూడ
వి:- (నవ్వి) ఈతనింగూడ నిట్లు వేఱుగ నిర్దేశింప నక్కఱలేదు. వెన్నెల
నెందోవదలి చంద్రుఁ డుదయింపఁడుగదా!
(ద్వారపాలుఁడు నిష్క్రమింప రామలక్ష్మణుల ప్రవేశము)
రా:- (హార్దజనితమందహాసమున)
చ॥ పలుకుఁ బురాణము ల్మఘువుపైఁ గినుకఁ బ్రతిసృష్టిఁబూని బ్ర
హ్మల నొకయేడ్వుర న్పలిపి, అంతనె శాంతిలి సృష్టికర్తలై
విలసిలువారి నయ్యనలవీథికి వెల్పల నిల్పెనంచు, న
య్యలఘుయశఃప్రభావఘనుఁ డౌమహనీయుఁ డితండె లక్ష్మణా॥
అయీభగవానులను స్వయముగా నెట్లుపచరింపఁ గలమోగదా? (పరి
క్రమించి ముందుఁజూచి సంతోషమున) వినయవినమితులై యున్న
వామదేవులకు నాన్నగారికి దాఁపుగాఁ బ్రశాంతపావనమూర్తి
మంతు లైయున్నమాడవవారే భగవాను లగువిశ్వామిత్రు
లై యుందురు.
ల:- (ఆశ్చర్యస్మితంబున) ఆర్యా!-
మ॥ ఇతఁడా! ఈతఁడ! నమ్మ చేరఁదగు నెంతేసాధుసద్విగ్రహుం
డతిరోషంబున నాఁడు ముజ్జగము లూటాడించె భీఃగొల్పి? స

గతమే కాఁదగుఁ, జల్లనోమ్మ్రుడుమనోజ్ఞ(శీల జ్యోతిష్మతీ
లతలుక జీఁకటిరా హతాద్గతిగ జ్వాల ల్గ్రిక్కుచుండుంగదా॥

రా:—తమ్ముమహ్హా! లక్ష్మణా! తెలిసికొన నలవికానిగంభీరచరిత్రములు
గలమహామహు లిట్టులే చిత్రముల కాకరములగుచుందురు.

ఉ॥ వీరితపంబును జైఱచువేడుక నచ్చర లేగుదేఱ న
వ్వారలపై జగంబుపయిఁ బర్విన యీాఘను రోషధూమతీ
(వారభటు ల్సమింప వోకయంతన, సర్వసురాళిమౌళిన
ద్ఘోరుకిరీటరోచులు పదోపనతంబులుగామి నం(దుంగా॥ 35

వా:—(చూచిహర్షముతో) ఇడుగో రామభద్రుఁడు రానేవచ్చె. (విశ్వా
మిత్రునితో) భగవానుఁడా!

ఆ॥ బ్రహ్మతేజయొక్క పరిణామ మిట నాల్గు
సలుపుబుుశ్యశృంగు చరువులందు
నాదిమాంశ మౌమహాభుజం డరుదెంచె
నయ్య! (ప్రీతిమీాఱ నరయుమయ్య!॥ 36

వి:—(హర్షసం(భమములతోఁ జూచి) వామదేవా ఏమంటివి! బుుశ్య
శృంగుఁడనియా? ఆహా! వనవాసు లందఱలో సీతనిబ్రహ్మణ్యము
కడుంగడుదొడ్డదిసుమా! ఈమహామహునిమూలమున బ్రహ్మర్షి
యగువిభాండకుఁడు పుత్త్రివంతుఁ డగుటట్లుండ నీదశరథుఁడుగూడఁ
దత్కీర్తికిం దావలుండయ్యెఁగదా!

వా:—భగవానుఁడా! అదివాస్తవమే.

వి:—(వామదేవునితో)

చ॥ మనుకులజాతులై గురుని మాన్యుఁ బురోహితుఁజేసి వైనయి
క్యనిఖలకర్మపాళి వెలయంగ భవాదృశుల న్వరించి, మం
తునుగాను రాజుల స్దశరథుండెసుమీాకొన! ఠూషి బుుశ్యశృం
గుని సుతపః(ప్రదీప్తి నిఁకఁ గొల్చునుగా రఘువంశసంపదల్॥ 37

[రామలక్ష్మణులు సమీాపింతురు]

వా:—వత్సలారా! సమస్తభువనములకు మహనీయుఁడు భగవానుఁడు
వైనయిమ్మున్శ్రేష్ఠునకు నమస్కరింపుఁడు!

రా॥ల:—విశ్వామిత్రభగవానులకు సూర్యకులజు లగురామలక్ష్మణు లిదే
యభివాదనము నొనర్చుచున్నారు.

వి:—బాలులారా! మీ రాయుష్మంతులగుదురుగాత! (రామునిభుజ
ములు చేతులంబట్టి సగౌరవముగఁ జూచి తనలో)

శా॥ తాత్రైడై శ్రీకుచకుంభసీమ నిలువ, న్నారాడుమత్తేభ మీ
నాఁ డీయింటను రాముతో నలువురై నర్తింపఁ జేకూరుటల్
నాఁడు న్నాఁడు వసిష్ఠుఁడే వినుచుమంత్రప్రౌఢి యిక్ష్వాకులన్
న్నేఁడేగా భువనాళి కభ్యుదయము న్జేకూర్చునాఁడెం బిడెన్॥ 38

అదియునుంగాక—

శా॥ ఆయాబుద్ధశకస్మృతిం గొనిన దీవౌదయ్య! నీప్రీతికే
కా యజ్వోత్తులనలో హవిస్సు నిడ నాహారించుఁ ద్రేతాగ్ని గ
ర్వాయత్తాత్ముల రావణాదులను ద్రోపాడంగదా శేషశా
యీ! యెత్తించిరి జన్మ మిందు నిను బ్రహ్మేంద్రము ల్బదా
క్రాంతులై॥ 39

దా:—(నవ్వుచు) బాలకులారా! ఈమహామహుఁడు మిమ్ముద్దఱం గొంపో
వుటకే విచ్చేసినాఁడు.

రా॥ల:—తమకుఁ దండ్రిగారి కెట్లుసమ్మతమో అట్టులే.

ద:—(ప్రేమతో నిరువురం జేజఁదీసికొని) కౌశిక...(అర్ధోక్తిలో శోకమున
మూసుకొనుగొంతుతో వామదేవుంజూచును)

వా:—(విశ్వామిత్రునితో) ఈరామలక్ష్మణులు తమకర్పింపఁబడుచున్నారు.

వి:—(ఆదరముతో జేరఁదీసికొనును.) (తెరలో)

వైతాళికుఁడు: -మహారాజులకు మధ్యాహ్నసంధ్య సుఖమునిచ్చుఁగాత!

గీ॥ ఇనునియెండ లల్లెడవెల్ల మనుజునీడ
మెట్టతాఁబేలన న్బొట్టిపొట్టి దయ్యె
కరిముఖోద్గీర్ణవారిశీకరహిమాతి
శీతలస్నిగ్ధకచ్చము ల్చెరె లేండ్లు॥ 40

మఱియు,

చ॥ పలికెడి యక్షరాక్షరము భవ్యసుధ న్గురియంగఁ గోరలన్
వెలయువిషంబుఁ జిగుల వెల్గుఫణంబులభోగిరాట్సుతల్

వలచి పటీరకోటరముల౯ భవదీయగుణాళిఁ బాడుఁ గం
చెలల వినిర్గమించి పొరిస్వేదముసాత్త్వికహర్ష మీనఁగ౯॥ 41

వి:—(విని) మిత్రమా! దశరథా! వైతాళికుఁడు మనోహరమైనసత్య
మునే పలికినాఁడుసుమా!

మ॥ మణిభారాన ఫణంబు లించుక చలింప౯ దూఁగుచు౯, సముద్రో
ల్బణజస్వేదము కంచుకాంతరము లుబ్బన్బర్వుచుండ, స్ఫువ
ద్గుణము ల్పాడుచునుండు, వార్ధితటసద్గోత్రస్థలీభోగినీ
మణులు౯ నాల్కలరెంట వర్ణములసంవ్యక్తంబులై సొంపిడ౯॥ 42

ద:— (వినయవైలక్ష్యస్మితమున దలవంచి యుండును)

వి:— రాజర్షీ! దీక్షఁ జేకొనువేళ సమీపించుచున్నది. ఇంతటియానంద
మును బుట్టించునీసంభాషణమును మొదట నేనేనిలుపవలసినవాఁడ
నగుచున్నాను.

ద:— (రామలక్ష్మణులం జూచి కన్నీరు తొఁణుకాడునేత్రములతో విశ్వా
మిత్రునితో) భగవ౯ (అర్థోక్తిలో గాద్గద్యముచే నాఁగును)

వా:- (సంభ్రమముతో) కౌశికభగవానుడా! తాము వేంచేయుఁడు.
తమకు రామలక్ష్మణులకు మార్గములు సుకరశ్రీప్రాపకములగుఁ
గాత!

వి:— మీరెల్ల రిఁక నిలువుఁడు (రాలతో విశ్వామిత్రుఁడు నిష్క్ర
మించును)

ద:— (వేడినిట్టూర్పువ) వామదేవమహాశయా! మనయందువలెనే
అకారణవత్సలుం డగునీకౌశికులయందుఁగూడ మనవాఁడు తనపై
ప్రేమను బుట్టించుకొనఁగలడా!

కం॥ మన యీయెడబాటున దా
మునుఁగుచు దుఃఖమున దుఃఖమునె మునికిడునో!
కనుచు నపూర్వవిషయముల
మునుఁగుచు సౌఖ్యమున సౌఖ్యమునె ముని కిడునో? ॥

వా:— (నవ్వి) రాజర్షీ! రామునిమధురతకు మనమని విశ్వామిత్రుఁ
డని తారతమ్యముండునా! ఎంతమాట!

మ॥ తనయుండే జనియించెఁ జంద్రుఁ డనుబంధం బుంట సంద్రంబు చం
ద్రుని వృద్ధిక్షయపూర్తిఁ దాను గనుచుండుఁ బోటు నా, తేల వి
ష్ణును మోడ్పు న్గనుఁగల్వ యిందునుదయంబు న్గూర్చింకు సంధిల్ల! నెం
దును శుద్ధుల్ తమలో నకారణపు బంధు ల్సుమ్ము ప్రేమోన్నతిన్

పె — (విమర్శించి) అది యట్టిదే

గీ॥ ఆత్మజనకుండె సుమ్ము రత్నాకరుండు
అమృతకౌస్తుభపారిజాతములొ తోడఁ
గలిగినవె గొప్పవే, యైన వలపదేమొ!
తాను జాబిల్లి కుముదబాంధవుఁడెయయ్యె॥ 45

(ముందుఁజూచి) రామలక్ష్మలును గౌశికభగవానులు నప్పుడే కను
మాసైరే! ఇఁక మనము కుమారప్రవాసదుఃఖహత యగుచుండు
పట్టపుదేవిని దక్షిణకోసలేశపుత్రి నోదార్పవెళ్ళుదము (ఎల్లరు
నిష్క్రమింతురు)

ఇది మొదటియంకము



# శ్రీమదనర్ఘరాఘవము

రెండవయంకము—మిశ్రవిష్కంభము

రంగము—తపోవనము—[ప్ర-దర్భలతో విశ్వామిత్రశిష్యుఁడు శునశ్శేపుఁడు]

శు:— (ముందుఁజూచి) ఇంకరాత్రి తెల్లవారఁబోవుచున్నట్లేనా?

ఉ॥ పండినచంద్రబింబసుధ పైకొని చీఁకటి సూర్యకాంతము
ల్మండఁగముందు తేపుపొగమాదిరి దిక్కులరేగెఁ, బద్మినీ
మండలహృత్పుటి న్గలఁచుమాధుకరాఖ్యశిలాళినెల్ల మా
ర్తాండుఁడు సూదియంటుశిలరాణ వెలార్పఁగఁబూనఁడింతకున్॥

మఱియు

శా॥ తారల్పక్వఫలాండుభవ్యకళ నుద్భాసిల్లెడి న్మింట నం
కూరంబౌ నలినీహృదౌషధరుచు ల్కాంచెంబుగాఁ దూర్పునన్
సారం బంతరితంబుగాఁగ శశియు న్నాలీని గూఁడట్లుగా
జా యుబ్బన్ బడి పశ్చిమాద్రిఁ గలిచెన్ జ్యావీథికి న్గూరుఁడై॥

(అన్నివైపుల న్జూచి)

శా॥ ఆశామాళికిరీటరత్నరుచిసామ్యాభన్ ఖరాంశుండు ప్రా
గ్వాశాగర్భబహిర్గతుం డగుటలే, దట్లయ్యు, నాయీసగో
దేశంబు ల్సరసంబులౌఁ గుశలసుప్తి న్గాంచితే యంచు నా
చాశంఖారవ మానుబంభరములన్ జక్రాంగసంఘంబులన్॥

మఱియు:—

ఉ॥ ప్రాచివిలాసభూష యగుపద్మము తొమ్మిదిరేకులం దదే
తోఁచెను రెండొమూఁడొ యన దోషధిఁ బుష్పనవార్త గానులన్
గోచర మైనవిప్పునకె గుబ్బతిలన్గుతుకంబు, లిమ్మెద
ల్తాఁచి చెఱ ల్తొలంగుత్వరఁ దద్దయు విచ్చె సరోజకోశముల్॥

అదియుంగాక:—

చ॥ వెనుకటిమాపు సూర్యు వెయివెల్గులతోఁ దనరేకు లొంచి తాం
డును మఱి మూఁడు నాళ్లని ముడుంచుటఁగాఁదగు నేఁడు తమ్మి య

య్యనకిరణోదయక్రమమునే సరిపోల్చనొ తా నొకొక్క రే
ఖనె విడఁబర్చుచున్న దదిగో! యతఁడే, ఇతఁడంట తేలఁగన్॥ 5

ఇంక నేమనిన:-

చ॥ అటఁ గలవేల్పుటేన్గు శిరమందలి చందిరమొందఁ బ్రాగ్దిశా
తటమున సాంద్రతారుణతఁ దాల్చు ఖరాంశుమరీచిరేఖ వు
త్కటరవివిగ్రహం బులులఁ దద్దయుఁ ద్వష్ట తనూకరింపఁ జె
క్కు లెగయు నెత్తురువ్వ పెనుగూఁడయి సూర్యునిఁ జుట్టి వెల్గెడిన్॥

(ముందుఁజూచి) పొడుపుకొండతలమానిక మగుదినకరమండలమిప్పటికిఁగూడ వినువీధి నలంకరింపరాదయ్యె. విపులతరముగ యజ్ఞము నొనర్చుచున్న మాగురువు లగుకౌశికభగవానుల యాజ్ఞచే బెందలకడనే లేచి సమిధలకై యిట కరుదెంచితింగదా! ఇఁక నా పనికై ప్రవర్తింతును. (పరిక్రమించును.)

(భయముతో వెనుకకుఁజూచుచు నొకవటుఁగు (ప్రవేశించును)

వ:-అయ్యా! శునశ్శేపుఁడుగారూ! అట నేదో అద్భుతం భయంకరం జరుగుతున్నది!

శు:-(చమత్కారముగఁ జుట్టివచ్చి) చెలికాఁడా! పశుపాలా! ఏమిటోయ్ ఆఅశ్చర్యం భయంకరం?

వ:-ఎవరో రాముఁడనే రాకుమారుఁ డొచ్చాఁడని విని కుతూహలంతో చూడ్డానికి పఱుఁగెత్తే నాముందఱకు తపోవనందగ్గఱ పాతుకొనిపోయినరాతిబొమ్మ మనిషై గబగబా యెదురుగ్గా లగెత్తింది. అది చూస్తూనే పైగుడ్డ పడిపోయిందికూడా యెఱక్కుండా పలాయనమై వచ్చా.

శు:-(నవ్వి) మిత్రమా! మంచిపనే. నీవదృష్టవంతుఁడవు గనుకనే తిరిగి రాఁగలిగితివి.

వ:-ఆరక్కసినుండి నన్నెట్లారక్షిస్తావో బాబూ! (వణఁకుచుఁ గాళ్లపైఁ బడును.)

శు:-(నవ్వుచూ) (లేవఁదీసి కౌఁగలించుకొని) నెచ్చెలీ! ఉచథ్యుని పుత్త్రుఁ డగుగౌతమభగవానున కీయహల్య భార్య, విన్నావా?

ప:—విన్నా ! విన్నా ! జనకవంశపురోహితు లగుశతానందుల తల్లిగాదూ!
ఆc ! అయితే ?

శు:—ఆమె పూర్వము పురుహూతుముఖంబున దోషియగుటచే దీర్ఘ తపస్వియగు నమ్మునికోపముచే నాపాలుమాలికకుc దగినట్లుగ నిందియవైకల్యము నిట్లురాయియై యనుభవించి యిప్పు డీరఘు రాజకుమారుని తేజముచే నయ్యంధకారమునుండి తప్పించుకొనినది. తెలిసెనా ? ఇcక భయమెందులకు ?

ప:—అమ్మయ్య! ఆర్యుల రగుతమదయావిశేషాన్న తిరిగి నేను మనుజుల్లో పడ్డట్టుంది. అయినా అనుమానపిశాచం న న్నింకానదట్టంలే! ఒక్క ముహూ ర్త మిక్కడ విశ్రమిద్దాం !

శు:—బ్రాహ్మణులము గనుక భయము సహజమేలే. నిబ్బరించు కొనుము. (కూర్చుందురు.)

ప:—(తడవుయోజించి యాశ్చర్యముతో) అమ్మయ్యో ! విషయసుఖా లనే యెండమావులహడావుడిలో భగవానులైన దేవేంద్రుడుగూడ లేడిపి ల్లైపోయినాcడంటె !

శు:—మిత్రమా ! బాగుగcజెప్పినావు. ఈలోకులు మిక్కిలియల్పులే సుమా! ఐహికసుఖములు మరిగిన నీరిచే రాతుర్లెట్లు వ్యర్థములు చేయcబడుచున్నై ! నేత్రద్వయమాత్రులయ్యు నీమానవగజముల మనస్సు నాకర్షించుకొని వెంటcదవులంజేసికొను విషయానుభవము లకు లొంగి వివేకమనునంకుశమున కుత్సుకులుగారనిన చో వేయి నేత్రములుకలిగి యుత్కృష్టభోగపతి యగు దేవేంద్రునసనందున్నదా కన్నులకుc బండు వెప్పుడుదయించునో కామవలపులకుc దలcవ్రు లప్పాడే బలుపు లగుచుండును.

ప:—(నవ్వి) రామభద్రుని యీ ప్రవాసం ఆమునిపత్ని పుణ్యపరిపాక మల్లేనే వుంది.

శు:—అది యొక్క కారణము.

ప:—ఇం కేటుందేం ? చెప్పరూ ! వినాలని నుంది కుతూహలం !

శు:—సఖుఁడా! నీకుఁ జెప్పఁగూడని దేమియున్నది! కిష్కింధలో నింద్రునికుమారుఁ డగు వాలియనువానరనాయకుఁ డొకఁడున్నాఁడు. వానికి రాక్షసచక్రవర్తియైన దశకంఠునకుఁ బెరుగుచున్న స్నేహముం జూచి క్రోఁతులకు నెలుఁగులకుఁ గోలాంగూలములకు నాచార్యుఁ డగుజాంబవంతుఁ డెందఱమంత్రులయనుమతితో నవ్వాలిమ్రోల నిట్లనియె.

ప:—(నవ్వి) ఓహో! ఏమన్నాఁడో?

శు:—ఓరాజా! రాక్షసజాతి అసలే మాయలమారిజాతి. అందులో నీ రావణుఁడు వంచనచే నింద్రునిజయించి యవక్రపరాక్రముఁడుగా నెగడుచున్నాఁడు. కావున, నీ కతఁడు పితృవైరికూడ. మఱొండే మనిన, నీచంకలనిఱికింపఁబడి యభిభూతి నొందినవాఁడు. నమ్మఁ దగనివాఁ డనియే మాయెల్లర నమ్మకము, అదియుచుండగాక, మన కేమేనాపద సంభవింప వెంటనే సాయపడగలవాఁడా యనిన వానికి మనకు నడుమ పెద్దసముద్రమే యున్నది. ఈయీకారణములచేత పులస్త్యబ్రహ్మపుత్త్రుఁడైనను రావణునితో మైత్రి మనకుపకార శూన్యమైనదే. హరిణాంకశేఖరుఁడే యిందులకు నిదర్శనము.

సీ॥ ఆపులస్త్యసుతుండె ధనాధినాధుఁ
డెపుడుఁ జెలియై యొకింటనే యెసఁగు, నైన
త్రిపురజేత మైపూత బూది కయిసేత
యేన్గుతో, ల్బునక్కపే, రెద్దె యెక్కిరింత। 7

ప:—బలే! ముసలివాఁడైనా భల్లూకరాజు మంచిమాటకారి! నేర్పటే! హాస్యగాఁడుగూడానే. ఆపైని?

శు:—ఆపైననా! నీవ్యాసమంతయు ముసలిసోదె యని వాలి నిరాకరించుటచే రహస్యముగా జాంబవంతుని యనుజ్ఞతో మహామాత్యుఁడైన కేసరిపుత్త్రుఁ డగు హనుమంతుఁడు సుగ్రీవకుమారు నెత్తుకొని ఋష్యమూకపర్వతదుర్గమునఁ బ్రవేశించినాఁడు.

ప:—(సాభిప్రాయముగ) మారుతి యంటే త్రైలోక్యమల్లుఁ డని పేరొందినవాఁడేకాదూ?

శు:—అవు నతఁడే.

ప:—(విచికిత్సతో) ఎంతచెడ్డా మొట్టాంటివాఁడైనా స్వామి స్వామే!
వానికి వ్యతిరేకులవడం మంచిదనిపించుకుంటుందా ?

శు:—(నవ్వి) మిత్రమా ! ఈ ఆంజనేయుఁడు భగవంతుఁడగు సహస్ర
కిరణుని దగ్గఱ మునుపెన్నఁడో వ్యాకరణము నభ్యసించిననాఁడే యా
సూర్యునకు వానరయోనిసంజాతుఁడగు సుగ్రీవునకు సాయమొన
ర్చుటయే గురుదక్షిణగ నిర్ణయించుకొనియుండె.

ప:—ఊఁహూఁ! అదాసంగతి? గురుపుత్త్రునిఁగాని తోటివిద్యార్థిగ్గాని
తోడునీడగుట యుచితమేగా. పిదప ?

శు:—గృహకల్లోలములచేఁ దనమిత్రుఁడగు వాలిరాజ్యము జర్ఝరిత
స్థితిలోనికి వచ్చుచున్నదని గ్రహించి రాక్షసరాజైన రావణుఁడు
తనముఖ్యమంత్రులగు ఖరదూషణత్రిశిరులను చతురంగబలసమన్విత
ముగ సముద్రమునుత్తరపుగట్టున వాలికి సాయపడుటకై నిలిపి
యున్నాఁడు.

ప:— బలే ! అవడానికి రాక్షసుఁడైనా మిత్రధర్మాన్ని వదిలాఁడుగాఁడే!

శు:—మిత్రమా! ఏమిచెప్పను! వాఁడేవరనుకొంటివో! రావణుఁడుసుమా!

ఉ॥ ఎరికో తృప్తినీఁగలుగులే యని మేన్ఛులకంచు కౌతుక
శ్రీ రహిఁ దొమ్మిదింటి నటుత్రెంపిన, ని ట్లతిదీప్తిఁ బుట్టఁగా
నారసి చిన్నఁబోవుపది యాతలఁ బొల్చిన సింహాళీసువ్యా
పారవిలక్షణత్వ మది వానికెచెల్లు జగద్విచిత్రమై ॥ 8

ప:—అబ్బో ! అట్లాగా ! తరువాత ! తరువాత !

శు:—సుకేశుఁడనురక్కసుని పుత్త్రికయు వేయిమదపుటేన్గుల బలము
గలదియు నగు తాటకయనురక్కసి యమ్మాకనుండి వచ్చి మనుష్య
లుండుభూములలో విహరింపవలయునను కుతూహలముచే మన పరి
సరములనే నివసించుచున్నది.

ప:—అమ్మయ్యో! వేయేన్గులబలమే! అందుట్లో ఆడదే! యెప్పుడు వినని
కనని సంగతే! పైన?

శు:— తదుపరి శ్రౌతవిధుల కీరక్కసిమూలమున విఘ్నమగు నేమోయని
భగవానులగుకులపతు లీరామలక్ష్మణులను గొనివచ్చిరి.

వ:—రక్కసుల నుక్కడంచడానికే రామభద్రుఁ డనుపేరుతోఁ నీతఁడవతరించాఁ డనుకుంటా!

శు:— అవు నోయిసఖా! నీ వనినదే సత్యము. రామభద్రుఁడన రాక్షసశిక్షకైన నాల్గక్షరముల సిద్ధమంత్రి మనవలసినదే! అదియునుంగాక, మరొకవిశేష మేమనఁగాఁ గౌశికభగవానులచే బ్రహ్మావర్చస్సాదృశవిప ర్తదివ్యాస్త్రపారాయణ మత్యాశ్చర్యకరముగాఁ జేయింపఁబడియెఁగదా!

వ:—మంత్రిమయము లైన యస్త్రదేవతలతోసహా బలాతిబలా అనే శక్తులుకూడా రామభద్రునందు సంక్రమించినవటగా?

శు:—మరేమి. అదియుం జరిగినదాయె.

వ:— అయితే! అన్నీ సరేగాని, నాకు తెలియకడుగుతా! శక్తేమో తనదేనాయె. అస్త్రవిద్యా తనదేనాయె. అటువంటప్పుడు, తన క్రతువిఘ్నాల నడఁచడానికి కౌశికభగవాను లీరామభద్రున కాధిక్యతను గూర్చుచున్నాఁడేమో అని (నవ్వి) నాకుఁ జూడ అతిథి చేత పామునుజంపించేచందంగావుం దిదంతా.

శు:—సఖుఁడా! ఇంత తెలియనివాఁడ వైతివేమోయ్! గురువులు తమంతటఁ బ్రయోగించి కనుకీర్తికంటెఁ శిష్యులచేఁ బ్రయోగింపఁజేయుటచే విశేషయశస్సు నొందుచుందురుగదా ఇటువినుము:—

మ॥ ఉపదేశించినవిద్యఁ బ్రౌఢులయి శిష్యు ల్వెక్కుచందాల ని
క్కపుఁగీర్తి న్బలుచోఁ గనన్ గురుగుణోత్కర్షంబు మెండౌను దా
నుపయోగించిన యబ్ధినీ ర్మయిలు వర్షోద్యోగతన్ శుక్తివా
రపుటి న్జిల్కుటఁగాదె వార్థి యలరున్ రత్నాకరంబై భువిన్ ॥ 9

వ— ఆర్యా! అన్నింటికీ తగినట్లే చెప్పారు కాని ఒక్కసందేహముంది.

శు:— ఏమిటోయ్ అది?

వ:— అన్నివిధాలా అతిగోప్యమైన వాసరరాజనీతి తమ కెట్లా తెలిసిందో?

శు:—దివ్యదృష్టిచే సకలభువనవృత్తాంతము తెలుసుకొనఁగల విశ్వామిత్రతాతపాదు లయోధ్యదారిలో సెలవిచ్చిన వింటినోయీ! (అంతటఁజూచి) ఓహో! ఏమి యీప్రభాతసమయమునందలి త్రిభువనలక్ష్మి!

ఉ॥ అప్పటి కప్డు సూర్యమణు లర్చులఁగొల్పి నివాళులెత్తఁగా
నొ ప్పిడెఁ బద్మరాగరుచు లొల్కు నవార్క కరాళి తూర్పునన్
గ ప్పగు కారుచీఁకటివికారపుకూసము నీడసాకుశోఁ
జప్పునఁ జారిచె న్భువనసర్పము ఘ్రాళనఁ గోరకింతయున్॥ 10

మఱియు:—

మ॥ కడుపార న్నిశఁ గ్రోలియున్న తిమిరౌఘప్రౌఢవృష్టి న్దడా
దుడి నీ నీరజకుట్మలంబు లనుశుక్తు ల్నీలముక్తాళిగా
వెడలన్జేసెడినాఁగఁ దా మ్మొదలు వెన్వెంట న్జెజల్మాయ వె
ల్వడెడిన్ బారులుగట్టి తమ్మిమొగడ ల్వ్యాకోచము ల్చెందఁగన్

అహో!

క॥ ఇది విరిసి మొగిడి విచ్చెడు
నది, యిది నూత్నముగ విరియునది యని పోల్పన్
గుదుర, దదిం!, మూఁగెడి తు
మ్మెదకదపులఁగాక శక్యమే యెఱుఁగంగన్॥ 12

(పైకి జూచి సూర్యునభివర్ణించి)

చ॥ కటువులెయయ్యెఁ జక్కవల కామకఠోరతరాగ్ని నెల్ల మా
న్చుట కురుశీతశైత్యమున శోభనము ల్పమకగాప్పఁజాలి, ని
క్కుట మయి మూఁగు నాతిమిరము ల్పురత న్వెడి, లోకనేత్రసం
పుటములు తేజఁగాఁ బ్రభనముల్గాని వేఁడివెలుంగు లుబ్బఁగా॥

కావున, నింకఁ జెదుగులం దే నన్నుఁ బోగొచ్చెదనా!

ప:— నాగ్గూఁడా నారాజకుమారుల్ను చూడాల్న నేనుచ్చట నిక్కట
మాతున్నది. వారెక్కడవుపడతారో నాకు?

శ:—(నవ్వి) యజ్ఞశాలకు నుత్తరమున నున్న విహారభూమియందు నిశ్చయ
ముగఁ గ్రీడించుచుందురు. తనివితీఱ యథేచ్ఛగాఁ జూచిరమ్ము!

(ఇరువురు నిష్క్రమింతురు) ఇది మిశ్రవిష్కంభము

(రామలక్ష్మణుల ప్రవేశము విశ్వామిత్రాశ్రమపరిసరములలో)

రా:— భగవాను లగుగాధినందనుల 'సిద్ధాశ్రమ' మనుపేరుగల యీని
వాస మత్యంతవిచిత్రముసుమా! గమనింపుము

చ॥ ప్రతిదిన మెచ్చు చొప్పఁ గొసరా శ్రమఁ బుట్టినదేవ మూని “వ
త్సతరి! ఇఁకైతి నేధ్య”వని తా ర్వాఁకువు ల్విశసింతు రల్లదే!
యతిథులు ప్రాశనాశ తెగయ న్బొరిఁ బిల్వఁగఁ దూర్పుగాలితోఁ
బ్రతనుత నొంపసాగె మధుపర్కసుపాకమనోజ్ఞవాసనల్ ॥ 14

లః— ఆర్య!

సీ॥ సల్లతోఁగయుఁ గింజల్కంబు నాఁ దనర్చు
వెడఁదరొమ్మును కౌస్తుభమును వెలసెడిహరి
కపటవామనుఁ డగుచు నిక్కడ నెగాదె
వెలచి దేనికొ బిట్టుతపం బొనర్చె॥ 15

సీ॥ అట్టియీమహాతీర్థమధ్యమునఁ జేరి
యెట్టిభయ మేరిభయము మా కేమి యనుచు
గట్టినమ్మికతో ద్విజాగ్రణులు కనుమ!
యెటులు షట్కర్మములఁ జరియించువారొ!॥ 16

(మఱియొకనైపుఁ జూచి)

చ॥ అవె పశుబంధవేదినలయంబు లుదుంబరదంతురంబులై
హవణిలు, గృహ్యతంత్రవిధు లస్వాహము నరుగన్ గృహస్థు లిం
డ్ల వెలయు సొంపు యాగశిఖలన్ గృహమేధులు మాటిమాటికిన్
హవములఁ బిల్చి వేల్తురు గతాగతి నింద్రునిపేర మూఁగఁగన్॥ 17

వాః— (సంతోషస్మితముస) తమ్ముఁడా! ఇటువచ్చి నీకనులసార్థకపఱచు
కొనుము. ఈఋషులసమూహ మెంతప్రసన్నముఁ బావనము నైన
దియో!

క॥ తనువులు సరములగూండ్లుగ
నొసరిచి, యిఁక మిగులుసిరల నునిచికొనిరొ యీ
మునులు శిరంబుల నన నొ
ప్పినజడల సదంబు చిత్రవిపిన మనఁ దగన్॥ 18

అంతియగాకః—

సీ॥ సృష్టికి న్మడిబొమ్మల జేసి నిలిపి
నటులు, తపములఁ గృశము లౌనంగములను

తేపుమాపును వీర లర్చింత్రు కనుమ!
యతితరపవిత్రుఁడో సవనాగ్నిహోత్రు! 19

(పరిక్రమించి)

ల:— (నవ్వి) ఆర్య! ఇచట నొకచిత్రము జరుగుచున్నది!

చ॥ అనలగృహాన దాఁచినవి యాబలితండులము ల్గ్రసించెనే !
యనుచు నదల్చి సోమిదమ యం దొకదండము నెత్తి కొట్టవ
చ్చినఁ బయిఁదాఁకుభీతిఁగొని తర్లక దండమె మూరుకొంచు నం
దె నిలచులేడిఁ గన్గొని మునీ ట్తతి నవ్వెడి మేల మాడుచున్॥ 20

రా:—(పరిక్రమించి) (కౌతుకానురాగములతో) సోదరా! ఈవింతం జూతువా!

ఉ॥ ఇంతకుముందె యీనియును యీమృగి యీవెలియజ్ఞవేదికిన్
జెంతల మేలిపచ్చిక గ్రసించుచునే తనదూడవైపు స
ల్లంతఁ దృణాంకురాళిఁ దనకందిడు మానిసు తాళివైచు సం
భ్రాంత మొనర్చుఁ జిందుతమి మాటికిమాటికి స్వాత్మయుగ్మముల్॥

ఇచ్చో మఱొక్క-చిత్రము.

చ॥ మునిసుతు లెందుఁ గుప్పలుగఁ బోసినచామల ముక్కు-కొండ్లతోఁ
గొని పెనుబార్లుగట్టి పఱుఁగు ల్గొనుచీమలచేత నాశ్రిమా
వని సకలంబుఁ జిత్రబహుపత్రముల న్దగుభాజనంబు లే
ర్చి నిలిపినట్లు చిత్తమునఁ జేర్చు విచిత్రముదంబు లక్ష్మణా!॥ 22

ల:—అద్దిరా! పశువులలోఁగూడ బిడ్డలపై నెట్టిమమతలో! పసివాండ్రలోఁ గూడ మంచిపనులయెడ నెంతయభిలాషయో!

రా:—(ఇంకొక వైపుఁజూచి)

మ॥ ఉపయోగార్థము మున్మును ల్నఱకఁగా నొయ్య స్తిగుల్లెత్తు ప్రాం
తపుగచ్ఛ న్గలశాద్వలస్థలిఁ గుశాగ్రంబు ల్ప్రరోహంబులౌ
టుపలాలించెడితల్లుల న్విడచి మేయుం జెంగుచున్బాయి యు
చ్చపుఁగందు ల్కను! తల్లిలేళ్ళు వెనుక న్సాగన్ గురల్చెమ్ముచున్॥

ల:—(పరిక్రమించి మఱొక వైపుఁ జూచి) అన్నా!

క॥ పదపదమున గనుపులుగాఁ
గుదిరినపాదులను వెలయు కుల్యాల నింప

న్పొదలుట వడియే రిట శ్రమ
వదల నిలిచినిలిచి యెట్లు పరివహించెడినో!॥ 24

రా:—తమ్ముఁడా! ఎంతచక్కఁగాఁ బరిశీలించితివి!

గీ॥ పాదుల న్నిక్కటిలునిండు పర్వఁ దొనఁకి
యవలిచియుకాల్వల న్బడి యరుగుజలము
కేరళీఘనచికురభంగిమ హసించు
నెటవడక దాఁట్లఁ జను స్థలాంతరపురక్తి॥ 25

ఇదిగో! భగవతి యగుకౌశికీనది! రమ్ము! దర్శించి పావనుల మవుదము! (పరిక్రమించిచూచి)

ఉ॥ చల్లన, నిర్మలత్వమును, స్వాదుత నైజము లీస్రవంతికిఁ
జల్లక, చూడఁ, గానక పస ల్కనరా, నటుకాక వేతసో
త్ఫుల్లసుమానుషంగమునఁ బొల్చుపరీమళ మెల్లచోట్ల రా
జిల్లి బలాద్విధి జ్జనులఁ జేర్చెడిఁగాదె తదంతికస్థలిఁ॥ 26

ల:— ఆర్య! ముందు గనఁబడుకౌశికీనదీతీరముపొడుగునం గనుఁడు!

శా॥ శ్రీమేధాజనవ్రతాది వటువు ల్ప్రీతి స్తడింగట్టుచో
నాముం గాంచి పలాశపాళి మధునిత్యశ్రీల రాజిల్లి శా
ఖామాళిస్థలిఁ దోఁచుసింహాకరజాకారంబు లాకోరక
స్తోమం బంకుశరాజిగా వనముఁ గాచు న్దోలి యేనుంగులఁ॥ 27

[తెరలో - రామభద్రా! మాతపోవనప్రదేశములు కృతార్థములుగా నింకెంతసే
పిట్లు సెవు

శా॥ జ్యోతిర్వ్యాప్తి యజుస్సుల న్పరిణతిఁ శోభించు దుష్టాధుఁ డే
దో శోరంపురహస్యసూర్యజపమం దున్నారు పహానీందుని, ల
య్యా! తీర్పంబడ మధ్యమాహ్నసవనవ్యాపారముల్, కోరు ని
న్నైతత్ప్రాంతముచందుఁ జేర గుమఁ డాయిాకార్యభోగాప్తికిఁ॥ ]28

రా:—(వినమిగా ననురాగముతో)

ఉ॥ స్నానము మూడుపూటల నొనర్తురు, తీర్తురు జీవయాత్ర వ
న్యానన, లేడిచర్మమెకదా మెయిఁజేర్ప, ధరింప నారలే
యైనను, జర్మచక్షువుల కందనిధామమె కాంతుని రాజసం
బేని దమంబునే నెఱుఁగ రెంతటిధన్యులో దేవమాన్యులో!॥ 29

[తెరలో - (మంగళ)

శా॥ జ్యోతిర్వ్యత్తి...భోగాప్తికిన్॥

రా:—(విని) (సంభ్రమముతో మిన్నుఁజూచి) వేఁడివేలు పిప్పుడే నడి మింటి కెక్కినాఁడే! సోదరా! రమ్మిఁక! యజ్ఞవాటినధిష్ఠించి ఆహ్నికకలాపము లన్నియుం దీర్చి నభగవానులగు కౌశికుల దాఁపు నకుం జేరుకొందము॥

ల:—(అంతటం బరికించి) ఆర్య! చూచితిరా!

ఉ॥ మండెడిసూర్యచండకరమండలము ల్వయినిండఁ బొద్దురా
తండము గుప్పుజ్వాలలకదంబముచేత జటాలమైనయీ
యెండలజాంగలంబున నొకింతయుఁ గూయదు పిట్టపక్ష్యాళి, యీ
నిండుమరీచిక ల్గనుఁ గొనెగ్గ, వినీ! నడిప్రొద్దుసొన్నతిన్!॥ 30

యజ్ఞభూమి చాలదాఁపుననే యున్నది గాన నీ వృక్షసీమ నడిసీమఁ గూర్చుండియున్న యాజకులఁ జరిత్యేక్షించి యెంతత్వరిత తగ్గగనే భగవానుల దర్శించుకొందము.

రా:—అటులనే కానిమ్ము! (పరిక్రమించి కూర్చుండురు.)

ల—(ప్రక్కకుం జూచి)

ఆ॥ వె॥ మండిమండి గగనమధ్యంబునకుఁ జేడి
బైసిమాలి వ్రేలఁబడ నినుండు
వృక్షములమొదళ్ళ విడలేక విడుఁ జాయ
లెవరో కదిసి పట్టియీడ్చినట్లు॥ 31

రా:—(అంతటం జూచి) తమ్ముఁడా! మధ్యాహ్నము దాఁటిపడసినచో నాదినమంతయుం గడచనిన దనినమాటే!

గీ॥ పొదువుగుబ్బలి విడి మింటినడిమిశిఖర
మెక్కఁజాలక యెక్కినయినహయాళి
యిట్టె చులకన జాఱెడి నిపుడు కనుము!
ఆవియస్థలినుండి యస్తాద్రి దెసకు॥ 32

ల:—ఆర్య! నిజముగా నిది రాక్షసు లరుదెంచువేళ కావుననే భగవానులగు కౌశికోపాధ్యాయులు శునశ్శేపునచే వార్త నంపించియుందురు మనల యాగవేదికపైకి రమ్మని!

రా:—(రోషముతో) హూఁ! వత్సా! అటులే యగు నెడల,

గీ॥ క్రతువుఁ జెఱుపంగ దొడరువీరల నె కాక
ప్రళయకర్కశయమభయావహముగాఁగ
సకలభూమిని నిరాక్షసం బొనర్ప
నిడుతఁ బుణ్యాహమంగళం బీధనుస్సు!॥ 33

ల:—(నవ్వి) రాత్రిచరుల నిర్మూలింపవలయు ననుద్రేక మన్నగారి హృదయమునఁ బుంఖీభవించి త్రికాలవేది యగుకౌశికభగవానులం గూడ నెట్లు లెక్కింపనట్టిదవుచున్నది!

క॥ సకలావిద్యాంకురముల
వికలముల నొనర్చు సత్త్వవీర్యుఁడు ముని త
త్ప్రకటతర దివ్యచక్షు
ర్నికటంబున వర్తమానకృతులె నిఖిలముల్॥ 34

రా:—ఏమనుచున్నావూ? విశ్వామిత్రులవిషయమేనా?

గీ॥ బ్రహ్మతత్త్వంబు నెఱిఁగిన ప్రౌఢుఁడయ్యుఁ
గేవలగృహస్థవిధులుగాఁ గీర్తిఁగాంచు
స్వర్గఫలదంబులైనయజ్ఞముల నుఱక
క్రీడగా నీమహామహుం డాడుఁగాదె। 35

మఱియు,

ఉ॥ నూతనభూతసృష్టికయి నూల్కొని యీఘనుఁ డంతలోనె స్వ
ర్ణేత వినమ్రుఁడై తల ధరించిన దేవతరుప్రసూనమా
లాతతసన్మధుద్రవముల న్జరణంబుల నింప నార్ద్రుఁడై
యాతమి సున్నచుట్టి జగమందుఁ ద్రిశంకుచరిత్రఁ జాటఁడే॥ 36

రా:—(ముందుఁ జూచి సంతసముతో)

క॥ ఆయిక్ష్వాకులపతి యీయ
జ్ఞాయతనంబున స్వకీయయాగార్చనలన్
జేయుచు శ్రుతివాక్యఁ గృతా
ర్థాయత్త మొనర్చుచుండె యగుపడు నదిగో!॥ 37

[ప్రవేశము:—దీక్షితవేషుఁడై విశ్వామిత్రుఁడు]

రా:—(పరికించి గౌరవముతో) తమ్ముఁడా! లక్ష్మణా! అటుచూడుము.

ఆ॥ శ్రౌతధర్మదీక్షుకై తగునేపథ్య
ధారణమున గురుఁడు తనతపఃప్ర
సిద్ధతేజ మెంతొ సిరులుబ్బుకళలీన
సమధికోజ్జ్వలాభ నమరినాఁడు॥ 38

వి:—(పరిక్రమించి తనలో)

చ॥ అమరుల మిన్నగాఁ దనుపనైనది యీవిధి సాంతమయ్యెడిన్
సమసెడి నింక నిప్పుడె స్వనందనుతోఁ బడి తాటకాఖ్య, చం
ద్రమకుటువింటిఁ ద్రుంచులె పణంబగుకన్య గ్రహించి, దేవకా
ర్యము లిల దిద్దుచుండు రఘురాముఁ గనంగదె స్వార్థ్య మాత్మకున్॥

(రామలక్ష్మణులు లేచి సమీపింతురు)

వి:—(రాముఁ జాలసేపు చూచి స్నేహకౌతుకములతో)

క॥ ఈవిధి విహారణశీలం
బౌవేషం బిట రఘూద్వహార్చితమూటల్
లావై నిశ్చయ మమృత
స్రావార్ద్రముగా మదంతరంగ మెగసెడిన్ ॥ 40

రా॥ల:—(సమీపించి) దాశరథులము నమస్కరించుచున్నారము.

వి:—(కౌఁగిలించుకొని) బిడ్డలారా! క్షేమమని దీవింతునోయీ!

క॥ ఆవాసవు యోగక్షే
మావిష్కృతి మీముఖాన నగుచుండుట న
ద్దేవేశు నాయుధమ్ములు
కేవల మైశ్వర్యమాత్రకృత్స్నము లగుతన్ !॥ 41

రా॥ల——(క్రిందఁజూచుచు నూఱకుందురు)

వి:—(నవ్వి) మాయీయాసన్నివేశమునంతయుఁ జక్కఁగఁ జూచితిరా? మాతపోవనవిహారభూములు మీకు రమణీయములుగ నున్నవియా? మాఋషుల గృహస్థాశ్రమములు మీమనముల స్నేహజనకము లయ్యెనా?

రా॥ల:—(ఇరువురు నమ్రకముతో)

సీ॥ అగును రమ్యము కాదు రమ్యంబటంచు
నెవ్వ రిట యోగ్యులో నిశ్చయించి తెలుపఁ !

జూడఁజూడ రజస్తమస్సులు నశించి
నిండె మామది సత్త్వ మఖండలీల॥ 42

(అందఱు యథోచితాసనములఁ గూర్చుందురు)

వి:—(భావగర్భితమందహాసమున) వత్సలారా!

క॥ కైతవవామనుఁ డనెడివు
రాతనముని యిటుఁ దపించి క్రమ్మఱు టాదిన్
మూఁతవడుమునులకను లిపు
డే తెలుచుచుఁ గాంతు రాతఁడే మీ రనుచున్॥ 43

రా॥ల:—(ఇరువురు నుత్సుకత్వసంభ్రమితు లవుదురు)

వి:—(తనలో) అహో! ఏగిపురాజన్మస్మృతి నించుక రేపితింగదా! ఇంత చాలు నిఁక నితరప్రసంగమున దింపెదను. (ప్రకాశముగ) (పడమరం జూచుచు) సారువుకొండకాశ్మీరమునఁ గుంకుమపు కేదారమందలి ప్రభాతలతామతల్లికకు మొదటిపూఁగుత్తినాఁ బొలిచిన వేవెలుంగు నాఁచేతినాచేత దిశాంగనలు తమితీఱ నందిపుచ్చుకొని వారుణీదిశకుం జేర్చిరి. ఈసమయమున,

గీ॥ ఆడుగాడిదచెవిపన్నె యానపిల్ల
నించుక తలెత్తుచీఁకట్ల నంచులగులు
వెలుఁగు దివిసెడి రవి పిచ్చికల మదకల
నాంది వెలయుఁగుజాగ్రంబులందునుండి॥ 44

మఱియు,

గీ॥ మంత్రసంస్కారపరమసంపన్నము లయి
వెలయుపడమటిమున్నీటిజలము లదిగో!
ఆత్రేయీమయుఁ డైనదివ్యప్రభాఢ్య
స్నానమాడించు నాదిత్యనామమహాతు॥ 45

రా:—(దెసలంబరికించి) తమ్ముఁడా!

క॥ మండించుతేజముబుకఁగ
మండి పిదప మంట లాఱ మసిరం గదె తూ
ర్పండ నుదగ్దక్షిణముల
నిండి క్రమతఁ బశ్చిమాశనేన్ వ్యాపించెన్॥ 46

మఱియు,

మ॥ సవనాగ్నిన్ జనియించుధూమవలభుల్ సాగన్ దిశ ల్దీర్ఘన
ట్లవుచు న్నైబకొనె నాశ్రమస్థలి నవంబౌ నెద్దియోనింపు, మూ
డవజన్మంబున వేదగానమున జంటల్వాఁకి స్పర్థ స్వాఁగు
ప్రవరు ల్సుస్వరము ల్క్రమోచ్చతగ విన్ప న్వీనువిందయ్యెడిన్॥ 47

వి:—వత్సా! రాఘవా!

మ॥ పగట న్దాద్యజియించుఛాయలనె కన్పంబట్టెనో కంచుకం
బుగ నిష్టంచనిపించు నీజగతి, చిమ్మ్రంగాఁకు వీక్షింప న
ల్పగుభూకాంతయొ! రత్నసానువున సూర్యాస్తంబు న్వేళలు
బ్బఁగఁ జిత్రాంగిగఁ దేలి చూపట్టు భానుప్రీతి సంపించెడిన్॥ 48

ల:—(విచారముతో)

గీ॥ ఎంతో తేజోమయములుగా నొఁగుదిక్కు—
లింతలోఁ గారు చీఁకట్లఁగాంచె నయ్య!
బ్రహ్మదేవుని భువననిర్మాణ సరణి!
వింతల విచిత్రతరముగా నిలుఁపుఁ గనఁగ॥ 49

అంతటంజూచి,

చ॥ అవె ఫణిరత్నదీప్తు లెగయన్ గనిపించెడి నత్రిలంబులు, లా
రవిశిలలన్ ద్యజించుచుఁ బొఱంబడె నన్ని గుపాంగి హ్యాత్మప్రటిన్
దివి నిశరాయుటన్ బడె పెనింగిన సాంధ్యహులతాశ తేశనై
భవముల నిర్గడ స్తిమిరభంగుల్ఁ గ్రోపిపు చేసికాంతలుల్॥ 50

రా:—(చూచి)

చ॥ కనుసకలంబు నత్తమిలె, గాఢతమం బెటుచుండ నొండెవి
కఱనఁదగె, నామమాత్రములె యయ్యె దిశాఖ్యలు ప్రొల్ప లేమి, ద
క్షునకును భిత్తిపేంటువులు చొప్పడె, వస్తువివేకమూత, స
ల్పిన దొకమాటసన్వాసియె చేకొన నీఖ్యాన నిశ్చయింపఁగన్॥ 51

(విచారమున)

గీ॥ పద్మముల మేలుకొల్పుదీప మగుభానుఁ
డయమొ చరమాద్రిశిఖరశయానుఁ డయ్యెఁ!

గల్వ లేఁక విప్పుమోముల న్గ్రాలఁగలవు,
క్రాలఁగల వింక జ్యోత్స్నఁ జకోరకములు !॥ 52

మఱియు,

క॥ చీఁకటినుసిపు ర్వ్వీలది
శాకాష్టంబులను దొలిచి సాంద్రిత నక్ష
త్రాకరరంధ్రంబులఁ గిర
ణాకృతి నుసి రాల్చుచున్న నభస్థలిపై॥ 53

తెరలో - కలకలము (ఎల్లరు సంభ్రమముతోఁ జెవులనొగ్గుదురు)

(తెరలో)

శా॥ పబ్బాట న్దలక్రిందునల్లమిడిగ్రుడ్లన్ ద్రిప్పుచు న్నింగి నా
గుబ్బున్జీఁకటి, యూర్పుమంటజడిఁ జీకుం జెంద, దంతంబులన్
గొబ్బుంబొమ్మిక నాల్క మూటికిని జిక్క స్నర్దుకొం, చుబ్బిత
వ్విబ్బాగ్రిద్గలఁ, దాటకాసురి యిదే వేష్టించెడిన్ దాద్రతన్॥ 54

మఱియు,

సీ॥ అయమొ త్రేతాగ్నికుండంబులందు రుధిర
మలసుబాహుమారీచులు చిలుకఁ దొడర
వారిఁతోడఁ గిలాద్భుక్రవ్యాదవితతి
తఱిమెదరు పొట్టఁబెట్టుకొఁదలఁచి మమ్ము॥

వి:-(యోజించి) వచ్చినదా! తాటక! వత్సా! రామభద్రా!

సీ॥ మాగృహంబుల వేదోక్తిపులయుక్రియలఁ
జెఱచిరకొ! యూరక కటులుచూచెద వదేల?
కొనుము నీచాపము న్మన్నిగొనుము సోకు
మూఁకల సుబాహుఁ దాటక న్మనుముఁబట్టి!॥ 56

(తెరలో - అబ్రహ్మణ్యం!-అబ్రహ్మణ్యం! అయ్యో! తండ్రీ!
విశ్వామిత్రా! ఇట్లింకెంతసేపు మాకీరాక్షసులచేనవమానములు?
ఎక్కువింటితో దాశరథి నిటుపంపుఁడు పంపుఁడు!

రా-(తెరవైపుఁజూచి నవ్వుచూ) ఓఋషికుమారా! శునశ్శేఫ! ఒక
ముహూర్త మోపికఁగొనుము!

స్కుశికతనూజ! యిప్పుడఁతిఁగ్రూల్పుఁగఁ గొంకెద, మీయనుజ్ఞ యే
యశమిడుధర్మనిర్ణయపరార్థముగా నతినెంచి యేగెదన్॥ 61

(నమస్కరించి) ఓతపోధనులారా! భయపడకుఁడు! భయపడ కుఁడు!

శా॥ ఈరక్షోబలమెల్లఁ గూల్చుకొఱకే యీరామభద్రుం డిటు
ల్సేరస్వచ్ఛమనున్నవాఁ డితనివాసింగన్న చాపంబునన్
ప్రారంభత్వరఁ బన్నుబాణ మలవిశ్వామిత్రదర్భాంకురా
గ్రారూఢాంబుకణంబుకై వడి నమోఘంభీలమౌ నమ్మెఁడీ! 63

(విల్లునెక్కిడుచు నిష్క్రమించును)

ల:—(సాశంకముగఁ దసలో) అన్నగారికౌమార మదృష్టవశమున క్షాత్ర ధర్మమునకుఁ గూడినదేయైనది. పనికిమాలినది కాలేదుసుమా! (తెఱవైపుఁజూచి) కౌశికభగవానుఁడా! కనుఁడు! కనుఁడు! పురోభాగమున నన్నగారు ధనుర్ధరులగుసరికి,

శా॥ వాయవ్యాస్త్రముసిర్గమించె, నొగుడైసట్టేది మారీచుఁ డే
దోయోరన్నడెఁజచ్చినట్టులు, సుబాహుండో గతించె, న్దెగన్
గాయంబుర్వినిప్రాల్చెఁ దాఁటక మహాకారుణ్యభీభత్సహా
సాయత్తాద్భుతకోపభీచకితులై యందెల్ల రీక్షింపగన్॥ 64

వి:—(చూచి) వత్సా! లక్ష్మణా! ఒకవైపు విస్మయము మఱియొకట సంతోషము నన్నుఁ బరవశునొనర్ప మాటాడలేకపోవుచున్నాఁడ నోయి! అయినను, జెప్పుటకుమాత్ర మేక్రొత్తవిషయముకలిగినది? నేఁటిదా యీమీప్రతిష్ఠ యంతయు?

ఉ॥ మీరఘురాజులా! దెసల మించెడికీరితి మింటఁ జేర్చుధీ
రారభటుల్ మహోద్ధతు లహర్పతితేజులు! మీధనుస్సులా!
వారనిదైత్యనిగ్రహ మపారముగాఁ గొనునాటగాఁగ, జం
భారి శచీకుచాగ్రరచనాప్తిఁ తుఁడౌటలు దాననేకదా!॥ 65

ల:—మహాత్మా!

సీ॥ వీరధర్మంపుఁబటాధానవిధిగఁ ద్రుటిని
రాత్రిచరసేన నెల్ల మర్దన మొనర్చి

(సంతోషముతో)

మ॥ బయల న్గుంకుమఁ బూసి, స్త్రీముఖతతిన్ ద్వైరాజ్యము న్గొల్పి వా
ర్మయముల్గా శశికాంతపున్శిరల నార్ద్రిత్వంబుఁ జేకూర్చి దే
వయువత్యర్పితదూర్వము ల్మెసవుట న్బల్పొందు నేణంబుతో,
వియదుత్సంగము నెక్కుచున్న దుడురాడ్బింబంబు సోజ్జృంభతన్॥

ఇంతియకాక,

శా॥ పౌలోమీకుచకుంభకుంకుమముతో బాంధవ్యము న్గల్పు నీ
బాలాబ్జద్యుతు లింద్రపట్టణపు శోభ న్బెంపుఁజేకూర్చెడిన్
నీలం బౌతమము న్గ్రసించెడి దిశానీకంబును న్దేర్చెడిన్
నేలన్గప్పెడి నంతరంధతమ పహానింగిన్ మహౌజ స్సిదున్॥ 72

మఱియు,

చ॥ నభమున రెండు క్రోసులయిన న్బయిఁ బ్రాకఁడు శీతరశ్మి, మే
ల్బభమును గైరవాళి కిడుశుభ్రకరంబులో! అహ్హెయూసమం
పుభువి మధించుఁ జీఁకటుల, భూధరకాననపాళిలోనఁ దో్రి
యు భృశము వాని, నీడల మహోగ్రత నాశముఁగూర్చు నొక్కటన్॥

(వెన్నెలపెంపున్గమనించి)

ఉ॥ వెన్నెలచిల్లగంధమున వేగఁ దమోబ్ధిఁ దమంపుపంకముల్
చన్నవొ క్రిందికి, న్బయినిస్వచ్ఛత తేఱఁగఁ, గాక నీలపు
న్మి న్నటు వెల్గు బాడిసెల నేర్పునఁ జెక్కఁగ నీడ బెత్తిక
ల్మన్నుతలాన రాలెనన మంచికళన్ శశిశోభ హెచ్చెడిన్॥ 74

(పరికించి, ప్రక్కలం జూచి)

గీ॥ చిక్కనై పత్త్రము లెసంగు చెట్లక్రింది
జ్యోత్స్న తిలతండులితమయ్యెఁ జోద్యముగను,
మదచకోరాళి గుంపులై మలసి చంచు
పుటుల నెడనెడఁ గొఱికెనేమో యనంగ॥ 75

(యోజించి)

శా॥ ముల్లోకంబు దమం బడంచెడిఖరాంశువ్యాప్తి కోకావలీ
హృల్లేశంబులమాత్రమే మిగిలె, నిస్సీ! క్షుత్తమంబు లఁడిం

ద్రెళ్లంజేయఁగఁ జాలుశీతకరు మేల్దీప్తుల్సమూలంబుగా
జెల్లన్మ్రింగుఁ జకోరకంబులు కడున్ శీఘ్రప్రడీనోద్గతిన్ ॥ 76

మఱియిప్పుడో,

చ॥ శశిమణు లెల్లవైపులను జార్చుజలంబుల బిందుసంతతు
ల్విశదముగా గుహాన్గుహను వెల్లువగా జతకూడి పాఱఁ బ్రా
గ్దిశఁ గలతెల్లకల్వమడిఁ గ్రిక్కిఱియు న్విలసిల్లు మొగ్గలన్
గశలయి వీడఁగొట్టఁ బోలి గాఁ బ్రసరించెడి జందురిడంశువుల్॥

(పరిక్రమించి పైకిఁ జూచి)

ఉ॥ పొందెను జందమామ తనువున్నడిసీమను లేదమాలము
ల్లందపుఁ గందు, మచ్చయని యందురు దానిని లోకు లుత్తద
య్యందుఁ దమోగ్రిహంబు కబళించిన వాడిమి కోఱగాట్లు
మానం దుది నిల్చుతూట్లను గనంబడు నవ్వలి మిన్నె రూపిగన్॥ 78

మఱియు,

ఉ॥ ఇమ్మెయి రిక్కతండములు, నింకఁ ద్రసాణురుచు, లొబ్బరిన్బొరిన్
భమ్మునఁ దోఁచుచుంటఁ గన, భాస్కరుఁ జక్రపుసానఁ బట్టి పొం
క మ్మెసఁగత్వష్టకూటమునఁ, గంజవిరోధిని గూడ నిల్పి, డం
కమ్ముల, బెచ్చులెల్లఁ దొలఁగ, న్సరిచేయు నటంచుఁ దోఁచెడిన్॥

లః- (అంతటన్జూచి)

మ॥ అసితార్ధంబున నంబరంబునను సాంద్రాగోపితా ల్చుక్కా! నా
ర సితార్ధంబున బల్చనోట కతమేమా? నా స్మదిన్దోఁచు, నా
కసమన్మ్యాసను జాలునన్నిగనురిక్కల్ద్రించి సంధ్యానల
శ్వసన బందుఁ గఱంచి పోత నిలుపే సాధించె సంచేశనే॥ 80

ఇది ధర్మాను సారియే గదా! (నవ్వి)

చ॥ తిమిర మకాలమృత్యువును దేసుకఁ గన్నులనుర్గంచుచువి
వ్యమహిమఁ డిల్లుతా నతిశయై యమృతాంశుఁడు ప్రొద్దుప్రంకిరా
న్వి ముఖితఁ జూపుతమ్మిగృహిణి స్మశిపాపము పూస, నస్పు జం
ద్రమునకుఁ బద్మగౌరవనితా ముఖసామ్యపుఁ బుణ్యమంతఁ గల్గెన్॥ 81

వి:- (అంతటంగలయంగని (నవ్వుచు) ఔరా! హేసఁ గల
మాధురీచేతనే విషయోపభోగులు సొగసోప్పుచుందురు గదా!

ఉ॥ తేలినఁ దేలుగా తొగలు దిక్కులు, వాపిరు తొచకోరము
లోక్రిలినఁ గ్రోలుగాక ముకుక్రోవుల వెన్నెలయిక్కరంభముల్
బోలుప నతిక్రింటెపుసిపో! యిసిరో! అమృతాంశుఁడంచుఁ బ్రా
ల్మాలికఁ బెద్దఁజేసి తగులం బనురాగముఁ గొంద్రు వెంగలుల్॥ 82

(రామునింగూడఁ జూచి సంతోషమునఁ దనలో) ఏమిది! ఈపసివాఁడింతపిన్నవయసుననే విజయమునందియు తాటకన్జంపవలసెనే యను జుగుప్సచే నాదరిం జేరరాకున్నవాఁడు! (లక్ష్మణుంజూచి) వత్సా! లక్ష్మణా!

ఆ॥ రాత్రిచరతమంబు మ్రందించి యెగఁజిమ్మి
సరవి నెదుట రామచంద్రుఁ డొలయ,
నాశ్రమమున నెట్టు లంతట మునినేత్ర
కుముదవికసనంబు కుదిరెఁ గనుమ!॥ 83

అదియుక్లేగదా!

చ॥ జనకుఁడు పాలయే, అయిన సప్తమహాబ్ధులఁ బొంగఁజేయు న
త్రినయనజన్ముఁడైన నలరించు జగద్బహునేత్రపాళి, నిం
దునమృతభాండమయ్యె సమరుత్తిన నెల్లరకంచమయ్యె నెం
తని కొనియాడనొ కువలయప్రియుఁ జంద్రు సమంజసత్వముల్॥ 84

రా:— (లజ్జతో సమీపించి) కౌశికభగవానులకు నమస్కారము!

వి:— (స్నేహబహుమానములతోఁ గౌఁగిలించుకొని) వత్సా! రఘునందనా!

ఆ॥ సలుపునట్టివాని సకలేప్సితంబులే
తగుక్రియాఫలంబులుగఁ దనర్చు
విధుల నిట్టు లేమువిస్తరింతుము, తండ్రి!
ప్రౌఢిమెఱయు నీదుపాలనమున!॥ 85

రా:— గురువాక్యము శిరసావహింతును.

వి:— (దొమ్మియుద్ధపుదుమ్ముతో నిండిన రామకపోలములఁ దుడిచి) వత్స! నాగాఢమిత్రుఁ డగు శీరధ్వజుం డాచరించు నధ్వరము రాకాసిమూకలచే నెట్టియంతరాయములఁ జీకాకునొందునో యని నామనము కడుంగడు తల్లడిల్లుచున్నది.

రా:— (గౌరవముతో) భగవానుఁడా! త్రిభువనములలో దుర్లభ మైన గాధిమిత్రశబ్దముచేఁ దాము తెల్పినయీశీరధ్వజనామము లెవరై యుందురో! ఇట్టియోగ్యత గలయీతఁడు మిక్కిలిమహానుఁ డనియెంతును.

వి:— కుమారా! వినుము! విదేహదేశమున మిథిలయనుపట్టణము కలదు.

రా:— ఎల్లరాజుల కెక్కిడరాని యిందుశేఖరునివిల్లును నాగంటివాలున నయోనిజగాఁబుట్టిన స్త్రీయు నందద్భుతము లని జనులు చెప్పుచుందు రదియేనా?

వి:— (నవ్వి) ఇఁక నేమి!

రా:—(కౌతుకముతో) అయిన నందేమివిశేషమో?

వి:— ఆ॥ ఆనభోమణి యైనసహస్రకిరణు
దయను మును యాజ్ఞవల్క్యునొద్ద గ్రహియించె
"బ్రహ్మసంహిత" యనియెడిపరమవిద్య
నధికమగుశ్రద్ధ శీరధ్వజావనిపుఁడు। 80

జనకవంశసంభవుండును సన్యస్తశస్త్రుండునగు నప్పారాతసరాజర్షికి దీక్షాలోప మగునేమోయనుశంక నన్నాకులపఱచుచున్నది. కావున, నాయాత్రకుశేషము ముగించినయుత్తరక్షణమునందే సరాసరి మిథిలంగూర్చి వెడలుదము!

రా:—(సంతోషముతో) తమ్ముఁడా! లక్ష్మణా! బాలచంద్రశేఖరుఁడు కేలధరించిన యబ్జాసనముం జూడవలయు ననియెడియుత్సాహము చాలకాలముగ నున్నది.

ల:—(చిలిపిగా) అయోనిజ యగునప్పాపకన్యం గూడ ననరాదా?

రా:—(రోషమున) ఇదొకటియా? ననవో చిత్రకవనం గల్పించుచున్నట్లున్నది. (విశ్వామిత్రునితో) ఇక్ష్వాకులగురువు లనుశాసనము ప్రస్తావసారముగనే కానిండు. (పరిక్రమించి నిష్క్రమింతురు.)

ఇది రెండవయంకము.



# శ్రీ మదనరఘురాఘవము



## మూడవయంకము.

రంగము - రాజాంతఃపురపరిసరము

కంచుకి:—(ప్రవేశించి, ముదిమిచేఁ దూలుచుఁ దననుదా నిందించుకొనుచు)

శా॥ ఓహో స్రొటన్నుడి, యెల్లగాత్రమున సంధుల్స్రెళ్ళమైతాలుటల్
లెస్సానేలికగేలితోఁ, బ్రహసనాళిన్ హాస్యపుఁబాత్రయ
ట్లున్నల్లోఁటుటహెచ్చె, దీర్ఘ మగుచాయు స్సింకపై బూదిలో
బున్నన్నట్టుల మార్చి యేరకపుదిప్పుల్ ద్రిప్పఁగానున్నదో !॥ 1

(ముందుఁజూచి) ఆవచ్చునది సీతాపాదసేవకురాలగుకలహంసిక
యేయనుకొనియెద !

క:—(ప్రవేశించి) పెద్దలకు దండాలు.

కం:—పిల్లా ! కళ్యాణివవుదువుగాత !

క:—ఆర్య ! బహుకాలదర్శనం ! ఎందుండిరాకయో !

కం:—(యోజించి) చెప్పఁగూడనిది యేమున్నది. అంతయు మీకు తెలిసినదే. అద్భుతులగు నిసువుసుకుమారులతోఁ గౌశికులవారు సీరధ్వజమహారాజులదరికి వచ్చిరట !

క:—విన్నదే. అయితే స్వామీ ! వారిపుట్టుపూర్వోత్తరాలు నామధేయాలు తెలుసుకోవాల్ననుంది కుతూహలం.

కం:—పిల్లా ! అదియుం జెప్పెద.

ఉ॥ ముప్పదిమూఁడుకోట్లసురపుంగవమూర్తులమూర్తి భానుఁ, డా
గొప్పకులాన, బంక్తిరథగోపతిచందురుఁ డెసంగు, వానిదా
తిప్పనియస్త్రవిద్యఁ గలదైత్యశతంబినులందు నూర్పులా
ముప్పు ఘటింప, వజ్రమును ముట్టనెముట్టఁడు వజ్రి భోగియై। 2

గీ॥ ఆత్మజులువీర లావసుధాధిపునకు
రామలక్ష్మణు లన పేరినామములగు

తెలుంగవచ్చి మీదర్శనంతోనదంతా మఱచేపోయ్యాను! మీ రొసర్చురాక్షసప్రస్తావనచే మళ్ళీ జ్ఞప్తి కొస్తున్నది.

కం:—(విషాదముతో) పిల్లా! ఆసమాచారమేమిటో! అటులు రాజపుత్త్రికనే కలవరపెట్టినదిగా!

క:— వినలేమీరు ? సీతాదేవి నడగడానికై రావణపురోహితుఁడొచ్చాఁడు!

కం:—(అదిలెక్క సేయక) (సంతోషముతో) ఉస్! దానికేమిగాని! ఈవార్తచే వ్యాకులపడునంతటి తెలివిగలిగేయీడు వచ్చెనా మన జానకికి. అటులయినను నిజముగా నామెయంగములు మంగళాచారముల సందెపుచ్చుకొని యౌవనమున కుబలాటపడుచున్నవనిన మాటే!

క:—తాతా! కాదామఱి! సిగ్గువిడిచి పకసంగతిజెప్తా విను నాకూ యింతకుముందే తెలిసింది. ఆకళ్యాణి,

చ॥ ప్రియసఖు లైనబాలికలు వేడ్కకు నర్థమెఱుంగలేమి, "నీ
రెయి మనబొమ్మలాల్నగలు ప్రీతి శయించెద రొక్కశయ్య నా
యయము గనంగర" మ్మనఁగ నాయన దూయన దేమొకాని ని
శ్చయముగఁ జెక్కిళు ల్పులక సందడిఁ దొట్రిలసాగ బిట్టుగన్॥ 5

కం:—(సంతోషముతో) ఇంతకాలము బ్రతికియున్నందుకు నీవైదేహి యౌవనదశంజూచి సంతసించుటకైగా (నవ్వి) తరువాత!

క:—తరువాత ముద్దరాండ్రగునబ్బాలికలు మఱీమఱీనిర్బంధిస్తే మొదట సిగ్గుపడ్డందుకే మఱలసిగ్గుపడింది!

కం:—(నవ్వి, కుతుకంతో) పిల్లా! ఈయీడనంగా బాల్యయౌవనసంధి కాదటే! అందుకని,

క॥ మూడవకన్గవ కలయ
న్గూడనిషాడ్గుణ్యకళ నిగూఢుఁ డనంగుం
డీడేఱుఁ దనదుమనము
న్గూడ నమ్మలేనిముగుదకొమ్మిరెల మదులన్॥ 6

క:—ఆర్య! మీ వెప్పుడు శుభరహస్యాలేగా! అందఱి అనుభవాలకు సూటిగాకూడా వుంటై.

కం:—పిల్లా!

మ॥ ఉబుకుం గారమ్యతతోడ నంగముల నెన్నో బింకము ల్రేఁగ న
య్యబలాటంబులకుప్ప కౌకుచయుగం బుబ్బాతలూఁప స్తగా
గుబిగా, నమ్రత దార్ఢ్యము న్దెఱలుగా గొండ్లి న్మపెంపూనఁ దో
సబుసల్వాలు వయస్యమేట్రసము మించ న్వేల్లసం బున్న దే॥ 7

క:—(నవ్వి) సరేకాని, మీరువిన్నదేంలేదు. నేనుచెప్పిందేంలేదు. ఏం!

కం:—ఇప్పటికిఁగూడ నీసంగతి మహారాజుగారికి తెలిసియుండదనియా నీయూహ? తెలిసియేయున్న నీయీప్రార్థనమునకుఁ బ్రయోజన మేమి?

క:—వీఁడిమోసమండ! రావణుఁడా! దేవిని పెండ్లాడ్తం?

కం:—(నవ్వి)

గీ॥ ప్రళయబలశాలికైనను బ్రాణగోడ్డ
మగుచు నలికాక్షుకార్ముకం బద్దుకలుగు
నిట్టిమిథిలేశతనయను జెట్టఁబట్టఁ
నెట్టిత్రైలోక్యవిజయియు నెంతవాఁడు!॥ 8

ఉత్తమక్షత్రియుం డగునీవిదేహరాజు దనకంఠముని బలవంతముం డినను దనప్రతిజ్ఞను మార్చుకొనువాఁడు కాఁజాలఁడు. ఇది కేవల మసంభవము.

క:—అదల్లే కావాలె మీనోటివాక్యాన్న. ఇప్పు డారాములక్ష్మణు లెందున్నారో?

కం:—ఆదేవాలయపుతిన్నె మీఁదనే,

క॥ మును లగుజనకుశతానం
దుని విశ్వామిత్రుఁ గొల్వ దారకొని "కానుమీ
నను నను" ననుమోక్షస్వ
ర్గనిరూఢిని జ్ఞానకర్మరతి నిల్తు రదే॥ 9

మనము వచ్చి చాలసేపైనది. కన్యాంతఃపురమున కరుగుదము పద. (ఇరువురునిష్క్రమము)

ఇదిమిశ్రవిష్కంభము

రంగము—జనకుని దేవిడి.

ప్రవేశము:—జనకుఁడు, శతానందుఁడు, విశ్వామిత్రుఁడు, రామలక్ష్మణులు.

జ:—(సంతోషముగ) విశ్వామిత్రభగవానుఁడా!

క॥ భవదాగమనానందం
బవశ్య మగుపడనియట్లు సగుపఱచుచు మా
దివులు స్వదల్చి కడును
త్సనమై సుదినం బొనర్చుత న్నే డనఘా!॥ 10

మఱియు,

ఆ॥ అద్దిరా! ప్రదక్షిణ ర్చిర్వితానుఁడై
కొను హవిస్సు లగ్ని జనపదముల,
నాంగిరసుని స్రుక్కునలయదు శాంతిక
పౌష్టికముల, నీ ప్రభ ల్వెలుంగ॥ 11

వి:—మిత్రమా! సీరధ్వజా! చాలకాలమునుండియే నీయీజనపదములు శాంతములుఁ బుష్టములు నగుట నేమెఱుఁగనిదియా?

సీ॥ బ్రహ్మమీమాంసలోనితత్త్వం బెఱుంగు
నీవెకా దండధారివిగా వెలసెదు,
ఆంగిరసుని ప్రపౌత్త్రుఁడు నంతఘుటకుఁ
డీశతానందుఁడే పురోహితుఁడు కాదె॥ 12

(నవ్వుచు) అల్లుఁడు దొరకునా యనునాందోళన మొక్కటియే మాసాయమముం గోరుచు మిగిలియున్నది. కాకున్నను, నీబోంట్లకు దుఃఖసంతోషములన లోకసంగ్రహార్థమే కదా!

ఆ॥ అల్లతైత్తిరీయయాజుషంబుల మూర్తి
మంతములుగఁ బలుకుమంత యెవ్వఁ
డట్టియాజ్ఞవల్క్యుఁ డగుఁగాదె వేదాంత
సారమెల్ల నీకునూఱిపోసె!॥ 13

ల:—(రహస్యముగ) అన్నగారూ! "విదేహపతియన సామాన్యుఁడుఁ గాఁడు. ఆతనిచరిత్ర మతిపవిత్రము నపరిమేయము నాశ్చర్యకరము" నని గురువుగా రెప్పుడుననుచుందురే, ఆయనఘు లీయనయే కాఁబోలు!

రా:-(ప్రమోదానురాగములతో) వత్సా! వారేవీరోయి! శతపథము. లనఁబడువాజసనేయబ్రాహ్మణములలో నధికారిగ ముందు వీరిని జెప్పి మఱొకరింజెప్పవలయును. యాజ్ఞవల్క్యభగవానులే వీరికి శుక్లయజుర్వేదముం గఱపినది. (కొంచెము తేటిపాఱఁజూచి)

సీ॥ యతులనోడించి, తనగురువైనయాజ్ఞ
వల్క్యునకు వేయిగోవు లర్పణమొనర్చి,
వేవెలుంగుప్రశిష్యుఁడై వెలయునాతి
థేయు మైథిలునకు సేవ సేయువాఁడ॥ 14

జ:-తాము సెలవిచ్చినయన్నింటిలోఁ దమరేసమర్థులు. వేవెలుంగుశిష్యులగుయాజ్ఞవల్క్యునొద్దఁ జదువుకొంటి ననుటొక్కటియే నాసకల యశస్సులకు మేలిపతాక.

వి:-ఓహో! యోగీశ్వరా!

ఆ॥ ఇంతవాఁడుజనకుఁ డిట్టిఁడుయాజ్ఞవ
ల్క్యుం డటంచుఁ గవులె కొలువలేరు,
మీపవిత్రవాహనిత్యతా(ప్రబంధముఁ బాసుఁ
గాదె వేయినోళ్ళ వేడిచయమె॥ 15

శ:-భగవానుఁడా! ఇట్టివారేకదా! మూఁడుభువనములలో మహనీయ మగుమహిమ గలమనీషులు!

జ:-(లజ్జనైనచిఱునగవున) భగవానుఁడా!

క॥ తమనుడు లఘుమర్షణబు
క్రమముగఁ బాపంబు లణఁగలవని బహుకా
లముగా వినవలతును, దుః
ఖమె పెనుచు మదర్థవాదకల్పన మేలా?॥ 16

ఇఁకఁ దాని దయచేసి మానుఁడు. (లలాటాంజలిం బట్టును.)

వి:-(నవ్వుచు జనకునియంజలిని వదలించుచు) మిత్రమా! సీరధ్వజా! చేమోడ్పు లేటికయ్యా! ఇఁక మే మామాటలనేమొత్తము. సరియా! శివునివిల్లు నెక్కువెట్టఁగలనేర్పరి యగునల్లునిఁ బడయుటచేఁ బరిపూర్ణప్రతిజ్ఞుఁడ వౌదువుగాత!

ల:—(అపవారించి) అన్నగారూ! వీర లొకరినొకరు పరస్పరోత్కర్షముల నెన్నుకొంతే నిరమణీయముగ నున్నది. ఈఋషిసంఘ మెంతపావనమైనది!

రా:—సోదరా! నీపలికినదే వాస్తవము.

గీ॥ లోకసంగ్రహమే యాత్మలోఁ దలంచి
శ్రుతులశీలముల నీఋషుల్ స్మృతులొనచ్చ
కీర్తిఁగని, రొండొరులమహోత్కృష్టమహిమ
మొండొరులకే సువేద్య మన్యులకుఁ దరమె?॥ 17

జ:—(సంతసముతో) మిక్కిలి యనుగ్రహింపఁబడితిని.

శా॥ ఆసామాగమసారమో! వెలిని లో నౌపాపము ల్వాల్చుఋ
గ్వ్యాసంగంబులొ! యాజుషం బయినమూలార్థంబొ! నా నెందు మే
లై సాక్షాత్కృతిగా ఫలంబు లిడునీయాశీస్సు నాబిడ్డ సం
తోసిల్లన్ పదుఁ డించె యెందొ కలఁడన్యాచార్యమమ్ము గ్నేపెడిన్॥ 18

వి:—(వ్యంగ్యమందహాసమున) మిత్రమా! సీరధ్వజా! నిజమే.

మ॥ బహుదుష్ప్రాపముకంటె మిక్కిలియుదుష్ప్రాపం, బిహాముష్మికా
ఘహరం, బధ్యయనంబులేమి శ్రుతుల న్బ్రొంజూ క్షణాన న్ఖిలం,
బహహా! లోవెలిపాపహారి, శ్రుతిమాత్రావాప్యమున్, శుద్ధిక
న్వహమున్ శుద్ధిని గూర్చు విప్రునుడి, వహ్వా! తప్ప టున్నే
యెటన్॥ 19

శ:—(తనలో) నిజముగ రామభద్రునే అల్లునిగా నిర్ణయించుకొనియే యీమహాత్ముఁడు సీరధ్వజుని మాటిమాటికి వ్యంగ్యాలాపములచే భ్రమపెట్టుచున్నాఁడు. కానిమ్ము! ఈయనకనుకూలముగ నే నేమియు నెఱుఁగనట్లుగ నడిగెదను. (విశ్వామిత్రునితో) గరుడకేతనుని శ్రీవత్సకౌస్తుభములవలె నున్నయీకుమారు లిరువు రెవరి బిడ్డలో?

వి:—(తనలో) వత్స! శతానంద బలే! ప్రస్తావనమునకు మంచి రేవును గల్పించినావోయి! (ప్రకాశముగ) కుమారా! గౌతమా! వీరిరు పురాకాకుత్స్థకులోద్భవులు!

శ:—(గుర్తించినటుల) ఓహో!

చ॥ సవనపుఁ దేజి నంటుక దుహాంశుక సైవస్వతంత్రకీర్తితో
భువి దుగదోయిహాతలముఁ ద్రొల్పఁగ నిచ్చి, సుతేష్టి సర్వదే
వవరులఁదుష్టిగా సలిపెఁ బంక్తిరథుం డనురాజమౌళి, వి
ష్ణు వట స్వాయంబుగా ఫలమును స్ఫలబోక్తయు సయ్యెఁగాదొకో!

ఏ రింతయు నాదాశరథులనిసమాట? రామలక్ష్మణులేకాదూ? తాటకారాక్షసిని జంపునట్టి మంగళమును సంపాదించునిమిత్తమై భగవానులగుతమరు వీరిచే దివ్యాస్త్రమంత్ర పారాయణమును జేయించుటయు నందుకు గురుదక్షిణగ వీరు తాటకామదనయాగమును నిరంతరాయముగ రక్షించి మిమ్మునేవించుచుంటయు వాస్తవములేగదా!

వి:— కాకేమి.

జ:- (అనురాగబహుమానములతో రామలక్ష్మణులఁ జూచుచుండును)

శ:- మఱి, వీరిలో రాముఁడెవరు లక్ష్మణుఁడెవరు?

వి - (రాముంజూపుచు) వత్స!

చ॥ రవికులజాతులై వెలయు రాజుల సంతనుతీవె వాడు లే
యువుపడఁబోని మంజుకుల స్వచ్ఛపరంపరలోన నల్లుఁరు
ద్భవమును గాంచి, రగజుఁడు తాటక పేరిటికాళరాత్రి వే
కు వితఁడె రాముఁ డయ్యె! చెలఁగు నృకధాంకువనూలకందమై॥ 21

(లక్ష్మణుం జూపుచు) ఇతఁ డీతఁడో! లక్ష్మణుఁడు.

శ:- భగవానుఁడా! ఆవసిష్ఠుప్రభావమున నీరాజవంశ మభివృద్ధి నందుచున్నదన్న మాట.

జ — (నవ్వి) స్వామీ! బాగు! బాగు! తాము మానంటివారితోఁ గలసి మెలసి వినోదముగఁ గ్రీడించుచున్నారు. లేకున్న

మ॥ కొన కౌశ్రకుఁడు "హు" మ్మటం చనమతి స్నూర్పస్రిశంకుండు సి
గ్గునఁ దాటొందుచు నేతియూహుతిగఁ ద్వాలో(—)థాగ్ని విశ్వంబుఁ గా
ల్చునో నా నేఁగఁగఁ దాటుసిన నదవిసి తోస్సుక్నృద్ధచాటూ కులక్
మనవిక బద్మభవుండె సల్పుటగదా మా నెక్ ద్రిలోకావదల్!॥

అట్టి భగవాను లగుతమకా యాగయాజమాన్యమున నన్యుల సంరక్షణము?

శ:- రాజర్షీ! అది సమంజసమే. ఇంక నేమనిన, దీక్షఁగొన్నవారు కోప
గింపరాదు కావుననే రాజులు రక్షణక్రియ కెన్నుకొనఁబడుట.

జ:- (సంతోషమున రామలక్ష్మణులఁ దడవుపలక్షించి రహస్యముగ)
శతానందభగవానుఁడా!

మ॥ పరమాత్మానుభవైకనిష్ఠ చలియింపన్లేదుసూ మున్ను భా
స్కరశిష్యుల్గనుఁ గొల్చువాఁడయిన, విశ్వామిత్రుఁడే తానె యీ
వరుస న్నాయిలు జేరినాఁడనిన, వత్సా! యేప్రభావంబొకో!
మఱితోఁ సర్వసుఖంబు లీదశరథక్ష్మాపాలు సంతు ల్గనన్॥ 23

శ:- ఓ రాజర్షిశేఖరా! విదేహాధిపా! అటులనే కనుపడుచున్నది. నాకుఁ
గూడ నీరాజపుత్రిద్వయదర్శనమున సీతోర్మిళలు మనసునకుఁదగిలి
యచటినుండి తొలఁగుటయే లేదు.

జ:- (విశ్వామిత్రునితోఁ) భగవానుఁడా!

క॥ ఈనయనుబింకము మనో
జ్ఞానయనముఁ బొందు వీరమద్భుత మగుగా
భావిపులాంకూరంబట
ఈవీరులఁ గనుటఁ గృతిన యేననుకొందున్॥ 24

వి:- (దెప్పుడు నగవున) సీరధ్వజా! ఎటులు కృతార్థుఁడవో నీమనసునే
తెలిచి యడిగికొనుము.

జ:- (విచారముతో)

చ॥ రవియట, సర్వతేజములరాజట వీరలవంశకర్త! బ్ర
హ్మవిదుఁ డరుంధతీప్రియుఁడె యొజ్ఞానట వీరల ధర్మనిర్ణయ
ప్రవరుఁడు! నచ్చె నీమనువు త్వన్మది నామదినైన; నేమిసే
యవలయు శుల్కసేతు వాకఁ డడ్డము దారుణమై చెలంగెడిన్॥ 25

రా:- (రహస్యమున) మనకథల నేటికో తడువుచున్నారు?

వి:- (నవ్వుచు) శుల్క మనునది యొక్కటియే యంతరాయమైనచో
నదియెంతమాత్రపుదిలెమ్ము!

జ:- (ఖేదముతో వితర్కించి యపవారించి) శతానందభగవానుఁడా!

చ॥ పరమమునీంద్రుఁ డీజనకుపట్టికరగ్రహణం బదెంతొ దు
ష్కరతరమూల్యసాధ్య మనుసంగతి సర్వముఁ దాను రూఢిగా

నెఱిఁగిమెఱింగి తేలికగ నిట్లువచించెడిభావ మేమియో
గుఱుతిడలేక నామనము కుమ్మరసారె యనన్ భ్రమించెడిన్ ॥ 26.

అదియుంగాక విచారింపఁగా

గీ॥ స్థాణు వంతటివాఁడు హస్తమునఁ దాల్చు
దీని నెక్కిడు టంతపైఁబై నిగలదె !
యేనొనర్చినప్రతిన నేనేనిరంధ్ర
మొనరునే సాకుతోఁ దప్పుకొనెడిరీతి !॥ 27

క:– పాపము శాంతించుఁగాక! శాంతించుఁగాక !

గీ॥ హరునివిల్లు దుర్లంఘమౌ టదినిజంబు
నీప్రతిన మార్పరామియు న్నిశ్చయంబు
అయిన, రాఘవశిశుసహజానుభావ
దీప్తియు గభీరతయుఁ దేటతెల్లమొకద!॥ 28

జ:– (విశ్వామిత్రునితో) కౌశికభగవానుఁడా! ఎంతవితర్కించుకొనియు నీవాక్కుల కర్థ మెఱుంగలేకున్నాఁడ!

వి:– (నవ్వుచు) అయినచోఁ జంద్రకిరీటుకార్ముకరాజమును జూపెట్టుము. రామభద్రుఁడే వలయునర్థమును వివరింపఁగలఁడు.

రా:– (సంతోషమునఁ దనలోఁగాం తెమకోర్కులతో నన్ను నే నెట్లు వినోదపెట్టుకొనుచుంటిని! నాకుతుకముల దీర్చుకొనుటకే గురుండైశ్వరమగు కార్ముకముం దెమ్మనుచున్నవాఁడు. (జనకునిజూచి విమర్శతోఁ దనలో)

గీ॥ బాలునకు నింతపని యసంభావ్యమనుఁడో!
గట్టినమ్మిక మునినుడి న్గలుగుననుఁడో!
తనదుమది నెన్ను నిజమ యీధరణివిభుఁడు!
ఏమనునో యంచు బెదరు నాహృదయ మిపుడు॥ 29

జ:– (ఇంచుకయోచించి నిట్టూర్పుతో) భగవానుఁడా! తమంతటివారి ప్రాపు దొరకునదృష్టమును మైథిలి నీరఘురాజకుమారున కొకప్పటికైన నీఁగలుగునదృష్టము మావంటివారికేనాకల్గును? అట్టిచరితార్థత మాకుండునా

రా:– (సిగ్గుపడును)

జ:— (శివుని విల్లువంకఁ జూచుచు)

చ॥ తనభువనావనవ్రతవిధానము నిందఱిధనుస్సదేమహా
జనపతికార్ముకంబుల కొసంగి తుది నొక్కజడయ్యె నట్టిచేం
డ్లును, ముదివింటి దీనిఁగని, లోఁగడఁ గల్గిన జ్యాకిణాంకమో
హనమృగనాభిసౌరభితహస్తములున్ వృథగాఁ దొలంగరే!॥ 30

వి:— మిత్రమా! మహాపుణ్యరాశివగునిన్ను నీవే యవమానించుకొందువా?

ఉ॥ అంతయుఁ గూర్పఁగాఁ గలుగునంతటిదేసుమి నీదుభాగ్య, మా
వింతలశోభనంబులకుఁ బ్రేక్షకు లౌదుము మేము, భూమి న
త్యంతము నుంద్రు సర్వభువనాభయదానసమర్థధారుణీ
కాంతులు, రామభద్రులసఁగా దగువారొకొ వార లందఱున్॥ 31

ల:— (తనలో) నే ననవలయు ననుకొనినది గురువుగారే సెలవిచ్చిరి.

జ:— భగవానుఁడా! మణిమంత్రౌషధాదులందువలెనే యీరఘురాజకుమారులందుఁగూడ సచింత్యప్రభావమున్నదనినమాట. ఈసంగతి వినుఁడు.

చ॥ దివిజులశక్తు లన్నిటినిదీసి విరించి సృజించెఁ, బార్వతీ
ధవుఁడె సమాదరించె, హరి దాన శరంబు, ఫణీంద్రుఁ డల్లె, యీ
భువనము లన్నియుం గెలుచుప్రోడ, పురంబులుమూఁడె లక్ష్య, మ
ట్టివిలు మహాద్భుతంబును గడిందికినేనిఁ గడిందిచేసుమా॥ 32

శ:— ఇట్టు లీపినాకధనుర్విశేషతల నెన్నుకొను టెంతసేపని? విశ్వామిత్రభగవానులనే విశ్వసించి గౌరవింతము. అదికాకున్నను రామభద్రున కశక్య మగుపని యొకటికలదా!

శా॥ ఏదో రాక్షసకోటిహోమ మని యొం డేర్పాటుగాఁబూని, క్రి
వ్యాదిన్ దాటక నాదిమేంధనముగా నాసామిధేనీప్రతా
పాదాయంబునఁ బొల్చె బాలకుల యల్పప్రౌఢబాణాలనే,
కాదే స్పష్టము రావణున్ గెలుచు నీకం దంచు నిద్ధానిచేన్॥ 33

[ప్రవేశము:— తెరప్రక్కగాఁ దొంగిచూచుచు నొకపురుషుఁడు.]

పు:— దేవా! దశాననపురోహితుఁ డగుశౌష్కలుఁడు రాజుగారిం జూడఁ గోరుచున్నాఁడు!

శ:- (ఉద్వేగముతో) ఆఁ!...రానిమ్ము! (పురుషుఁడు-నిష్క్రమము)

రా:- (వ్యథతో రహస్యముగ) తమ్ముఁడా! లక్ష్మణా! ఈరాక్షసరాజ్ఞీ కామారికార్ముకరాజపరిచర్యామహోత్సవమున కంతరాయమయ్యెనే!

ల:- ఉత్సవ మొక్కదానికే కాదనుకుందును. (నవ్వును)

రా:- (ప్రేమయుతరోషహాసములతోఁ గ్రీగంటఁ జూచును)

శౌ:- (ప్రవేశించి, అందఱఁ బ్రత్యేకముగఁ జూచి తనలో) జనకశతానందులతో విశ్వమునకేకాక మాకును శత్రువగువిశ్వామిత్రుఁడుండు టేలచెప్పవూ! (యోజించి) ఉన్ననేమగు నుండనిమ్మాహాతకుని! (చేయిదక్షిణమునకుఁజూపి) ఈక్షత్రియబ్రహ్మచారు లిరువు రెవ్వరో!

గీ॥ మౌంజి దండంబు మొదలైనవ్యంజనములఁ
దొలఁకుశాంతరసం బొక్కదోహదముగ
వెలయ విల్లంబుల న్బొర్లు వీరరసము
గిఱుపుచున్నారు పుణ్యలక్ష్మీకరుచుల!॥ 34

ఈబాలకు లిద్దఱు సహోదరులుగ నున్నవారే!

గీ॥ ఋగ్యజుస్సామముల మూటికేక మూర్తి
మంతములుగాఁగ వెలుఁగొందుమంత్రవిధుల
నయ్యథర్వాగమంబొకో! యనఁగ వీరి
ముగురిచెంగట నుమతేజముల వసింత్రు॥ 35

(విమర్శించుకొని) నిశ్చయముగా లక్ష్మణద్వితీయుఁ డగురామహాతకుఁడే యియ్యుండవలయు! విశ్వామిత్రుననుసరించి యీమిథిలం బ్రవేశించియుందురు. (క్రోధశోకములతో) అయ్యో! బిడ్డా సుకేతుకుమారీ! తాటకా! ఇట్టిమానిసిసిసుఁగులచేతిలోనా నీ కీ దైవదుర్విపాకము! అనరణ్యవంశజాతుఁ డగునీక్షత్రియబ్రహ్మచారి యింత యొడలెఱుంగనిశివమా! ఎంతకష్ట మెంతకష్టము!

ఉ॥ కౌశికయాగబాంధవుఁడుగాఁ జనుదెంచియు వీరసుందరై
త్యేశకుమారరక్తమధుతృప్తి మదించుశరాళిచే దురా
వేశము నొంది, భ్రష్టసువివేకత నాఁడు దశాస్యవంశపా

కానిమ్ము ? ఇతనిభుజబలపరాక్రమములు చూతుముగాక
(సమీపించి ప్రకాశముగ) జనకమిత్రులందఱుం గుశలముకద ?

జ:- రావణపురోహితులకు స్వాగతము! ఇట నాసీను లగుదురుగాక!

శౌ:- (కూరుచుండుదురు)

జ:- ఏమి! మీ రావణరాజునకుఁ గుశలమా? ఏలకాదు లే!

గీ॥ అర్థ్యధర్మాగమోపాయహావనదక్షు
లయినత్వాదృశు లెందఱో అందెసంగి
యెట్టియాపదనే నట్టిపెట్టుచుండ
నతడు కుశలమ యని వేఱ యడుగనేల? ॥ 57

శౌ:- (నవ్వి) మహాశ్రోత్రియా! సీరధ్వజా! ఆతనికేనా ఆపదలు? నేమా వానిని కాపుట? కాపురే! తనభుజదండములను మదపుటేనుంగులచేతఁ జట్టుకొనఁబడినవక్షస్థల మనుసౌధముననురక్షితముగ నున్న త్రిభువనలక్ష్మీమహాంతఃపురమున వేంచేసియుండు నాలంకానాథున కెట్టియాపద ముట్టఁగలదు? ఇటువినుము!

ఉ॥ భీతిలి పాఱుచోనయిన వీపుఁగను ల్కడువిచ్చి యేనిచే
స్టాతతి నాజి వేగనులసామి కను ద్దనమోలిల నున్నటుల్!
పాతు నగల్చి వెండిమల పైకెపఁ డింతనె యెత్తె నాగలో
కాతతజైత్రయాత్ర కన! నట్టిరు ముట్టునె యెట్టియాపదల్? ॥ 38

ల:- (కోపముతో) (రహస్యముగ) అన్నగారూ! వాలిచేతను వేచేతుల హైహయరాజకాళిచేతను నాశమొందింపఁబడిన శౌర్యసారము గలరావణుఁ బ్రశంసింతురేల?

రా:- తమ్ముఁగుఱ్ఱా! అట్లనరాదు! తాదృశు లందఱుం గొప్పవారే సుమా! ఏమనిన?

ఉ॥ ఆతనియుద్ధసుస్థిరతయంతయు వాలియె, కార్తవీర్యభూ
నేతయె కాంచిరన్నఁ గడునిష్ఠుర మాతనిమూపుపెంపువి
ఖ్యాతి! సరిల్న గొంతు నఱుకన్ దరిఁ జిందిన యెమ్ములుంపుల్
బీతి స్వకేభచర్మమున వే మృదుఁడే తోలఁగించు టెన్నరే? ॥ 39

మ॥ కలనన్ వాసవఘోరవజ్రమును మొక్కల్లోన భంగించి, మొ
కల్లుండై మూడుజగాల రావణుఁడు, స్వర్గం బేలుచున్నాఁడు! చం
చలయై యెప్డు భ్రమించు శ్రీలలనకున్ స్వాస్థ్యంబు నాత్మీయశా
ఖలతాకేళివనంబున గల్పించినాఁడో హోహో! సామాన్యుఁడే!

శతా:—(శౌష్కలునితో) విప్రుఁడా! నిజముగ సింతగట్టివాఁడే మీ
రాక్షసరాజు!

శౌ:—జనకరాజర్షీ!

మ॥ భుజకండూతిని గోసి ధాల్చినశిరంబు ల్తుష్టిఁ బ్రత్యక్షమౌ
గజచర్మాంబరు సత్కృప న్మొలిచి వేడ్క న్గోర్కి యాచింప ల
జ్జజనింపన్ దమలోన "నీవడుగు! మజ్జా! నీవె! నీ" వంచుఁ గో
రె, జగాజాణతనాన! నట్టిఁడు దశగ్రీవుం డెటుల్చెప్పనే?॥ 41

గీ। అట్టియాతం డయోనిజయైనకన్య
నీశతానందగుప్తి నీయింటఁ బెరుఁగు
దానిని వరించి యాచింపఁబూని యిటకుఁ
బయనమొనరించి నన్నిట్లు పనిచినాఁడు!॥ 42

వి:—మిత్రమా! సీరధ్వజా! చూడుము! చూడుము!! శివునివిల్లు
నెప్పుడు చూతునా యనునుల్లాసముతో నాకులితమనమున నున్నట్టు
లున్నాఁడీ రామభద్రుఁడు!

జ:—(నగి)

గీ॥ ఏల? భగవానుఁడా! మీర లిటులు మాటి
మాటి కోరక పలికినమాట పలుక?
నీవి దేహాలు నిక్ష్వాకులేని నెపుడు
మీవిధేయులె కావుట మీ రెఱుఁగరె?॥ 42

యీ...ధ్వజా! మే మాకసమునా అడుగుచుంటిమి? లేకున్న
నీడు యుపరిహార్యమని యెఱిఁగియు నేల ప్రతివచనము నీయవు?

ఉ॥ ఎవ్వనికో యొకయ్య కిడనేవలయున్నద కన్య! నట్టిదోఁ
జివ్వ, భుజాబలోద్ధతి వశీకృతలోకుఁడు రావణుండె ని
న్నివ్విధి వేడ మూఢుఁగతి నేటికి జూతు? మరీచిముఖ్యులం
దెవ్వగ సాత్త్వికుండె యను నెన్నిక గోష్ఠుల నీకుఁ గల్గెనో?॥ 43

శ:—బ్రాహ్మణుఁడా! మేము చాలకాలముక్రిందటనే ప్రతివచనము నిచ్చియుంటిమి.

శా:—ఏమీ! రాజపుత్త్రిని సమర్పించుట కాకింకెట్టిదా ప్రతివచనము?

శ:— క॥ హరువి ల్లెక్కిడి మము నె
వ్వారు సంతోషింపఁజేయువారలొ, కననౌ
దురు వారె బహుమతిగ నీ
ధరణీసుతమైథిలిన్ యథార్థముగాఁగన్॥ 44

శా:—హర! హర! పాపము శాంతించుఁగాత! శాంతించుఁగాత! మీవంటివారుఁగూడ నిట్టియక్షరములనా ఉచ్చరించుట? ఔరా!

చ॥ ఎవరికరాగ్రము ల్యతము నెత్తి కుబేరగిరిన్ గళోక్తిగాఁ
గ వెస గడించెనో కులిశకంధళసామ్యదృఢత్వకీర్తి! నా
ప్రవరమహేశ్వరుం డయినరావణుఁ డేడ? ననార్య మీదృశం
బవుపనిఁ జేయువాఁడ? వినినంతనె మానస మోకిలించెడిన్॥ 45

శ:—(నవ్వి) బ్రాహ్మణా!
గీ॥ ఉత్తమక్షత్రియత జన్మమెత్తినాఁడు
ప్రతినఁ దప్పఁడు జనకాధిరాజితండు
ఎక్కిడఁడుకాదె దశకంఠుఁ డీధనుస్సు?
నెఱుఁగఁగాలేవె? మాజవాబేమొ నీవు! 46

శా:—(హసించుచు)
సీ॥ అంగిరసుఁడును మఱిపులస్త్యమునికూడ
నబ్జసంభవుపుత్త్రులైనందున, కహ
ఆంగిరసుఁడవు పౌలస్త్యుఁ డగుదశాస్యు
నందు విషవైతి జ్ఞాతివైరానురక్తి॥ 47
(రోషమున)
గీ॥ ఈదశాననుఁడేమొ మాహేశ్వరుండె!
ఇతరనృపు లెంచఁ గడుక్షుద్రులే ధరిత్రి!
నీపినాకంబు కాకిడులేమొ శుల్క!
మయ్యెనయో! సీతగతియేమియగునొ యింక?॥ 48

శ:-(రోషంపువ్యథతో) బ్రాహ్మణా! ఈరీతిగా నీధనుస్సు నీచే వినయప్రబంధంబు పాటింపం జేయుచున్నదా! పాప మిప్పు డిప్పుడే యీమీదశకంఠుఁడు వీరమాహేశ్వరుం డయ్యెనేమి?

గీ॥ శంభునకు నిల్వ సండయీశైల మెత్తఁ
గుతుకమున మూపు లెగిరించుకొనియె మున్ను!
ధనువు నెక్కిడవలసివచ్చిన దశాస్యుఁ
డౌర! వీరమాహేశ్వరుం డయ్యె నేఁడు॥ 50

(శౌష్కలుఁడు తక్కనెల్లరు నగుదురు)

శ:—రోషమునుమాటుచు) రామభద్రా! రామభద్రా!

గీ॥ ఈశు ముంజేతిభూతి వహించు నారి
కలుగు నీచాప మెక్కిడ న్గడఁగు మింక!
వీరగర్వితుల మొగాల వెలయఁగాత!
వారి జ్యాకిణకాళిమాగౌరవంబె!॥ 51

శౌ:—(క్రోధముతో) ఓరీ! శతానంద! ఒడలుతెరుగుచున్నవా యేమి! నాముందఱనే మహారాజగుపౌలస్త్యుని ధిక్కరించుచున్నాఁడవు! లేకున్న, మాణిక్యమును బరిత్యజించి మసిరాతిని బరిగ్రహించునటుల రావణునవమానించి మానిసినగునం దనురాగముం బూవా! నీతల్లి యహల్య మాన్యులలో నుత్తముఁడగు గౌతముం ద్యజించి తా బెళ్ళంతటి వేగన్నులయింద్రు నంటఁగొనినటులు.

శ:—ఓరీ! నాయెదుటనే యేమనియెదవు!

వి:— (ప్రణయరోషముతో) వత్స! శతానంద! పనికిమాలినజగడము లెందులకోయి? మానుము! దశగ్రీవోపాధ్యాయుఁడైన శౌష్కలుఁడు మనకతిథికదా! (వ్యథనొందు రామలక్ష్మణులం జూచి) వత్స! రామభద్ర! జనకపుత్రీహితుఁడు నిన్ను ధనుస్సున్న యింటికేగ ననుమతించెఁగదా!

రా:— గురునానతిచొప్పుననే యరిగెదను! (వినయలజ్జాకౌతుకములతో లక్ష్మణయుక్తుఁడై యేగును)

శౌ:— రాజర్షీ! సీరధ్వజా! నీవెంతధన్యుఁడవు! తొల్లి పరమేశ్వరపరిచర్యకై తొమ్మిదితలలు నఱకఁబడఁగా

ఉ॥ ఇట్టిమహాద్భుతం బయినయీపరిచర్యకు దీటుగాఁగ నే
నెట్టివరంబు నిత్తు ననుయీశ్వరుమోమున విస్మయంబు గ
న్పట్టినఁ జూచి దాని నుడువన్ భువనత్రయిమాత్రమే వరం
బట్టులు కోరె నేనిదశమాస్యము నిన్నదె కోరు జానకీ!॥ 52

శౌ:— (లేచి తెరవైపుఁజూచి) (హర్షాద్భుతములతో తమ రెల్ల రటు చూడవలయు!

చ॥ అలజగదేకధన్వి యగునాభగవచ్ఛివమూర్తి కల్లయై
నిలచి యసీంశ్వరుండు, తెగ నిండునలాగినఁ గర్ణభూషయై
తోలఁపఁగఁ గంకణంబయి ప్రతోషము మున్నమకూర్చియుండఁడే!

జ:— (ఉత్సేకమున)
భళిర! కకుత్స్థుఁ డెక్కిడెడి భార్గవదేశికచాప మయ్యహా॥ 53

[తెరలో-కలకలము-ఆందఱుం గలవరమునఁ జూతురు]

(మఱలఁ దెరలో)

చ॥ అలశివు సష్టమూర్తు లోకలై కదియుంబడె, సష్టదిక్తతుల్
పలపల్రమోఁగె, సల్వచెవుల న్గడుగింగురు సోఁకె, నెన్మిదా
కులగిరు లయ్యెను, గ్గురగకోటికులాష్టక మత్తు లాఱె, దో
ర్బలరఘురామకర్షితపురాతనకార్ముకభేదనధ్వనిన్॥ 54

జ:—(హర్ష విషాదాద్భుతములతో) అహో! విఱిగినదికూడ!

శ;—

ఉ॥ సీతకుఁ బెండ్లికై ద్విజులు చెప్పెడియాజుషమంత్రనాదమో!
నాతులు పాడు శోభననినాదపరంపరితోరుగానమొ
క్కో! తతవైరినాశ మొనఁగూర్చు నుపశ్రుతిపెంపొ! మింటసం
పాతితె రామభగ్నశివభవ్యశరాసనవజ్రరావముల్!॥ 55

శౌ:—(విషాదాద్భుతములతోఁ దనలో) అహో! ఈరాచమిఱుగుడువురు వన్నిట సమర్థమైనదిగ నున్నదే!

జ:—(సంతోషమున వి:-పాదములవ్రాలి) భగవానుఁడా! గాధినందనా!

క॥ కొన్నాఁడు రాముఁ డాత్మగు
ణోన్నతినే జగ మెఱుంగ నుర్వీతనయన్

గన్నియ నాయూర్మిళ ల
క్ష్మన్నకు నేధారవిడుతు మాంకులనీతిఁ॥ 65.

వి:—(నవ్వుచు) మిత్రమా! సీరధ్వజా! నీకట్లభిరుచియైనా అట్టులే చేయుదుముగాక!

శ:—(జనకుచెవి నెదియో చెప్పి) కౌశికభగవానుఁడా! చంద్రశేఖరు విల్లు నెక్కిడినసంగతిని మొదటఁజెప్పిననా కేమిబహుమానమో?

వి:—(నవ్వి) వత్సా! కోరుకొను మడ్డమేమి?

శ:—స్వామీ! కుశధ్వజునికూతుం డ్రగుమాండవిశ్రుతకీర్తులకొఁ ఱకు భరతశత్రుఘ్నుల నడుగుచున్నాఁడను!

వి:—(శతానందు చేతినిగ్రహించి నవ్వుచు) అంతయు మనచేతనే కావింపఁబడవలసినదేగదా! దశరథు రావింపుఁడు!

జ:—అటులయిన భగవానులగునాంగిరసులు కోసలేశ్వరులఁ గొనినచ్చుటకుఁ బ్రియసుహృదు నంపఁగలరు!

వి:—ఆప్రకారమే కానిండు!

శ:—(లేచి) భగవానుఁడా! ఇంకఁజెప్పవలసిన దేమియుండును?

వి:—అన్నియు నీకుఁ దెలియనే తెలియునులే పద!(శతానందుఁడు వెళ్లును.)

వి:—(సంతోషముగుపడఁ దనలో)

మ॥ శివువింటి న్విదళించి విక్రమము వాసిఁ బొల్చి పూర్ణప్రతి
జ్ఞ విదేహాధిపుఁ జేసె రాఘవుఁడు, నాకుఁ జూడనే నింక రా
ఘవనై దేహసుహృత్కులాల కగుమాంగళ్యోరువైవాహికో
త్సవముల్, నేఁటికి నాదుదీవెనలు పూజ్యశ్రీలంకోఁ బండెఁగా!॥ 57

జా:—(విన్న బాటురోషమున నెలనవ్వుస) మనుజునకుఁ బేరుఁదెప్పింపఁ గలిగినది విద్వాంసులసంసర్గమే కాని కేవలవయస్సే కాదుసుమా! అదృష్టవశమున సంప్రాప్తయగునీకన్యను బెండ్లియాడఁ గోరి వచ్చిన పులస్త్యకులసంభూతు నదలుకొనుటలో వయోవృద్ధుడయ్యుఁ బిల్ల తనఁపుమందప్రజ్ఞనే వ్యవహరించితివే! (విశ్వామిత్రునితో) ఓ ఋషీ! కౌశికా! ఇప్పటికైన నంతగామించిపోయిన దేమియు లేదు. తాటకావధచే నీవు లంకాపతికొనర్చినయపరాధముం దీర్చుకొననిదియే మిక్కిలి మంచియదను!

జ:—(అసడ్డచేసి) భగవానుఁడా! రమ్ము! స్వయముగ రామభద్రుదరి కేగి వాని వదనచంద్రచంద్రికాప్రవాహమువ దొంగవిల్నైర్వరుల మూలమున నైనసీతావిషయికప్రార్థనముల నింతవఱకు వినుచుండ మఱఁగి దుఃఖిత మగునామానసమును జల్లఁబఱచుకొనియెదను. చండకరు వేడికిరణములచే వాడిపోయినకైరవాకరమునకుఁ జల్లని చందమామవెన్నెలకాక మఱొకమందు కలదా? (లేచి పరిక్రమించుచుండ)

శౌ:—(విచారముననాకసముఁజూచుచు) అయ్యో! తపస్వినివగునో సీతా! పౌలస్త్యునంతవాఁడు ప్రార్థించినను వినక మీానమేషముల నెన్నుచు నిన్ను హింసింపఁజూచుచున్నారుకదా!

ఆ॥ వె॥ భూమి వ్రక్కలించి పుట్టితి వేచూడు
మస్వతంత్రవైతి! వఖిలభువన
విజయలక్ష్మికెలన వెలయ సపత్నిగా
సలుపుస్వజన మెవరుఁ గలుగరైరి!॥ 58

(రోషముతో జనకునింగూర్చి)

ఉ॥ ఏరిపరాక్రమంబు వచియించుఁ బురాణములెల్ల నట్టియిం
ద్రారి భుజధ్వజాశనిభయాన మదం బఱు దేవహస్తిపై
జేరులుగాఁగ నెప్పుడు వసించుమధువ్రతపాళి చింద నా
వారణ మన్నియేనుఁగులపాటిదె యయ్యోఁగదా గతోన్నతిక్ ॥ 59

అట్టిరావణభుజాస్తంభము లుంటుండఁగనే, ఓజనకరాజా!

క॥ అంధవృథాసజ్జనసం
బంధపరత సంభవించె వంచన నీ, కే
రంథిని నీవెసఁగిన దశ
కంధరహస్తగత సీత కాఁగలదుసుమీా!॥ 60

(సాక్షేపముగఁదెరవంకఁజూచి)

శా॥ చేరంబాఱుచుఁ జుట్టు నచ్చరలె చేఁజే వీవఁ దద్వాయుభం
గారూఢి న్నిజబాహుదివ్యపరుఘవ్యాపారసౌగంధ్యము

ల్మీలం బొల్చుదశాస్యుఁడే స్వయము కామించె న్నుమీ ! జానకీ !
ఓరీ ! రాముఁడ : పెండ్లియాడఁగలవేమో ! మాను మీపూనిక౯ ॥

(వితర్కించుకొని తనలో) ఓహో ! ఈవిషయము మిగులగొప్పదిగ పరిణమించినది. కావున మంత్రియగుమాల్యవంతునితోఁగూడ సంప్రతించుకొని వారినింగూడఁ బురస్కరించుకొని లంకేశ్వరునకు విన్నవించుకొనవలసియున్నది. (నిష్క్రమము)

ఇది మూఁడవయంకము.



# శ్రీ మదనరరాఘవము



## నాల్గవయంకము.

### మిశ్రవిష్కంభము

రంగము - లంకాపురి, మాల్యవద్భవనము.

మాల్యవంతుఁడు — (ప్రవేశించి ఆవులింతతోఁ గన్నులఁదుడుచుకొనుచు) అరే! రాత్రి యప్పుడే తెల్లవాఱినట్లే యున్నదే!

చ॥ రవివెలుఁగించుకించుకగ రానదె వెన్నెల మాయసాగెఁ, గో
కవితతి కాఁపురాల నెడకం దఱి దిక్కులు తెల్వి నొందెడిన్;
దవిలినభీతి యిప్పటికిఁ దగ్గమిఁ గాకులు గూటికొమ్మపై
చివరలనుండి "కా"వనియుఁ జేడ్పడు వీనిడి మాఱుకూయికిన్॥ 1

మఱియు,

చ॥ వలపున దిక్పతిప్రియుఁడు వాసకసజ్జిక యైనప్రాక్సతిన్
గలిసెడివేళ యంచు నినకాంతముల న్సెగలూఱఁ జేయువె
ల్గులు, నిశ భోగనిద్ర లిడు లోకనిరంకుశసౌఖ్యము న్క్రమా
కలనగఁ గోకులన్ గుముదకాంతలఁ దాఁచెడిబో నిధానతన్॥ 2

(అన్నివైపులం జూచి, సంతోషముతో) ఔరా! దశవదను భుజార్గళముల నిరంతరపరిపాలనమునఁగదా పౌరుల యీనిర్భరామోదసంభృతసంభోగపారవశ్యము!

చ॥ రవి తనవెల్గుక్రొన్ననల రాత్రితమంబును దూర్పునుండి మా
న్పువరుస వెల్లడించెడి మనోభవకేళివిలాసగేహము
ల్నవరతి కందుఁ జేరఁజనునారులు నాథుల ఱొమ్ముటిమ్ముల
న్దవులు స్వపత్రిభంగరచన ల్తమకొంగుల దీర్తు రల్లదే!॥ 3.

మఱియు,

చ॥ మృదునలినీవను తెలుచుమేలివిదూషకుఁ డైనభానుఁ డి
ట్లుదితుఁడు గాఁగ నాయకుల యుబ్బులఱొమ్ములఁ దారుమారుగాఁ

బొదలు నిజాంగనక్రకదళము ల్కానుచుండెడి యుత్పలాక్షు లా
ముదితలచన్నులందు దళము ల్గానెడి న్పులక ల్పొరింబొరిన్॥ 4

ఇదిగో! ఈవైపున-

క॥ ప్రియునిల్లు వదలి తమచెయి
చెయికలుపున నిండ్ల కరుగుచెలిగమి కడునొ
త్తయి పులకలు గంట్లుండని
మెయిఁ గ్రిమ్మ రహస్యకథల మేలమెగపుఁగా॥ 5

మఱియీదిక్కునో! -

ఉ॥ కాఁదగుఁ గొ్రత్తశోభనపుఁగాంత, "రహఃకథఁ జెత్రిమేమిటే?"
నాఁ దననెచ్చెలుల్, తెరిపెనంగఁగ నుత్తరమీక వాల్చు మో,
మాదటఁ బత్రభంగముల నాచెలు లద్దుచు గోటిగంట్లపై
నూఁద జమత్కృతి న్దెలిపె నొందునిశాసుఖపారవశ్యముల్॥ 6

(ఇంచుక యోచించి) సీతావరణమునకై పంపఁబడినపురోహి
తునివలన నక్కాకుత్సకుమారుని మానవాతిశయమగునట్టిమాహా
త్మ్యమును వినినప్పటినుండియు నామనస్సు క్షోభిల్లుచున్నయది.

ఉ॥ ఏలజనించు వింతలిదు నింతటితేజు మనుష్యులందు? రాఁ
బోలు నెదో ప్రయోజనపుఁబూనికతో, నిజమెన్న సమ్మెయిన్
గ్రాలుగదా చరిత్ర లిట; రావణుపా లిట నెన్ను నాడునే
త్రాలిటు విప్పియుండెఁగనె రాత్రియు వేఁగఁదొడంగె నిన్నిరో!" 7

మఱియు

చ॥ వినఁ గటువైన యీామిథిలవింతెఁ గుముల్కనుమానసంబు నే
ర్పునఁ బయిమందహాసము గుబుల్కప్పనదైనఁజూండ్కఁ గప్పియున్
నను నిపు డాదుకోవినఁడు నాబుడుతండు దశాస్యుఁ డో'ర! నం
దనసుమబద్ధదేవవని తాకబరీరసహాస్తుఁడేనియున్॥ 8

(విమర్శించి మిన్నుఁ జూచుచు) అయ్యో! మాయాచింతనవిత్వ మెంత
దారుణ మగుచున్నది!

చ॥ ఇతరులనుండియే యభయ మిమ్మని కోరితి పెత్రితుఁడైన గి
ష్పతిని "మనుష్యులెంత" యనుపంబినగర్వముపేర్మి నాఁడు! నేఁ

డతితరహాచు మర్మములనంటెడి నాపొరపాటు, శాంతిక
ల్గుత! మదిగాక నీకు వఱలున్గద, వత్స! దశంబు శీర్షముక్!॥ 9

(విమర్శించి) అహో! మిథిలాపతి యెంతయుచితజ్ఞతాశూన్యుఁడు!

ఉ॥ కౌశికుఁడుగ్ర మామనువుఁ గాదనెనే నననిమ్ము, పూర్వహా
నీశపుల స్త్యవంశమనియే న్మదినెన్నఁడె! వారుపేరు నే
లా? శతమన్యుదొట్టి సకలావనిపాలకిరీటరత్నపా
ళీశుభజుష్టపాదుఁడె' భళీ! తగునల్లుఁడు కాకపోయెనే?॥ 10

(ముందుఁజూచి) మిథిలావృత్తాంతముకొఱకుఁ బంపఁబడినశూర్పణఖ యింకను రా కాలసించు టేటికో?

శూ: (ప్రవేశించి) అహో! మనోహరంగా సీతావివాహంకొఱకై చేయబడినసింగారాలతో జిగజిగనిమెఱయుచున్న రఘుకులకుమారుల ముఖరాజీవాల చూస్తూంటే, అసహ్యమైనప్పటికీ నేనప్పుడున్న మనుష్యాకారం నన్నుఁ గృతార్థురాల్నే చేసింది. విరోధులందే ఐనా ఆగుణాలు నట్టిప్రకృతి యెంతో బాగుందనిపించిందే!

మా:- (చూచి, ఆదరముతో) ఏమి? అమ్మాయి శూర్పణఖేనా! ఇందున్నాఁడ నిటురా' అమ్మ!

శూ:— ఇదుగో! ఈ ప్రాకారశిఖరా నున్నగృహోపరిభాగాన్నే ఉన్నాఁడే నాపిన్నమాతామహుఁడు! అహో! దుర్ఘర కార్యము లెంత దురనుసంధేయములో! కాకున్న, నిద్రమత్తుకనులతోఁ బ్రతిక్షణ మావలించుటతో నాస్యరంగాన పెంపెఱలాడు మనసులోని కఠినకార్యాల్లో నెవరో మఱొకఁడుగాఁ గనిపిస్తున్నాఁడే! సామాన్యులొద్ద మంత్రిగనుండడమే గొప్పసంగతనవచ్చునే. అట్టాంటప్పుడు మితిమీఱినసాహసకార్యాల కుతుకుచుండే ప్రచండచరిత్రుఁడైన మారాజురావణుదగ్గఱమాట చెప్పాల్సిందేముంది? నాకోసరంగానే కనుపెట్టుకున్నాఁ డనుకుంటా! ఇఁక దగ్గఱకువెళ్తా! ఆర్య! నమస్కరిస్తున్నా!

మా:-పిల్లా! నీకుశుభమగుగాక! ఇక్కడఁ గూర్చుండుము. భరతశత్రుఘ్నులతో దశరథుఁగు జనకునిం జేరినాఁడా?

మ॥ ఇది దోస్స్తంభయుగంపుసత్త్వ కమఠంబే యంచు భీతిల్లుటో!
ఇది సీత న్వరియించుసూచనమ యటంచే యంచు సిగ్గిల్లుటో!
హృదిలోఁ బొందమి తెల్లమం చలరి మానీంద్రాళి యీ నానతిన్
బొదివెన్ గైకొనె నెక్కువెట్టె విరిచెన్వో! సాంబువింటిన్ ద్రుటిన్॥

శూ:—(నిశ్వసించి) తాతగారు నిరూపించినట్లే వుంది. అబ్బా! కాల మహాత్మ్య మేమనాలె? ఈవిధంగాఁ ద్రిభువనలక్ష్మిని బందిగా నొనర్చికొనినమహారాజగు రావణునియెడనా మీ రిట్లువిచారించడం?

మా:—మఱి మనుమరాలా!

ఉ॥ తా మునియయ్యె దివ్యవివిధప్రదరాస్త్రగురుండుగాఁడె? ఆ
సోమధనుర్విభంగమున నుత్సవ మయ్యెఁగదా సురాళి! కీ
రాముగుణావళు ల్వెలిచె రాణఁ ద్రిలోకములన్! బ్రభుత్వపున్
దీమసమూనఁగా మనకుఁ దేలుఫలం బొకదుర్జనత్వమే!॥ 14

శూ:—దానికి సందేహమా? ఆవివాహమహోత్సవాల్లో సంతా నాకు ప్రత్యక్షమే ఐంది.

మా:—ఇంకనేమి? ఒక్కనికిఁ జాలమంది విసురురాలచే మృతికాదా? మిథిలానగరమును బ్రవేశించి బలాత్కారముగా భార్యనపహరించుచుండ నారాజపుత్త్రు డెట్లోర్చియుండఁగలఁడు? ఎగయు నాతనితోఁ బ్రజలు, జానపదులు, మంత్రిప్రభృతులు నందఱుం దోనెగయకుందురా? ఇంక దేహసంబంధులమాట చెప్పవలయునా! అనినట్టు లరణ్యాగ్నివలె కోపముతోఁ బుట్టిన భరింపరానిదుఃఖము పురుషునిలో నొకవిశిష్టమగు తేజోద్రేకమును కలిగించుంగదా! మండలమంతయు నట్టివారినే యనుగ్రహించునుసుమా!

శూ:—తాతా! అయితే యిప్పుడు చేయదగ్గదేమిటో?

మా:—బిడ్డా! కార్యసంబంధము నెఱింగినదానవు వినుము చెప్పెదను. వానరులమంత్రి జాంబవంతుఁడనువాఁ డొకఁడుకలఁడు. ఆతఁడు మతంగాశ్రమవాసులతోఁ గలిసి యచ్చటఁ బరివ్రాజికయు సిద్ధురాలు నగుశబరి యనువనచరమనుష్యజాతిసంభవురాలి నాశ్రయించినాఁడు. ఆవాలిచే నిరసింపఁబడినక్షీణులు లుబ్ధులు పట్టణమునుండి వెడలఁగొట్టఁబడినవారు నగుప్రాకృతజనములు కిష్కింధకు

మ॥ అలుకన్ ద్రుంచిన కార్తవీర్యభుజసాహస్రాగ్రధారాళి జి
హ్వాలుగా క్షత్రియజాతి నెల్లఁ బొరినాహరించెఁ బూర్ణాహుతిన్,
గోలంగ న్బాలకినక్షత్రపభూపతుల నెంతేయుఁ గటన్ నాదుగో
ష్ఠలి యిట్లీగాసగోసమై నెసకఁ జెండెన్ జండవహ్నిక్రియన్॥ 22

రా:- (ధైర్యసంభ్రమములతోఁ బ్రవేశించి)

ఉ॥ స్కందునితోస శంకరముఖంబున సామము నస్త్రవేదమున్
బొందుగ నభ్యసించి మునిపుంగవులందును శౌరవర్యులం
దుం దగుమానికం బనఁగ నొడ్డయశంబు గడించు తేజమున్
బొందిన పూజ్యభార్గవులఁ బున్నముకల్మిని గాంచఁగంటిగా!॥ 23

జా:- (ఖేదమునభినయించుచుఁ దనలోఁ దనను గూర్చి)

ఉ॥ బింకపుస్పర్ధచే గరిక్షత్రియుల గోపమధాంధవృత్తి "భ
స్మాంకుర!" యంచు నే నలఘుడానను దిట్టినఁ గూడ మందహా
సాంకురము ల్లసింప నను నారసి రే శివమూర్తు! లిస్సిరో!
యింకనిగుందతో వినెద నే నిపు డాశివచాపభంగమున్!॥ 24

(విమర్శతో) నే నేయడవియందో యుండుటను కెలింగియుంటచే నిద్దు
రాత్ముఁడగు రఘుకులసంజాతుని యాపూట్లు చెలరేఁగినవి. (బిగ్గ
రగా) ఓసీ! కాకుత్స్థులారా!

మ॥ అపచారుల్ పితృహంత లౌదోరలపై నాకోపము న్దీర్చి సా
యపడెన్, ద్రుంచఁ ద్రిసప్తవారములుగా జ్యాపాలకాంకూరముల్!
న్నృపనారీజనగర్భము ల్చిదిపి చెందె న్మాంసరక్తాదిగం
ధపరామర్శము మత్కుఠారము, వినంగా లేదె తత్సారమున్?॥ 25

రా:- (చూచి సంతోషబహుమానములతో) ఔరా! ఏమి యీభార్గవ
రాములు!

మ॥ గెలిచె న్నాడశకంఠు సర్వభువనక్రీడాజయశ్రీకిగా
దలిచె న్నృపుఁ డొక్కఁ వేయికరము ల్నిశ్శ్రేణిగా, నట్టిదో
ర్బలు జంపె న్నృతవీర్యనేకలన స్పర్ధన్ రేఁగుసేనాని, పో
రుల వెన్నిచ్చిన, వైరి మోముఁ గనుధీరుం డీతఁడే ధన్యుఁడో!॥ 26

సీ॥ బాల్యమైనను సులభత న్నరఁగుతమిని
శిష్టు లెన్నవి ల్లోకిం తెక్కు_పెట్టఁబడియె
సంతోటఁ దంత విఱిగినదయ్యో! విల్లు
మఱిఁ దగులదయ్యో నప్పుడు నీమాటె సుంత॥ 31

జా:— (సకోపముగ) ఔరా! రాచనిసుగా! ప్రమథనాథుప్రథమశిష్యుఁడగుపరశురాముఁడే నీమదిఁ దగులలేదుగా?

ఉ॥ ఏపులమ్మృత్యుదంష్ట్రలగు నేరిశరంబులు వీడఁ దేరి దా
దాపుగ నార్మోగాలనగా తా మఱల న్నరజన్ముఁడయ్యో!, రా
రాపుల సిర్వదోక్క సరి గాఢ్బజకాసనదుర్గదుర్గమ
శ్రీస్వనవి స్తంభించె బలసేముపి. నెవ్వఁడవు? వీఁడె కాఁడొకో!॥ 32

రా:— శాంతిల్లుఁడు! శాంతిల్లుఁడు! భగవాను లనుగ్రహింపఁజూడవలయు! విమర్శలేమిచే గర్వింపనైతిని. గర్వమునమాత్రము కాదు

చ॥ శయముల నీకెఁకన్కు_నవిశాఖుముఖంబులఁ జూచి సిగ్గుపై
చ్చయి యెడఁద స్తపించి నచలాత్మజయే స్వయ మెంచె నాత్మఁ గా
నయితిన నేను రేణుక నటంచును స్త్రీతతులందు నీదుమా
తయె తగు వీరమాత యనుదానికి మిక్కిలిమాట! భార్గవా!॥

జా:— (నవ్వి)

సీ॥ మాటికి కేటికి మానుతి? మాను!, మింక
నగుసులుపురమ్ము గాధేయు నస్త్రవిద్య!
నీవిల నోర్వఁ జేరఁగాఁ బాఱు పరశు
ఘ్రానునా చేయి జాగేమి యోర్వ దిపుడు!॥ 33

రా:— (తనలో) అరరే! భగవానులగు విశ్వామిత్రులపేరుఁగూడ నెత్తెడినే! కానిమ్ము! (ప్రకాశముగ ధైర్యమవునగపున)

చ॥ ఇరువదియొక్క మారులు జయించి పయోధిపరీతభూమి నేఁ
దోఁచితి నంటి!, నిట్టిఘనదోర్బలనీరుడ! వౌర! నీవు!, నేఁ
జెఱుపుతిను, గాస్త్రతాస్త్రుఁడను! చెడ్డది వీరులదీక్ష! క్రోధముఁ
స్నజాని ప్రసన్నమాన స్ననుము! నాకు సుపూజ్యుఁడవౌదు జాతినే॥

జా:— (తనలో క్రోధమున) ఔరా! దురాత్ముఁడయినయీ క్షత్రియపోతము క్షత్రియకుల మహావీరులు నడిచిన మార్గమును

గీ॥ పశుపురోడాశరసికులు పలువు, రూరకఁ
గలరు సహజోద్భటభుజప్రగల్భరఘుసు
లాముకొనుచీరివంశమ్ము నణఁచి పిదప
భృగుపతి యొనర్చు నీవుకోరినయవెల్ల !॥ 43

(తెరలో) ఓరీ! పాపీ! క్షత్త్రియాపుత్త్రకుఁడా! రాజన్య భూరిణహత్యామహాపాతక! నీ వెట్లుచెడినను ఐక్ష్వాకుల ప్రాణములు నీవయిం బ్రసరింపకుండఁ జేసికొంటివి. బ్రహ్మతేజఃపూర్ణుల మగు మాబోంట్లంగూడ నతిక్రమించి పలుకుదువా?

రా:—(రోషముతో హసించుచు) ఓరీ బ్రాహ్మణబంధుఁడా! వ్యభిచారిణీ పుత్త్రకా! గౌతమగోత్రముచెడఁబుట్టినవాఁడా!

చ॥ మనుకులమర్త్యపోతములు మాటలనే శరగాథలెన్న నీ
కనఁ బయిచిన్నబ్రహ్మగణగామిగ నీవు యజింపనీ! ఇనీ!
జనపతులన్ సమిత్కుశలఁ జక్కనగించు కుఠారధారణ
స్థన గుణధర్మకర్త ణాణాసజ మీఁకరి మెంచనేటికిన్ ?॥ 44

(తెరలో) భార్గవ!

చ॥ చదివితి వెల్లవేదములు, జ్ఞాతివి మాగురుమూర్తి బ్రహ్మయం
దుదితుఁడు నొవసిష్ఠున, కహో! విధిపుత్త్రుఁడె నీదుతండ్రి, కా
న దయఁదలంచి నీపయి మనంబు సహింపదు కాక యెంతకేన్
వదలుము. తండ్రి! నీబహువిధక్రతులన్నియు సఫ్లుదేఁచుము!॥ 45

జా:—(బిగ్గరగనవ్వి) దశరథ! ఏమంటివి? ఇప్పుడిన మాటను వినుఁగ దశరథా? ఈగంధ్రపగోత్రలి తలంపుకొ [illegible] [illegible].

(తెరలో) [illegible]! [illegible]! మ తండ్రిగా [illegible]గూడ ధిక్కరింతువా?

ఉ॥ తమ్ముఁడుకాఁ [illegible] నుమఁ [illegible] ను రామఁ [illegible] చుచుఁ! ప్రసి
ద్ధమ్మగు రాఘుక [illegible] !
దమ్ము [illegible], మిగల [illegible] జను [illegible]! 
సమ్ము [illegible] మ్రొగుమున్! 46

జా:—(హిసన్ప్రు [illegible]) [illegible] నీతమ్ముఁడు కాఁడటే?

రా:—(వెఱసంచుకనవిగ్రి) స్వామీ! అనుగ్రహింపుఁడు! అపరాధమన నెద్దియో పోల్చలేనిమధురబాల్యవయస్సున నుంటచే నెద్దియో యనినాఁడు.

జా:—(నవ్వుచు) ఇంతమాత్రముననే నేను కోపగింతు ననుకొందువా? నీతరువాతివాఁడుగదా వాఁడు. (తెరవైపుచూచి) ఓరీ! లక్ష్మణా! మేలుమేలు! చిన్నవాఁడవయినను నీవే శ్రేష్ఠుండ వనిపించుకొంటివి. వీఁడా పేరునకే లే పెద్ద!

మ॥ నలిఁ గ్రౌంచంబనుహస్తి యుబ్బుదల ము న్నస్త్రంపుపెన్గోటఁ బ్ర
ద్దలుగాఁ జీలిచి యంచముత్తెములఁ దత్స్నానమ్మునన్ జిమ్మ సం
ధిలెఁ గంకీరవమట్లవిశస్తి, యయిన స్రీండిల్లించునాపై సవా
ల్గొలుప న్సాహసమూని యైతివి భటాంకూరంబ వేపుణ్యమో!॥ 47

(తెరలో) భార్గవ! భార్గవ! వట్టిసాహసమో! గట్టిసంగరమో! ఇప్పుడేమి తెలిసెనునులే డీకొనినంగాక!

రా:—(రోషముతో) ఆఁ! ఆఁ! వత్సా! ఎన్నఁ డెఱుఁగనియీయుదరి పాటు నీకెక్కడినుండి వచ్చినదోయి! ఈపూజ్యులపైనికే ప్రేరేపించుచున్నదియా!

(తెరలో) అన్నా! ఇఁక నే మాటాడనేమాటాడను! ఓజామదగ్నిగారూ! క్షమింపుఁ డన్నగారియానయైనది!

జా:—(నవ్వి) ఓరీ! రాముఁడా! ఎత్తిపొడుపుల సత్యప్రియములగు మాటలచేతనే నన్ననునయింపం జూచుచున్నాఁడవా? కవచముం దొడిగి యింకనాయస్త్రముల కస్త్రములతోడనే ప్రతిక్రియంజేయఁ జూడుము!

సీ.॥ పుట్టినాఁడవు రవికులభూపులందుఁ
బట్టినాఁడవు కౌశికప్రపంచవింటి
నట్టినీ విల్లు ఖండించు నంటవదల
ముట్టదే నిన్ను జీడిగా గట్టిదూఱు? ॥ 48

రా:—(గర్వాసనవ్వుచు) స్వామీ! మీరనినదినిశ్చయమే.

సీ.॥ నవిపుల శ్రోత్రియక్షత్రరాజిఁ బొడమి
యంటుఁ గనుగొంటి గాధేయునస్త్రవిద్య

యశమొ, దుర్యశమో, వానె యస్త్రలెన్న
విప్రుపై బాణమెత్తనే వెఱతుసుంత !॥ 49

జా:—(క్రోధముతో) ఆఁ! పాపీ! దుర్ముఖుఁడా! వసిష్ఠవిశ్వామిత్రుల వలె స్వస్తివాచనబ్రాహ్మణుం డయ్యెనా నీకీపరశురాముఁడు ? ఛీ! ఎంతకష్టమెంతకష్టము ! ఇట్టియుచ్చావచ వాక్యముల నీరాజులవలన పడవలసివచ్చెనే (మిగులక్రోధమునఁజూచుచు) ఇదిగో వినుఁడోహో!

క॥ కొడుకుల నలువుర దశరథు
గెడపి జనకకులకబంధకీలాలలతల్
కడఁకఁ బఱ్ఱాకలుగా నే
ర్పడ రణభువి రుద్రుచట్టు రౌద్ర మొనర్చున్॥ 50

రా:—(రోషమున) ఆఁ! జామదగ్నీ! నీబెదిరింపుమాటలు మేరమీఱి పలుచుచున్నవే. ఐక్ష్వాకులకైన నొకప్పటికైనఁ గోపము రాక మానదు!

జా:—(బొమముడితో) ఆపైనేమి ?

రా:—(గరువముతో) తెలుపవలెనా ?

చ॥ ఇరువదియొక్కమారు నృపుల నెల్లర గెల్చి భుజధ్వజంబుపై
బఱపితివోరణా. త్తనివిబొఱక యిర్వదిగంటి కెట్టు తొం
దరపడుచుంటి నీధనువుదర్పమదెంతయొ చూతు రమ్ము! శం
కరువిలు నెక్కువెట్టఁజనఁగా విఱిగె న్మదిఁదృప్తికల్గునే॥ 51

జా:—(సంరంభముతో) ఏమంటివిరా ? ఏమంటివి ? "చూతునీధనువు దర్పమెంతో ?" (తలపంకించుచున్నట్లు) అయ్యో! అన్నివైపుల కెగఁబ్రాకఁజూచుచున్న యీనాగరికపాలకున కొకవి దేహాదిలీప వంశము లెంతమాత్రపు టూహలతి ? ఓహోహో! సప్తద్వీపసప్తకుల పర్వతసంవాసిసమ్రాట్టులారా! జాగ్రత్త.

ఉ॥ తల్లినిగూడఁ గోసి వసుధాపతిరక్తసుధారుచు ల్కడుం
గొల్లగ మెచ్చ నేనిరువదిగొష్టలి పిన్నృపయయ్యె ధాత్రి, యే
భల్లముచేతఁ గ్రౌంచమున బిల్వనగాడుమునుండె నేటికిన్
ద్రెళ్లెడి నస్థులంచలుగ! గుఱుసుమీ! యువి నేఁడు క్రమ్మఱన్॥

రా:—(పరిహాసముగ)

మ॥ ఎవరెవ్వ స్వేనిన్నృపాల శేఖరులపై నేలాపరితాపా? ల్పురే!
యువతిలో ప్రమాలన ...లకేళి హాయివిల్లే ద్రుంచినాతండు! దు
ర్మద... కార్తవీర్యుని సహస్రస్థూలహస్తాళిపైఁ
బోదింపన్ ... ఘోర...ముపెంపు స్జూపుమా! నాపయిన్। 53

జా:—ఛీ! పాపీ! సూర్యకులకళంక! మరలమరల హరువిల్లువిఱుచు మాట ముద్దాడుచుదువా? అహో! కార్తవీర్యుని గెల్చిన యీనా భుజాంతము నొక క్షత్రియడింభకుఁడే నెమకుచున్నాఁడే! ఏమి కాలమహత్మ్యము? వినరానివి వినుచున్నట్లు కనరానివి కననట్లు చేయును గదా! ఇదిన నా చెప్పుమీ!

చ॥ తెలియుము నీకు నాజనకుఁడేనుఁ గైకొని హైహయుండు నా
విలు చివిరింగఁ జేసెఁ బృథివీవర కార్తవిద్య, దానినే
విలసిలు మీకు మాకుఁ గడువేరము సాజ, మదట్టులుండఁగ
న్విలిపియిప్పుడు గా గురుధనుస్సును ద్రుంచుట ప్రోదిఁ గూర్చెగా!॥

రా:—జామదగ్న్యుఁడా! ఎప్పటిదియో యగునీకీర్తిపతాక మిప్పుడు జీర్ణించినది. దానిబిగు విప్పుడుచూడవలసియున్నది. (తెరవైపుఁ జూచి) లక్ష్మణా! విల్లు!

జా:—ఓరీ! నీతరమెంతయో యెఱుంగని క్షత్రియబ్రహ్మచారీ!

గీ॥ శంకరుఁడు బిట్టువాడుట నారమెడలి
తొలుసిగవిల్లు నిమిత్తమాత్రుఁడవు నీవు!
వైష్ణవం బిది రాజన్యబహుళయుద్ధ
సాధనం, బేది! యెక్కిడు! చాలుదేని!॥ 55

ఎక్కిడి యీధనుస్సుతోడనే మమ్మెదుర్పుము! రాజవధసత్రయాగమున జిరకాలము హోతగా నుపచరించిన యీగంద్రగొడ్డలి మాకుఁ గలదులెమ్ము! (రాముని చేతులలో ధనుస్సు నుంచును.)

రా:—(అందుకొని) భార్గవా! ఈస్థలము నిమ్నోన్నతమైయున్నది. యుద్ధయోగ్యమైనసమతలి కేగుదము రమ్ము!

జా:—(రోషముతో వికటముగ బరిక్రమించి) క్షత్రతేజస్సులమని బ్రహ్మతేజస్సులమని స్వోత్కర్షలం బల్కుకొనినవారలారా!

రా:—భగవానులగు యాజ్ఞవల్క్యనిగ్రహమున నతిథిమర్యాద కను
వులగు ద్రవ్యములన్నిటితో మానాయనగారును జనకమహారాజుగా
రును మీకొఱకై వేచియుందురు.

గీ॥ ఆసనముతోడ నర్ఘ్యపాద్యములతోడ
మహితమధుపర్క మచట నమర్చుకొనుచు
వేచియున్నారు తమరటు వేగవచ్చి
సలుపుఁడు పవిత్రుల విదేహసవితృకులుల॥ 60

జా:—వత్సా! శ్రోత్రియ క్షత్త్రియుల యాతిథ్యము త్రోయఁదగినది కాకు
న్నను వైఖానసయోగ్య మగునాచారమునుండి తొలఁగితినే యనుభీ
తిచేతను ధర్మాచార్యులయిన యాజ్ఞవల్క్యుల సమీపించి దర్శింపఁ
జాలకున్నాఁడను. మరియాద దవ్వునుండియే యొసంగఁబడినను
తీరినట్లు. (తెరకై బిగ్గరగా)

గీ॥ ఎవనిస్మృతికయి యెప్పుడు నెదురుచూతు
రల చతుర్వర్గచరమనీషు లగువార!
లట్టి యోగికి యాజ్ఞవల్క్యపరమాత్మ
కాచరింతు నమస్కార మధికభక్తి॥ 61

(తెరలో)

గీ॥ త్రిపదగాయత్రియను పరాదేవి నీదు
పాపసంచయముల నెల్లఁబాపుఁ గాత!
నిన్ను గావమాన్యములు పునీతుఁజేయుఁ
గాత! శమవృద్ధి బ్రహ్మ మీఁగాంచుఁగాత!॥ 62

జా:—స్వామీ! సిగ్గలముకొనుటచే భగవాను లగుమిమ్ము దర్శింపలే
కున్నాఁడను. నావనగమనమునకు సెలవిందు!

(తెరలో)

ఉ॥ నీచనుదార్ద్రమేలగుత నీయిలునుండియె చేరు నీయిలుం
వాచక మన్యము న్నె? తలపైవిరిదండవు, కూర్తుముజ్జగా
ల్లోఁచి చెలంగ బ్రింగఁ గుశలుం డగునామధువైరినుండి యీ
కాచును భార్గవాన్వయమునం దిటు లాడెదు చిద్విలాసివై॥ 63

జా:—తండ్రీ! రామభద్రా!

రా:—ఏమి సెలవు?

జా:—ఇఁక నిలువుము! ఇప్పుడు కళ్యాణమంటపమున సుంగళోపచార ములు సిద్ధములొనర్చుకొని నీకొఱకు నీమామలు వేచియుందురు.

(నిష్క్రమింతురు)

రా:—(ఉద్వేగముతో) ఎట్లు? స్వామి వెళ్ళనేవెళ్ళిరే. నేనుఁగూడ నింక నాయనగారికడ కేగెదను. (పరిక్రమించి ముందుఁజూచి) ఇదిగో! నాయనగారు జనకులు నిటే వచ్చుచున్నారు. (ఎదురేగును) (జనక దశరథులు ప్రవేశించి ప్రత్యేకముగ రాముఁ గౌఁగిలింతురు)

జ:—

మ॥ ఇతిహాసంబుల వ్రాయువారి విడిపోనేపోదుసూ! నేఁడు నీ
సుతుఁ డీబాలుఁడు హేలగా నడుపు మెచ్చున్నచ్చరిత్రంబు; చూ
చితివో లేదొకో! భార్గవోత్తముని వాసింగన్న గొప్పింటనుం
డి తనంత జ్జయశీలమైనప్రభ చెందెన్ రాము నాకృష్టమై॥ 64

ద:—(ముందుఁజూచి) రామభద్రుఁ డప్పుడే రానేవచ్చినాఁడే

జ:—మిత్రమా! దశరథా! చూడుము!

మ॥ నిలిపెన్ క్షాత్రముఁ జాలకాలమునకేనిన్ ముజ్జగా ద్దైలఁగాఁ
గొలిపెన్ వంశభృతాళి నగ్రగణిగ నమ్కన్, నాల్గునిర్ణంబులన్
వెలయింపన్ బ్రిభువయ్యె భార్గవభుజాంభీలత్వమున్ రాచి, యు
జ్జ్వలవీరుం డమృతంబుఁగన్నులను నింప న్వచ్చె, సుశ్లోకుఁడై॥ 65

ద:—(ప్రేమతోఁజూచి) చెలికాఁడా! నీరస్వామా! ఈబాలుఁడతేఁడు పసివాఁ డయ్యు రఘురాజులధర్మపరిపాలనమునం దధికభారము స్వహించి నిర్వహింపఁగలదక్షుఁడుసుమా! కావుననే బద్ధశాసనముచే నేను మోయలేని యీశత్రాశమపాలనాభారము నాశనపైనునిచి యే యడవియందో దిలీపకులముఁనకుఁ జనినవిధికో మిగిలియున్న యాయు వును వెళ్ళఁగీయుదును!

జ:—నేస్తుఁడా! దశరథా! నీహృదయము మెప్పఁదగు మంచిమార్గమును గలిగినదియే. ఇది క్రమముగ నొనర్పంబడు.

రా:—(సమీపించి నమస్కరింతును.)

జ:—బాలకా! రమ్మురమ్ము! (బిగ్గఁగౌఁగిలించుకొనును.)

దః—(ఆనందముతోఁ గౌఁగిలించుకొని) రాము నభిషేకింప జామదగ్న్య విజయకాలమే యిక్కిలి యోగ్యము. కాలహరణమేల ?

లక్ష్మణుఁడు:—(ప్రవేశించి) ఇదే ఆర్యులకు మంధర తెచ్చిన కైకేయీ మాత యుత్తరము !

జ॥ ఏ:-(ఒకరి నొకరు చూచుకొందురు.)

రా:- (సంతోషముతో) తమ్ముఁడా ! లక్ష్మణా ! అమ్మగారికి సపరివారముగా కుశలమని మంధర చెప్పినదా ?

ల:—అటులే చెప్పినది.

రా:—మనప్రవాస మమ్మగారి నెంత యుమ్మలింపఁ జేసినదో !

జ:—(ఉత్తరము నందుకొని చదువును) స్వస్తి మహారాజు లగుదశరథులకు కైకేయి విజ్ఞాపనము.

గీ॥ అడిగెదను మున్ను నాకు మీ రిడినరెండు
వరము లిప్పుడు మీరాజ్యవైభవంబు
భరతుఁ డేలుత, ననుజుతో భార్యతోడ
నేగ రాముఁడు పదునాలుఁగేండ్లు వనికి॥ 66

జ॥ ద:—(ఇరువురు మూర్ఛిల్లుదురు)

రా:—(ఉత్తరమును దలధరించి) తమ్ముఁడా ! లక్ష్మణా ! అయోనిజయు నన్ను సేవించుటలో నీకుఁదోడగుసీవదినె నీదిసుకుని ముందుపద !

(లక్ష్మణుఁడు నిష్క్రమించును.)

రా:—నాయనలారా ! ఊఁడడిల్లుఁ డూఁడడిల్లుఁడు. (పైకొంగుతో విసరును.)

జ:—(తేఱి, నింగిఁజూచుచు)

గీ॥ చెట్టబట్టెనదే రఘుక్షితితలేశుఁ !
దరణి ప్రాచీన దేవుఁడే తనకుమామ !
స్వయము జనకుండె కేకయచక్రవర్తి !
ఇట్టికర్మమ తన ? కయ్యొ ! ఏమిచెప్ప ?॥ 67

రా:—(విసరుచుండును.)

ద:—(తేఱి నిట్టూర్చి)

గీ॥ మంటమండుచు ముంచెడి మైకమందుఁ
జెప్పనూహింప, నిదియని విప్పరాదు
అనుభవించుట నావంతు ! అయ్యొ ! రామ !
ఇట్టి నను వీడ నెటు లుత్సహించితయ్య॥ 68

(విమర్శించి) బిడ్డా ! జానకీ ! నిశాచరుల కతిథివగుట కేనా యీ దశరథునిల్లు నీవు ప్రవేశించినది. (మూర్ఛిల్లును.)

రా:—తండ్రులారా ! ఊఱడిల్లుఁ డూఱడిల్లుఁడు.

జ:—(తేఱి మిన్నుఁజూచుచు) మంచిది ! మిత్రమా ! కైకేయీ ! విశ్వంభరాపుత్రిక యగునాకూనకుఁ బతియను గమనమునైనఁ బ్రసాదించితివి

మ॥ విలుకాండ్రేడ్వుర బసివాండ్రు పంక్తిముఖదుర్వీర్యంబు సింహంబ్రో
వలు, మాసీతయొ లేఁతకూన, బహుళాపత్పూర్ణము ల్కానలు,
నీభర్తయొ యీయకీర్తిఁ దుడువ న్ప్రాణంబుల న్వీడఁడే ?
చెలియా ! కేకయునింటఁ బుట్టియు ననౌచిత్యంబు నెట్లోర్చితో !॥

కష్ట మతికష్టము. కైకేయిమూలమున కలిగినయీదుర్యశము పెచ్చు పెఱుఁగుచు రాఁగల భరతయావరాజ్యలక్ష్మీకర్ణమ్ములకు దమాలపల్లవంబై చెలంగుచుండ నేనుమాత్ర మీజనపదంబుల నెట్లు తలయెత్తుకొని తిరుగుచు లోకులముఖంబుల చూడఁగలను ?

రా:—(లేచి) మామగారూ ! మాతండ్రిగారిక్షేమము నాకుఁ దెలియుచుండునట్లు లొనర్పుఁడు ! (నిష్క్రమించును)

ద:—(తేఱి లేచి) బిడ్డఁడా ! రామభద్రా ! నన్ను రక్షింపుమయ్యా !
(జనకుఁడుపట్టుకొన నిష్క్రమించును.)

ఇ తి నా ల్గ వ యం క ము



# శ్రీ మదనర్ఘరాఘవము



## అయిదవయంకము.

రంగము (కిష్కింధావనపరిసరము)

ప్రవేశము — శ్రమణుఁడు, జాంబవంతుఁడు.

జాం:— తరువాతఁ దరువాత ?

శ్ర:— అంతట మిథిలనుండి బయలుదేరి మంథరశరీరమును వదలి మారుతి సంరక్షణమున నున్నా బొందిలోఁ బ్రవేశించి గంగదరి శృంగిబేర పురమునకు వచ్చియుంటిని.

జాం:— అటుపైని ?

శ్ర:— నే నటఁగాలు వెట్టఁగనే "యిరుగో! రామలక్ష్మణులు! నిదిగో! సీత!" అనుచు నెల్లెడ వినవచ్చెను.

జాం:— (సంతోషముతో) ఆఁ! ఆఁ!

శ్ర:— అటుపిమ్మట సీరామలక్ష్మణు లెవరని యోడనడపువాండ్రు దారసన్నడుగగా నిట్లు చెప్పితిని

గీ॥ దశరథునికోర్కి మాసింద్రుదయయుఁ గలియ
నాదిపురుషునికళ నాలుగై జనించె
నందు గుణమయుఁడగు సీతఁ డగ్రజుండ
తండు ధీరోద్ధతుఁడు తృతీయుండుసుమ్ము!॥ 1

జాం:— శ్రమణా! చక్కఁగఁ జెప్పితివి. తరువాత ?

శ్ర:— పిదపఁ గలసివచ్చినబంధుగు లుదకాంతానుసరణమున మఱలి పోవఁ దత్క్షణముతో గుహుఁడు తెచ్చిననావ నెక్కి—

చ॥ గవుతలపూవుదండ సురసింధువు గంగను దమ్ముఁ డాలి తాఁ
ముమ్మురె తరించి, కే వనుజుఁ బోలినమైత్రిగ నావికుఁ గృప
గ్దవిలిచి, బోయెత ల్మ్రుగలత న్బడవ్యామకుచాళి రొప్పుచుఁ
మిపిలడివేడ్క వెన్కన గమించెను జిత్రకగాన కాత్రుటిఁ॥

జాం:—ఔరా! ఎంతకరుణాజనకము!

శ్ర:—స్వామీ! తమకు దుఃఖాకరమగుననియే వారచట గారచెట్టు క్రింద జడలదాల్చినవైనమంతయుఁ దెలుపమానుచుంటిని.

జాం:—శ్రమణా! ఇదియంతయు వారి భావికళ్యాణమునకే కాఁగలదు లెమ్ము! ఆవెనుక నేమి జరిగె?

శ్ర:—నేనుమాత్రము బోయరాజును సంతోషపెట్టుటకై అందే ఆఁగితిని. అంతఁ బెక్కురాత్రులుగడచినతరువాత మంత్రిసామంతపరిజనపరివృతుఁడై దశరథుని రెండవకుమారుఁడు తండ్రిస్వర్గస్థుఁడగుటను జెప్పి రామభద్రు నయోధ్యకుఁ దోడ్కొనివెళ్ళుట కాతోవనే చిత్రకూటమున కేగెను.

జాం:—(సందేహముతో) ఆఁ! తరువాత?

శ్ర:—అంత నోస్వామీ! "ఏవిధిదుర్విపాకముననో కేకయుల కపయశమువచ్చుయోగముండికాఁబోలు తండ్రిగా రిటులమోసపోయిరి. అవిశ్రాంతముగ సాంతముగఁ దలఁచిచూచి తమరు మఱలివచ్చి రాఘవరాజ్యముం గైకొనుఁ"డని భరతుఁ డెంతోప్రార్థించినను, రాముఁ డాతనిమేనునిమిరి "కా"దన జటాకలాపము తానుగూడ ధరించుకొని శరభంగప్రేరణమున రామపాదుకలు లభింపఁ గొనిచని, భద్రాసనమున వాని నునిచి, ప్రజలపురోవృద్ధి నరసికొనుచు నల్లభరతుఁ డానందిగ్రామముననే నిలిచెను.

జాం:—(సంతోషమున) అబ్బ! నాప్రయత్నము నీప్రయాసము గట్టెక్కినవి లెమ్ము! తరువాత?

శ్ర:—మైలవచ్చినప్పు డాయుధములఁబట్టుట తగదని, ఛిద్రములనే వెదకుచుండెడి జనస్థానవాసులగు ఖరదూషణాదులచే క్రూరుఁ డగువిరాధుఁ డటకుఁ బంపఁబడియెను.

జాం:—ఛీ! మూర్ఖులు. ఆఁపరానికార్యము లమరినప్పుడు రాజుల కప్పటికప్పుడే శుద్ధికదా! పిదప నేమియయ్యె?

శ్ర:—విరాధుని జంపుటలో సుంతమఱపింపఁబడిన పితృమరణదుఃఖము పెద్దపెట్టునఁ దన్నలముకొన నెట్టులో యపరక్రియల నిర్వర్తించి, నాలుగుసముద్రములజలంబులుఁ బుక్కిటం ధరించినట్టియు, వింధ్యా

గర్వము నణపించినట్టియు, వాతాపి నంతమునొందించిన, మంగళ కలశసంభవుండగు, ఘటజన్ముండగు నగస్త్యమహర్షి నివసించునరణ్యమునకై రామభద్రాదు లరుగుచుండ ధారాధరుం డనుకాకాసురుండు ప్రహసించి వైదేహి వెంటఁ బడియెను.

జాం:—(తనలో) ఎట్టిదుస్సాహసము? (ప్రకాశముగ) ఆవెనుక నేమి జరిగినది?

శ్రీ:—ఏమి జరిగినదనుకున్నారా? వినుఁడు!

చ॥ దనుజచమూధినాధకనకస్ఫారకభాండమనంగఁ బొల్చు నా
జనకజ మూఁచుకొంచుకొనెఁ జట్టనఁ గాకము చీఱ, వైళమ
య్యనిలజుఁ డీషికను గ్రహించి మహాస్త్రము మంత్రితంబుగా
నానరించి వేసి తన్నయనమొక్కటి గ్రుడ్డిగఁజేసె నీసునన్॥ 3

జాం:—తరువాత?

శ్రీ:—తరువాత, నోస్వామీ!

క॥ క్రమత సుతీక్ష్ణుండు మొదలగు
నమి శేఖరులకును సేవసలిపి యగస్త్యా
నుమతిన్ రఘూద్వహుండు తా
నమరెన్ బంచవటీ వాసమై స్థిమితముగన్॥ 4

జాం:—(సంతోషముతో) అయినయెడల నయినచో మనచేతులలోఁ బడినటులే, ఋశ్యమూకమునకు జనస్థానమునకు నడుమ నెంతోదూరమా?

శ్రీ:—స్వామీ! ఇంతవఱకు వినవలసినముఖ్యాంశ మింకనూ విననేలేదు తమరు!

జాం:—అవహితుండ నేమియది?

శ్రీ:—అచ్చటఁ గాముకియై చుప్పనాతి రసముంగూర్తునని పతిచింతకుం బొల్పడి యప్పావమునకుఁ బ్రాయశ్చిత్తముగ ముక్కుఁజెవులునుం బెదవులను మూఁడాహుతులుగ లక్ష్మణుకోపాగ్నిని వేల్చికొని పునీతయైనది.

జాం:—(సందేహముతో) అయ్యో! పెద్దబెడదయే సంభవించెనే! చెల్లెలి యూభంగపాటు నెఱింగినఖరాసురాదు లేమయిరి?

శ్రీ:—ఏమయిరా? రామభద్రుఁడు విల్లందుకొన నేమగుదురో అదియే!

జాం:—ఆహా! లక్ష్మణునకు సన్న్యాసికి జరుగునీసంవాదమునంతయు వినవలసినదిగ నేనున్నదే (చెవియొగ్గును.)

(సన్న్యాసితో మొగ మెత్తి చెంపనుండి) ఆఁ! లక్ష్మణా! నేను సర్వవిద్రావణుఁడనుసుమీ! అటులగుట నేనెవ్వానినోర్చి గౌరవదూరుం గావింతును?

(సౌమిత్రి నవ్వుచు) నీ వారావణుఁడవా?

(జాంబవంతుఁడు విస్మితుఁడగును.)

(సౌమిత్రితో మొగమెత్తిచెంపి) ఓ! చమత్కారీ! "సర్వ+విద్రావణ" అందులకు వ్యుత్పత్తించువాఁడ ననుసమాసమును "సర్వ+విత్+రావణ" అని వేఱగునర్థమును బల్కినెపమున నెదురగునిన్ను నిగ్రహించితిని. భిక్షకు నన్నుఁబోవనిమ్ము!

(సౌమిత్రి-నవ్వుచు) నీవుఁగాని రావణునిఁగాని నాకేమిపని? మదుద్దిష్టమునకై త్వరగసాగెదను.

జాం:—భగవాన! ఇదియేమిగొడవ? పర్యవసానము తెలియుటలేదే! ఒకవేళ రావణుఁడే సన్న్యాసివేషమునవచ్చి రోషమునం బేరుఁదెల్పుకొని పిదప మఱుఁగుఁబడిచి చనియెనా? (చుట్టునుంజూచి) ఇదిగో! నాచిరకాలప్రియమిత్రుఁడు జటాయువే యనుకొందు నీదక్షిణదిశనుండి వచ్చువాఁడు? ఆతనిరాక వేచి యుండెదను, గ్రద్దలు కడుదూరముచూడఁగలవుకదా! ఇతనికి తెలిసిన తెలిసియుండవచ్చు నాలంకావృత్తాంతములు.

జటాయువు:—(ప్రవేశించి) ఇదిగో! పంచవటి! అన్నట్లు గోదావరి యలలతుంపురులచే నలవడిన సుకుమారతాసౌరభ్యములతో దీపించు నడవుల పరిసరములుగలజనస్థానభూము లవే!

ఉ॥ తేనెమఱానఁ గోయిలలు తేపకు మావిననల్కఁదల్పఁ దో
డ్తో నలి రాలు ప్రస్ఫోటములదువ్వలు, లుబ్ధకభీతి నెట్టిచం
దానఁ దొలంగు లేళ్ళకుఁ బదక్షతము ల్వాడిఁగప్పి క్షేమసం
ధానమొనర్చు, ముచ్చటలఁ దన్పు ధునీతటభూము! లద్దిరా!॥ 6

జాం:—(కొంచెముసమీపించి) ఇంతవడిగా నెటనుండి మిత్రమా?

జటా:—(చూచి) ఏమీ! జాంబవంతుఁడే! మిత్రమా! నమస్కారము! ఇప్పుడు నిన్నలరింప నిలువఁజాల. మలయాద్రిపైని గూటినుండి మా యన్న సంపాతి కెరఁగివచ్చుచు, మారీచుఁడు లేఁడుగా నీ యరణ్యముల సంచరించుచున్న రాక్షసరాజుం గంటిని. దీనివలన నెద్దియేని కీడు కలుగునేమో యని రామభద్రునందలి నాస్నేహము నన్నుఁ త్వర పెట్టుచున్నది.

జాం:—(తనలో- నేనెఱుంగఁగోరినదిదియే!) (ప్రకాశముగ) మిత్రమా! త్వరగఁజనుము! (నిష్క్రమించును.)

జటా:—(పరిక్రమించి) అగుపడునదియే పంచవటి! (వితర్కించి)

ఉ॥ బంగరులేడిమాయఁబడి పర్వెను దవ్వుగ రామభద్రుఁ డ
న్నంగన వేగమేగె జతనంబున వెంబడిఁ జిన్నవాఁడు; భీ
తింగొని మెల్లగా నుటజదేశముఁ దూఱెను భిక్షుకుండు; లో
నం గొనె స్వస్వరూపముఁ; గనన్ దశకంఠుఁడె వాఁ! డిసీ! యిసీ!॥ 7

అయ్యయ్యో!

క॥ హా! నాథా! నాథా! యని
జానకి యదె కురరివలె వెసన్ గ్రోయుచుఁగన్
మానక రథమం దిడుకొనె!
ఛీ నీచుం! డెందుఁబోవు నే నిందుండన్?॥ 8

(ఆటోపముతో) (పరిక్రమించి) ఓరీ! ఓరీ! రావణా! నిలు! నిలు!

శా॥ ఓరోరీ! దశకంఠ! అంటువడ నీయుక్కీసుతన్ రామభా
ర్యారత్నంబును దాఁకి తేజము నెదన్ గ్రాపించుకొన్నాఁడవే!
ఛీ! రోయన్వలదే భవత్కులము వాసిన్, ద్విగ్గజోత్తంసదు
ర్వారస్థైర్యుల నాపులస్త్యముఖసబ్రహ్మర్షులన్ నీచుఁడా?॥ 9

ఓరీ! రాక్షసాధమా! నట్టియట్టహాసము లనుపొగలతో నీపది మోము లనుపుట్టలు ధూసరితములుగ నేమించుచున్నాఁడవు?

క॥ సకలజగద్బహుసమ్మో
హాళి మగుసీతాఖ్యం [illegible]

మకిరాలనుండి తాఁద

న్నుకొనెదల చె ముసలిగ్రద్ద ! నొత్తునా యేమో !॥ 10

ఆనియా ? ఆఁపాపీ ! ఇదియా నీయిచ్చుప్రతివచనము ! నిలు! నిలు !

క॥ కనులం గానవు భుజబలగర్వమెనసి !
దొంగ! యనిపిల్వఁ బాఱిపోవంగఁజూతు !
పిట్టిలనఖపాళి నెంతయుఁ గ్రూరకర్ముఁ
డీజటాయువు ! నీహృది నెట్లుఁజీల్చు !॥ 11

(నిష్క్రమము)

ఇది శుద్ధవిష్కంభము

లక్ష్మణుఁడు:-(ప్రవేశించి) అయ్యో ! దశ యెట్లుమాఱవది ! అడంపరాని కఠోరమైన క్రోధమునకు శోకమునకు లజ్జకు నాస్పదమై గహనము విషమము నైనదిగదా ! ఇదిచేసిన బాగన పిలిడుటలేదే !

ఉ॥ అంతటిపింఛకకంఠుఁడే దురాత్మత వంచనఁజేయఁ గ్రోధధూ
మాంతరితంబు నాపదము లక్కఱము ల్సగమాడునన్న ! యా
యింతిజటాయు నీల్గెనన నేర్పడునంత రుషాగ్నిహోత్రిభా
స్వాంతము నైననానిష్కళి డుఁ చాపముపైనిఁ గడున్ స్థిరంబుగన్॥

రా:-(ప్రవేశించి మిన్నుఁజూచుచు కన్నీటితో)

మ॥ కులమా! శౌర్యమ! బాహుసంపదయ! నిర్గున్నిష్ఠయా! మున్ను రాఁ
గలకాలంబుల నీవలెన్ యశముకల్గన్ గాంచరెవ్వారు ! నే
బలవద్యత్నము నెంతకాలముగ సల్పన్ జాలి వీరాధ్వసం
చలనన్ గూలితి చేతిమీఁదుగ ! దశాస్యా ! ఛీ ! భ్రమాధీనతల్॥

(విమర్శించి, ఖేదస్మితమున) అహో ! పౌలస్త్యుఁడా !

మ॥ తొరహో నా చెవినా చెవి న్వినినసిద్ధు ల్నీదుదుర్వృత్తముల్
వెఱతోఁ దెల్పఁ బులస్త్యుఁ డొక్కఁడువినా, విన్నట్టి దేవర్షి భా
స్వమతెల్ల న్నగ నీదు తాతపిత విశ్వగ్వృత్తిచే నల్వ యే
శేఁగ్గ యీతలవంపుల న్గుడుచునో దీపించులజ్జాభృతిన్॥ 14

(క్రొంచెముధ్యానించి) హా ! ప్రియా ! విదేహరాజపుత్రీ !

(దుఃఖము నాపుకొనుటఁ జూపును)

ల:-(సమీపించి) అన్నగారూ! ఈశోకము మీయంతవారింగూడ
నాక్రమించెడినే!

గీ॥ గుండె వ్రీలంగఁ జేసెడిక్రూరగతిని
దైవవశమున వ్యసనము ల్గారసిల్లఁ
గనె మహాత్ములమనములు కడఁకఁగొనవె
ధైర్య మనువజ్రకంచుకధారణంబు!॥ 15.

రా:-(నిట్టూర్చి) తమ్ముఁడా!

గీ॥ కట్టుబడి యుండుహృదినిదుఃఖంబు రుషయు
సహజధైర్యంబు గలయట్టి చతురమతుల;
నిచట నన్నియపత్రప యెంతయేని
నొంచి చెలరేఁగు నేమొనరించువాఁడ!॥ 16.

ల:-(ముందుఁజూచి) అన్నగారూ! జనకసమున వగుజటాయువునకు
వీరలోకము నొసంగినసిద్ధక్షేత్ర మహదగునరణ్యప్రదేశ మిదియ
కనుఁగొనుఁడు!

మ॥ సొరిది న్బిడ్డల తాతవక్రనఖచంచుక్షేపము ద్రావఁగా
సురు తేరుగ బహుఛిన్నభిన్నముగ నిచ్చోఁ గూల్చె వీక్షింపుమా!

రా:...(దుఃఖమున)
తరుణీ! హా! కడుధన్య వీవయిన సందర్శించి తాపం త్రికం
ధరమత్తేభదశాస్యభేదనహరిన్ ధైర్యాద్రిఁ బక్షీంద్రునిన్!॥ 17

(లక్ష్మణుఁడు నానుకొని ధ్యానించుచుండును)

ల:-(తనలో) అహో! మనస్సునంతటిని మిక్కిలిగ నాక్రమించుకొనిన
యీశోకము మహాదోషమునలె బహుళానర్థదాయక మగునుగదా!
ఇతరములపై కీయన మనముం ద్రిప్పఁజూతును (ప్రకాశముగ)
అన్నా! అటుచూడుఁ డటుచూడుఁడు!

సీ॥ వింధ్యశుద్ధాంతకన్యలై వెలయునదులు
ప్రిబ్బలు [illegible] లోంకొండుఁ [illegible]
గీతవాద్యనృత్తంబుల నాత్తముగఁ
గొనుఁ బుష్పనరాన్నృత్తి ననుపమము॥ 18

రా:-(కన్నులఁ దెఱచి. నిట్టూర్చి)

ఉ॥ కేఁ దలవర్లుగా నుపచరించి తొగల్మడుఁగ న్విశాయ మ
ర్కోడయబోధఁ బద్మతతు లూని పొనర్చెడియామికాన ని
శ్లైదయివాఱు వీనుల మదేభచయంబులతాళము, ల్మయూ
రాదుల నృత్యవిభ్రమము, లన్నిసరిత్తులనే న్మనోజ్ఞతన్॥ 19

ల:—అన్నా! మాల్యవంత మనుపర్వత మిదియే!

ఉ॥ దొమ్మిగ దుండగీఁడడవిదున్నలు కొమ్ములఁజిమ్మ దొర్లి గుం
డ్లిమ్మలఁ గూర్చు చూల్మృగుల కెప్పుడు గర్భనిపాతముల్! గుహా
గ్రమ్ములఁ బ్రౌఢభల్లుకవరమ్ముల హీక్కల కుల్కి కాననాం
తమ్ములబోయలేని గళితమ్ము లొనర్తురు వింధ్యనమ్ములున్॥ 20

రా:—(చాలసేపు నూంచికన్నీటితో)

ఉ॥ చుట్టు నెమిళ్ళగుంపు లెటుచూపెడినో తమయాందరంబు లే
తట్టునఁ జేంట్లజోడులు కదంబవిభూతుల నెట్లుకోరిలునో!
పుట్టల భోగిదంపతులభోగము సత్ఫలదంబుగాఁగ నీ
గట్టను నూత్న మేఘములఁ గార్చెడినో నవనీతతోయముల్!॥

తమ్ముఁడా! లక్ష్మణా! న న్నానుకొనుము! మనసు నిలఁబట్ట
లేకున్నాఁడను!

ఉ॥ ఉస్సురఁ దెంపులేదు, మొగమో కడుస్రుక్కె, నెలుంగు రాచె, మై
డస్సినయంగము ల్సడివడన్ జెడి పాలె, ముసించె జాడ్య, మం
భస్సులు నూతెకెఁ గన్నుఁగవ, ప్రమగ్గ నహా! స్మృతి, జానకీవ్యథన్
బుస్సనుహాక మిప్పటికి పొందెనుమీ పరిపాకతీవ్రతన్ ॥ 22

(లక్ష్మణుఁ డానుకొనియుండఁగనే కన్నులు మూసుకొని) హా! ప్రియ
సఖీ! దండకారణ్యవిహారసబ్రహ్మచారిణీ! (మాటికిట్లు పలవించు
చుండును)

ల:— (చింతాగ్రస్తుఁడై తనలో) దేనిచేత నీకరుణారస మింకొకటిగ మాఱ
గలదో! (తెరలో) ఆ! పాపీ! నీచ కబంధా!...వీఁ డుండఁ
బోఁడు!

రా:— (ససంభ్రమముగా) తమ్ముఁడా! దురాత్ముఁ డగుకబంధరాక్ష
సునిచేఁ బోరు సలుపు నీప్రియమిత్రుఁ డగుగుహుఁ డని తోఁచుచున్నది

రాక్షసు లనేకమాయలుగలవారు కావున, ద్వరగనేగి యీతని
నను(గహింపుము! (లక్ష్మ.ఇు డు నిష్క్రమించును)
రా:— (ప్రక్కలం జూచి సకరుణముగఁ గన్నీటితో) దేవీ! వామశీలా!
జనక రాజనందినీ! నీయఖిలరహస్యములకు సాక్షిభూత మగునెట్టి
గన్నేరుపొదలవరుస యిదిగో! ఇచ్చటనేక దా!
ఉ॥ నామెయి నానఖాంకురము, నాసఖ! నీకృతె మంచు నీసఖీ
స్తోమముతో వచింతుననుమర్ భయపెట్టఁగ, నూని యంకిలిన్
నామదిఁ దృప్తినొందఁగ ననంగపరీమళముద్ర స్వేచ్ఛ నే
నేమొనరించినన్ సయిచితే అలనాఁ డెటువిస్మరించెదనో?॥ 23
(విల్లుఁబూని లక్ష్మణావృత్తాంతము వినుగుహూహాలమున నిల్చును) (గుహు
నితో లక్ష్మణునిప్రవేశము)
గు:— దేవరవారికి జయము జయము!
మ॥ అసురత్వం బొనఁగూర్చుపాపములు మాయన్ స్వర్గమున్ జేర రా
క్షసుమ్రిందించె, జగద్విచిత్రచరితన్బ్రాధించె, గర్విష్ఠులం
దు సమర్థుం డగుశాస్త్రగా, నమరులందో? భీతిఁబో కార్చుదు
ర్గసమానుండుగ నీసహోదరుఁ డహో! ప్రాథిన్విరాజిల్లెడిన్॥ 24
రా:— మంచిపనియే జరిగినది. వానికి దేవలోకమార్గములు శుభము
లగుంగాక. అబ్బాయీ గుహుఁడా! మింట నెదియో పెనుకొండ
వలెం గనుపట్టినది. అది యీయామడచేతులవాఁడు ధరించినయా
యుధమే ననుకొనియెద.
గు:— గీ॥ అసురనాథుని దుందుభియనెడివాని
వానరాధీశు డగువాలి పట్టిచంపె;
వానియెముకలగూ డది బాలుడితఁడు
కాలనెగజిమ్మెఁ, దమ రదికాంచియుందురో'॥ 25
ఇయ్యది వాలి పోయునకుం గాల్ద్రివ్వ నొక్కకారణం బయ్యెడినే మో!
ల:— అయిన నేమి?
రా:— తమ్ముఁడా! అటులనకుము! పురాతనవీరు డయినయీయింద్ర
సూనుఁడు మాననీయుఁడు సుమా! (గుహునితో) బిడ్డఁ డెందుండి
వచ్చువో నీయోజనబాహు నడ్డగింపు కలిగినది?

గు:— ఆకాశయానమున పడిగా రావణుఁడు సీతాదేవి...

రా:— ఆఁ! యేమైనది?

గు:— ఉత్తరీయము పడుచుండఁగా హనుమంతుఁడెగిరి యందుకొనియెను. సుగ్రీవహస్తములలో నిడగు సుగ్రీవకుమారుఁడు మిమ్ములను సంతోష పెట్టువాఁడై యిగాదీనిని మీకుఁ గానుకగా నాచేఁబంపెను (రాకిచ్చును)

రా:— (అందుకొని హృదయమునకొత్తుకొనికన్నీరుకార) అయ్యో! దేవీ! విదేహానందినీ! ఈయుత్తరీయ మొక్కటనే నాకు నిన్నుఁజూడ మిగిలెనా? (కన్నులు మూసికొని లక్ష్మణునానుకొనును)

ల:— గుహుఁడా! సుగ్రీవుఁడు కుశలియేకదా?

గు:— అతనిసేమము నీవెప్పు డెపుడుగఁ దలఁచితివో అప్పుడే యాతఁడతి కుశలి.

రా:— (తనలో)

చ॥ సొగఁగ దశాననుండు చనియె న్గొని సీతను, మున్నె చంద్రశే
ఖరుఁ గొలునట్టి దనంతఁ దరుగండె శిరంబులదండ? దీనిపై
నుచితపు శిక్ష వేయొకటియున్నదె వానికిఁ? జంద్రహాస సం
చరితసభానసే నడువ సమ్మతిఁ జూపునె నాశరం? బిసీ!॥ 26

ల:— అన్నగారూ! మనయెడల నీవనచరులుగూడ మంచితనమునే యవలంబించుచున్నారు.

రా:— ఏమంటివి? మనకు సుగ్రీవుఁడుజ్ఞాతికదా! మన యిక్ష్వాకురాజర్షి వంశమూలపురుషుఁ డగువేవెలుంగుదొరయేసుమా యాతనిజనకుఁడు. (ఎదపైనున్న యుత్తరీయముంజూచి), సోదరా! గుహుఁడా! సుగ్రీవహనుమంతులఁజూడవలయునని యున్నదోయీ! ఋశ్యమూకమున కేగుదారి నగపఱుపుము!

గు:— (సంతోషముతో) (దనలో) జాంబవంతుని యాలోచన యెంత శీఘ్రముగ ఫలించినదీ! (ప్రకాశము) ఇటే! ఇటే! మతంగాశ్రమము మీఁదుగా (అందఱుం బరిక్రమింతురు)

గు:— చూడుఁడు! చూడుఁడు!

ఉ॥ క్రౌంబురదంచుమంకెనలు గుత్తులపూ ల్దొడుగంగ, నిత్యనా
ట్యంబులఁ గేకులాడఁ, గగురట్టులు జంబువు లీనఁబండ్లఁ బొ
ర్వంబుల గుడ్లుడు ల్యబరభామల మన్మథదీప్తి రేఁపఁ జో
ద్యంబుల వింధ్యపర్వతపుదారులు కన్నులఁ గొల్పుఁబంపుపుల్॥ 27

రా:— (అంతటంజూచి, వగతో)

ఉ॥ అంతటఁ బుట్టుపెక్కులల నంగఁగొనంగలనేర్పుతో వడి
న్గంతిడు పంపగాలికి వికాసము లేలకులొంది చుట్టు నీ
చెంతలఁ దావులుబ్బఁగ, విశీర్ణమతి న్వోయిమాయసీతల
న్భ్రాంతిని వ్రాయునన్నుఁ దెలుప న్వనభూము లొసంగునూఁతముఁ॥

ల:— అన్నగారూ! ఇటుచూడుఁడు!

చ॥ కలిసెడిపోతు భీతిఁ జనఁగా విరహాన నహంబుఁదక్కి బె
గ్గిలుహరిణి న్గన న్గరుణ క్రేళ్లుఱుక న్నిషు గద్గదోక్తుల
"జ్జెలువుఁడ! చాలు నేయ!" కనఁ జెం చపరాద్ధతికు న్దొలంగఁ డా
ములికియె నూటితప్పఁ జనెఁబో! అపరాధము లేనిపోబడిఁ॥ 29

రా:— (కన్నీటితో) అయ్యో! దేవీ! వైదేహీ!

గీ॥ అల్ల మారీచువేఁట నత్యంతదృష్టి
నునిచి నేనేగియుండ రావణుఁడు రాఁగ
నీవిభీతాంబకంబులు నిజమ యిట్టి
హరిణినేత్రంబు లట్లుండె ననితలంతు॥ 30

ల:- (తనలో) అన్నగారిహృదయమును వినోదపెట్టుటకు వేఱొకయు
పాయ మేదిచెప్పుమా'

(తెరలో) ఓహోహో! వానరులారా! చెప్పుఁడిప్పుడు ! నాకీర్తికామినికిఁ
గ్రీడానగమనఁదగు నీదుందుభికంకాళము నెవఁ డిట్లుచిమ్మెనవాఁడు!

గు:-(చూచి సంభ్రమమున) దేవా! కనుఁడు! కనుఁడు! జందెముగా
ధరించిన కనకమయసహస్రదళకమలమాలిక కాంతులెగయ, సహ
జారుణదేహకాంతి దుందుభికాయము నెవ్వరోయెగఁజిమ్మె రను
తామసోద్రేకమున ముమ్మడుంగులుగ జేవురింప వానరపట్టభద్రుఁ
డయినవాలి యిటేవచ్చుచున్నాఁడు!

ఉ॥ చంకి ది శాస్త్ర్య సంగములు జానఱ నల్పి క్షణాన స్వర్గమే
కాంకితము న్నొసన్నిసభుజాధికవీర్య సతంబుఁ జూచుమే
లొప్పంప ముక్కై కినుత్వోగయుఁ బత్తడితమ్ముల మాలగా నిరా
తంకత సెంసెప్రిఁ శీఘునుని దాఁగయిచేసె నటంచు నెంచెదఁ॥ 31
ఈమహాసీసుఁడు దేవరవారి ఋశ్యమూకయాత్ర కించుకవిఘ్నము
కాఁగలదేమో! అందుచే నేను ముందువెళ్లి సూర్యపుత్త్రున కుత్సవ
ముం గూర్తును.
రా:- అట్లులే యొనర్పుము
గు:- "మిత్రతఁ దనుపదముచాటున నీసేవఁ జేయఁగోరుచున్నాఁడ" నను
సుగ్రీవువాక్యమును మఱువకుఁడు!
రా:- (అసువారించి) తమ్ముఁడా! లక్ష్మణా! నీమిత్త్రుఁడగుగుహుఁడు
నిట్లుచెప్పఁగున్నాఁడు. అదిగాక పోయినను, మంత్రోత్సాహశక్తిసంప
న్నులుగోఁగూడ సిద్ధులగువారు ప్రభుశక్తినే కోరుచుందురు. అందు
చేత నే నీసుగ్రీవుని వాలిస్థానమునస్థాపించి యుతనికోశదండము
లూఁతగా సమగ్రశక్తినొంది పగఁ దీర్చుకొందును.
ల:- (నవ్వుచు) పరిబలోపయోగ మొసఁగఁగల యింద్రసూను మపే
క్షించి రిక్తుఁడగు సుగ్రీవుసంధి నుపయోగించుకొని సిద్ధినొందుదు
మనుకొనుట వంకతిరుగుడుగాదా?
రా:—(నవ్వి) తమ్ముఁడా! నీవనినది కాదనను కాని,
ఉ॥ రావణునంత వానిని బరాజితుఁజేసినవాలి సంధిఁ దా
నేనరియించునే? యుదుగ నిచ్చునె? సాయము రూఢిగాఁగ సు
గ్రీవుసమైత్రి గట్టిపడఁ గీశపతి వ్యథయింతు, నన్యదా
రానన బండ పుత్త్రుఁ డనిక్రాఁగుశచీపతి వంతఁ దీర్చెదఁ॥ 32
ల:—అన్నగారియాలోచన లెప్పుడుఁ గార్యజ్ఞతనే వెల్లడించును. అదియు
నుంగాక, శాపమోక్షమునుంబడసి స్వర్గమున కేగునారాక్షసుఁడు
గూడ గుహునిమాటచొప్పుననే దేవర నిర్ణయింపఁగలరనియె.
రా:—అందుచేత నీగుహుఁడే యెదురురాయభారము నడుప నర్హుఁడు.
ల:—(గుహునితో) సఖా! నామాటలుగ నీవాసుగ్రీవునితో నిట్లు
పలుకుము.

మ॥ నినుఁగన్నట్టియినుండు మాకులగురుండే ! మామనుష్యాత్ముఁడ
య్యెను దా నీకును మాఋదల్లినుఁతుఁ డిక్లైన్నంగ సాజంబ నీ
కును మాకు న్గులమైతి); క్రోఁతిప్రకృతి న్గంకింతువా దాని, వా
లిని బోకార్చుశరాళి కొంకవు నిను న్గేహంబుగా మాన్పఁగన్ ! ॥ 32

రా:—బాబా ! గుహా ! మాలక్ష్మణుఁ డావాలమ్మీమీదికోపముచేత
నేమేమేమియో యనుచుండునులే ! ఈరాముఁడో ప్రతిక్షణ ముజ్జ్వ
లితమగుచున్న యీజానకీవిరహానలము సాక్షిగ నగ్నిమ్రోల సుగ్రీ
వునితో సఖ్యమునొనర్చ సుముఖుఁడైయున్నాఁడు.

గు:—(సంతోషమున) సూర్యపుత్త్రుఁడు దేవరవారిచే మిక్కిలిగనను గ్ర
హింపఁబడినాఁడు, (పరిహాసముననవ్వుచు)

శా॥ ఆసుగ్రీవుని బక్షపాతమధురం బౌచూడ్కిఁ దా మాదుకోన్
మాసేమం బనుకొంద్రొయేమొ! సుతుఁ డిమ్మాద్రిన్ బ్రభుండౌట కెం
తోసంతోషముతోఁ దదీయజనకుం డుప్పొంగఁ దద్భానుపా
ళీసాహస్రిమహోత్కటోష్ణములు నల్లి న్బొలి మన్మెన్చుఁడూ ! ॥ 3

ల:—(నవ్వుచు) ఏమిది ? సుగ్రీవునకు రాజ్యప్రదానముంగూడ నేమం
కరించిన ట్లిప్పుడే యీగుహుఁ డనుకొనుచున్నాఁడే !

రా:—(నవ్వుచు) వత్స ! గుహుఁడా ! ఇప్పుడే రాజ్యప్రదానవిషయమ
నే ననఁదలపన.

గు:—(వినయమున నవ్వుచు) మహాపురుషులమార్గములిట్టివే.

క! సంకల్పమె సత్పురుషుల
నుంకింపఁగఁ జేయుఁ గృతుల నుత్సాహమునన్
బంకజముల కేప్రితిన ను
టంకించె నినుండు ? తెల్పుడా ! సిరిఁగూర్పన్ ॥ 3

(మఱలఁదెరలో) ఓహో ! సమీపవానరులారా ! వేగమవెంట?
చెప్పుఁడు ! దుందుభియెముకలగూడు నెగఁజిమ్ముటచే స్పష్టమగ
చున్నగర్వమున నంధుఁడగు నెప్వఁ డింతకాలమునకిప్పుడు నాభుజ
కండూతిం దీర్చుకొనఁ గుతికాఁదలఁచెనో ?

గు:—(తనలో)

ఆ॥ [illegible]గస్వ[illegible]గబాధ మొందుచు నత్య
కోపియైన [illegible]కుంజరుండు
[illegible] ప్రేరణంబున నుగ్రుఁడై
వచ్చినాఁ[illegible] బిట్టుక వ్వెఁబట్టి॥ 36

అంచు [illegible] నేను [illegible]కము [illegible]కాల మీఁపీరవిహారసుఖము ననుభవింతును

వాలి:—(ప్రవేశించి, ముందుఁజూచి) అం రే! ఎవ రీప్రసన్నోజ్జ్వలాకారులు! రాక్షసకులక్షయమున్ గిరిపడుటకు వీరే కారకులా? (జ్ఞప్తి నభినయించి విశేషముతో) నాప్రియమిత్రుఁడగులంకాపతి చెప్పనే చెప్పినాఁడు.

గీ॥ "జనకుఁడు త్యజింప మాతృభాగ్యమనుజుఁడొక్క
యలఁతి వోర పెద్దబిడ్డఁడిం దనుజతోడ
భాగలబ్ధంబు కాంతారవాస మూఁని
బ్రమసి సంచరియించు దండకారణ్యభూమి॥ 37

వారిపుడు పనులఁ జరించుచు మననిశాచరుల దోఁచుకొనుచు దొంగవృత్తి నవలంబించియున్నారు వారిని వారింపఁ జూడు"మని.
వీఁడు మఱివీఁడును వారే యైయుండురు.

రా:—తమ్ముఁడా! ఈమహావీరుఁ డేమిచెప్పునో!

ల:—(కొంచెముసమీపించి) చూచితివయ్యా యిచటిమమ్ము?

వా:—ఓహో! ఈమీరలెవరు?

ల:—మేము క్షత్రియులము రాఘవులము.

వా:—ఆయుష్మంతుఁడా! ఆకారమే ఆజాతిం జెప్పుచున్నది. విశేషమున్నఁ జెప్పుము.

ల:—రాఘవుల మనియుం జెప్ప లేదా?

వా:—(అసూయతో నవ్వి) ఆఁ!

ఆ॥ రూపముచె క్షత్రియత్వంబుఁ జూపఁగలవు
రాఘవపదంబో వంశంబు క్రమమె తెల్పె
నామము లెఱుంగఁదలఁచిననాకుఁ గులముఁ
దెలిపిపంతనె కోరిక తీఱఁగలదె?॥ 38

ల:-(ధైర్యసంభ్రమమున) మే మారామలక్ష్మణులమోయీ !

వా:-(సవిత్కారముగఁదనలో) ఆ యనుదానిచేఁ బ్రసిద్ధుల మనుచు న్నాఁడు. శివునివిల్లును విఱిచినవాఁడు వీరిలో నొక్కఁడయియుం డునా ? కాని ప్రశ్నించిచూచెద. (ప్రకాశముగ నవ్వి),

శా॥ వేషాలో ? సమరార్హసాధనములో ప్రేయస్వరూపంబులో !
భూషాతుల్యగభీరవృత్తులో ! సమంబు లబ్బెడ మీలోన భూ
యోషాధీశవధవ్రతు న్భృగుపతిక్ వ్యగ్రాత్యంతదీక్షుండుగా
నీషద్వీరు నొనర్చు రామపదుఁ డేఁడీ ? చూడఁగా వేడుకా !॥ 39

ల:-(వినయమున) ఆర్య ! సంక్రందననందన ! నేను లక్ష్మణుఁడ !

వా:-కుమారా ! ఈయింకొకఁడే దాశరథియుఁ గౌశికశిష్యుఁడు నగు రాముఁడా ?

ల:-కాకేమి ?

వా:-(సంతోషోల్లాసములతో కొంచెముదగ్గరగ)

మ॥ ధర త్రైవర్ణ్యమె చేయుభార్గవమహాస్త్రక్రాంతిలోనుండి భూ
వరజాతి న్దొలగించినాఁడవట ! సెబా ! సుప్రభాతంబు ! క
క్ష్యరసం బార్పిన పంక్తికంఠసమరోత్కంఠ బైనకంఠాతికిక్
దొరక న్గల్గితి, నేఁడు నాకనులు నోహో తేజు రా ! రమ్మిటుల్ !॥ 40

రా:-(చూచి, హర్షమున) ఈమహాబాహుఁడేనా సంక్రందననందనుఁడు ?

క॥ ఈవీరవరుని రక్తం
జేరనకిష్కింధనైన శ్రీవసుమతి యా
రావణపరాభవంబుల
పోవడికి న్దొలఁగి యూర్పులాడ నెసంగుక్ ॥ 41

(పరిక్రమించును)

ల:-ఓమహాభాగుఁడా ! వీరే మాయన్నగారు రమ్ము ! ఇటు ! ఇటు !

వా:-(సమీపించి) రామభద్రా !

సీ॥ ప్రాణమొడ్డి పోరాడును రాసుతులకు
సభికుఁ డైయున్న నారదసంయమీంద్రుఁ
డిపుడు నీవు నాభుజముల కింపొదగ్గ
పరాకతరు మేలిసంతోషి నందుఁగాత !॥ 42

రా:—ఓమహాపీరుఁడా! ఏమనుచున్నాఁడవు? యుద్ధమందు నిరర్గళ వ్యాపారు లగువారి మూర్ధాభిషిక్తుఁడవుగదా!

మ॥ అమరీవే ఖల నేఁచువైరితతిపై నత్యంతమై రేఁగుద్వే
షముచే నెల్లెడ భీప్రదం బయినతేజం బొప్ప నింద్రుండు దే
హమున న్గాడెడితూపు లుజ్జ్వలవ్రణాలై వేకను లొప్పుచుగా
క్షములై యుండఁగ నిన్నుఁ బుత్త్రికునిగాఁ గాంచె న్గదా! వానరా!॥

మఱియును,

మ॥ జగము ల్మూటి జయించుబాహుపరిఘు ల్బందీనిరక్షోపతిన్
వగ చెంద నిజకక్షఁ బట్టి తటితో వారాశుల న్సంధ్యవా
ర్చఁగఁ, బ్రత్యక్షముఁ గా ర్తవీర్యుని ప్రతాపం బెన్న రేవ న్విడన్
జగము ల్సర్వనసంద్రము ల్నదులు నాశ్చర్యంబున న్దోఁగవే!॥ 44

వా:—(వికటముగ, నవ్వి)

క॥ రక్కసివీరులమూకల
నుక్కడఁచెడి మేటి ద్వంద్వయుద్ధంబునఁ జే
రెక్కి యిటుఁ బెక్కునాళ్ళకుఁ
దక్కితి, నీ తేనెనుడులఁ దనిసి విడుతునే?॥ 45

వినుము!

శా॥ దేన స్సర్వనృపాలమారకధనుర్దీపంబుఁ గైకొంచు, షం
శాన జ్ఞానగురుసుక్కు భార్గవుకయి న్సంధిల్లఁగాఁ జేసి త
ద్దాసి, స్వీరుఁడ! ముండులోకముల హృన్మాలిన్యము ల్దీర్చుమం
దౌ నీతేజుఁ గన నిరంబుఁ గుతుకంబందుండె నీహా స్తముల్॥ 46

రా:— (నగుమోమున)

సీ॥ దనుజకులలక్ష్మికి న్మాలమును హరింపఁ
గడన జటనంపదల నిడఁ గాణయాచి
నారి సంధింపఁబడియె యున్న యది నిజము
కనుము! కుటిలీజుఁగా నాదు కార్ముకంబు! 47

కావున, మహాభాగులగు తమరుఁగూడ శస్త్రముంగొనుఁడు!

శా:— (నవ్వి) బళె! మహా క్షత్రియుఁడవు. కాన, బాగుగఁ బల్కితివి. ధర్మానుసారముగనే యున్నది. కాని,

గీ॥ బాహుబలశాలు లగు యుద్ధభటులలోన
నాత్మజాతికి ననుగుణ మాయుధంబు,
ఇనుపముక్కలు కైదువులే కపులకు ?
గోళ్లుఁ, దలములు, ముష్టులు న్గదిరియుండ !. 48

ల:— ఆర్య ! ఈ మహాభాగుఁడు చక్కఁగ నచించినాఁడు. తిర్యగ్జాతికి స్వాంగాయుధములు సర్వసిద్ధము లేగదా !

రా:— (నవ్వి, ధనుస్సు సారించి) అహాహా !

ఉ॥ గౌతమశాపదీప్తి భుజగర్వము మాసినయింద్రు, నెన్నొనే
లూఁతము లొప్ప రావణియె యోరిచి దుర్యశమిా న్దశాననున్
స్వీతగఁ జంకలన్నలిపి, వీరుఁడ!, తండ్రిపగ న్దొలంచి యు
త్ప్రాతతసౌఖ్య మిచ్చితి మహాత్ముఁడ ! పుత్త్రుఁడన్న నీవకా ! 49
అంతటి నిన్నే దైనము నాశరముశౌరిం గూర్చె నె !

వా:— (రోషమున) ఆఁ! కాకుత్థ్స !

శా॥ అడ్డాదిడ్డిగఁ జేతు లిర్వదియుఁ గీ ళ్ళార్తి న్బడ స్జంకలం
దొడ్డారింపఁగలేమి నార్చెఁ గొనవచ్చో సర్వజద్ఖ్యాతి సం
చుడ్డాటన్బడి రావణుండు!, ఘనమా ! యోడిండె ముష్టైహాయుం
డడ్డ ! న్భార్గవుగెల్చుని న్గెలున కౌనా నాకు నేయున్నతెల్ ? 50
కావున, సమరమునకుఁ దగిన తావున కరుగుదము రమ్ము !

(వాలి, రాముఁడు నిష్క్రమింతురు.)

సు:— (తనలో) అదృష్టముంగుటచేతనే నాయభీష్ట మీడేరుచున్నయది.

ల:— (తెరవైపుఁజూచి) ఇదియేమి ? ఇంకొక వానరులజంట అన్నగారి వెనుకఁ దగులుచున్నారే ! నేనుగూడ ధనువు నెక్కిడుకొని సిద్ధముగ నుందును. (అట్లొనర్పనుంకించును).

సు:— ( చూచి, సంతోషమున ) లక్ష్మణకుమారా ! తత్తఱపడకు ! రాముగుణములపై ననురాగాధిక్యతచేతను వాలిపైకసిచేతనే నిజముగా రెట్టించిన యుత్సాహముతో సుగ్రీవుఁ డిట్లు పొలికలనునకు దూఁకుట.

ల:— ఓహో ! ఈతఁడల సూర్యపుత్త్రుఁడా ? మంచిదే. ఆ రెండవవాఁ రెవరు ?

సు:— అతఁడుగూడ కిష్కింధేశ్వరస్కంధావారమునకెల్ల నేకవీరుఁడని పేరొందిన హనుమంతుఁడు. భగవానుడగు వాయుదేవుని పుత్త్రుఁడు సుమా!

ల:— (సంతసమున) ఏమిట్లు? ఆంజనేయుఁ డనఁగా నితఁడా!

ఆ॥ బలుని కౌసబలమున స్సనలావుఁ దా
నెఱుఁగ లేనిజడత నెసఁగియుంట
జలధి దాఁటినారి మగతనా ల్చెల్లంగఁ
దనుజగాసియట్లు తనరు నితఁడు॥ 51

నిశ్చయముగ సీతానికాశల్యముచేతనే మామనశ్శల్యంబులు విడిపోఁగల వని యెంచుచున్నాను. అదిగో! జరుగుచున్నదే వాలికి నన్నగారికి ద్వంద్వయుద్ధము! జయలక్ష్మీపరిగ్రహోత్సవమున నీయనకుగాని నాకుఁగాని పాలిభాగము దొరకునట్లు లేదు.

సు:— (సంభ్రమమున) కుమారా! చూడుము! చూడుము!

క॥ సాలము లేడును వసుధ
న్వాలుచుటయుగాక వాలిఁగూడఁ జదిపి పే
ర్వాలమ్మున తూణమ్మున
వ్రాలె నిదె రామకరపరామర్శితమై॥ 52

ఆహాహా!

ఉ॥ దిక్కులఁ బిక్కటిల్లి జగతి న్బయిపొంగుయశంబు వెల్లితో
నొక్కొను నాదిమూర్తి యగు నేర్పరి వాలి యసుర్ల మేలిమి
న్జక్కువుఁ దన్మదంపు మెడఁ జూచ్చి మహాతిథియైన రామునిన్
జక్కఁగఁ బిన్చి వీరశయనంబున నొందెడిఁ బెద్దనిద్దురన్॥ 53

ల:— (అనుతాపమున) అయ్యో! దేవా! సంక్రందనా! వేకన్నులుండియు నింతటిమహావీరపత్రికాండు నింకెందుఁ గనఁగలవు!

తెరలో — దుందుభిధ్వని—మంగళగీతములు

సు:— (హర్షమున) ఏమిది! ఈనీలుఁ డప్పుడే జాంబవత్ప్రముఖులచే నభిమంత్రితంబులైనబంగరుకలశములతోఁ గుమారసుగ్రీవు నభిషేకమునే చేయుచున్నాఁడే! దాశరథియు స్వయముగ నతనికంఠమును బంగరుపద్మములచే నలంకరించుచున్నాఁడు!

ల:— ప్రియము! కడుంగడు ప్రియము!

(తెరలో) వానరసేనాధిపులారా! భల్లూకచమూనాథులారా! గోలాంగూలవాహినీనాయకమణులారా! ఆలకింపుఁడు మిమ్మెల్లర నీసుగ్రీవమహారా జాజ్ఞాపించుచున్నాఁడు. సమస్తయువరాజోపకరణములను సిద్ధపఱపుఁడు! సీతయునికి నెఱిఁగివచ్చుట కీహనుమంతు ననిపి నేనీపైమూహూర్తముననే యంగదకుమారు యౌవరాజ్యమున నభిషేకించెదను.

ల:—

గీ॥ ఎల్లవిధముల మనముల కింపొనర్చు
చున్న దీయుత్సవంబు మా కున్నపాట
వాలి లేకుండెనే యనువంతయొకటె
కలఁచుఁ గాఁబోలు నొకవేళ నలశచీశు!॥ 54.

అంతరిక్షమునుండి పుష్పవృష్టి - తరువాత

తెరలో - జగత్పతియగు రామభద్రునకు జయము! జయము!

శా॥ ద్వైరాజ్యంబున సౌఖ్యమేమి యనుచింతం గొన్న వైరాగ్య మా
స్వారాజాత్మజు శోకచేత శమియుంప న్దాను గిష్కింధ దే
శారాధ్యుండయి సూర్యసూతి సిరి డాయఁ యౌవరాజంగదుం
డై రాజిల్లుట నింద్రు వేకనుల ముత్యాలయ్యె మోదాశ్రువుల్॥

ల:— ప్రియము లన్నిట నిది మాకు మిక్కిలి ప్రియము! మిత్రమా! పద! మనముగూడ నియ్యుత్సవములలోఁ బాల్గొందము! (నిష్క్రమము)

ఇది అయిదవయంకము.



గీ॥ రాముచేత ఖరాదిమారణము కలిగె
మారుతియె చంపె నక్షకుమారు నిందె,
స్వయముగా రావణుఁడె విభీషణుని నింటి
వెడలిపోవంగఁ దరిమెనే కడలిదాఁట॥ 5

దుర్బుద్ధియగు రావణు నెంతదూఱిన నేమిఫలము ? సముద్రపు టుత్తరతీరమున స్కంధావారము నేర్పఱచికొనినదాశరథి యేమేమి చేయుమొదలిడెనో యెట్లు తెలియుట ? (ముందుఁ జూచి) ఇదిగో ! రాఘవప్రారంభంబుల నెఱింగిరాఁ బనిచినశుకసారణులలో సారణుఁడే ముందువచ్చుచున్నాఁడే !

సా:—(ప్రవేశించి) చిన్నతాతగారికి జయము ! జయము !

మా:—(అగ్గించి దగ్గఱఁ గూర్చుండఁ బెట్టుకొని) అబ్బాయీ ! సారణా ! సుగ్రీవు శిబిరమునుండి యిప్పుడేవచ్చుచున్నట్టులున్నదే !

సా:—అవును తాతా !

మా:—అచ్చటి నీయనుభవ మంతయుం జెప్పుము !

సా:—వనేచరులచే రాఘవున కెంతపాటిసాయమో నీకుఁ బలుమాఱులు వినిపించియే యుంటినిగదా ! ఇప్పుడు సేతువును నిర్మించుటకై చేరిన సైనికులలో నేనుఁగూడ వానరరూపమున నుండ మహారాజుగా రగువిభీషణకుమారులు (అర్ధోక్తిలో భయమున నటునిటుచూచును) తాతా ! చాలకాల మటనుంటచే రామరాజధానిలోఁ బ్రబలిన ప్రవాదము నన్నలముచున్నది.

మా:—ఆచిన్నతమ్ముఁడు రాఘవునిచే నభిషిక్తుఁ డయ్యెనా యేమి ?

సా:—నిజమంతియ.

మా:—(ఇంచుక సేపుమౌనివడి, నిట్టూర్చి) కుమారా ! నిశ్చయముగాఁ జెల్పుము !

సా:—విభీషణరాజకుమారుఁడు నన్నుఁ బోల్చుకొని బంధించి రాము నెదుటంబెట్టెను.

మా:—(శంకతో) తరువాత ?

సా:—తాతా ! తరువాత నాదాశరథి తనమంత్రులకంటె మిన్నగా నన్ను గౌరవించి బహుమతులనొసఁగి పోయిరమ్మనియెను.

మా:—(హస్తమున) ఏమంటివి? జయశీలు రగువారి కిట్టిఘనగుణ
మాజన్మాంత ముండునదియేగదా! అందులో నట్టిది రామభద్రుని
కడ విశేషముగ నున్నట్లున్నది.

చ॥ తనమొఱలోనివే యనుచు, దాయసరోజమునుండి లేచివ
చ్చినపని భేదమెన్న కొకచెన్నునఁ దేఁటులనెల్లఁ దేర్చుక
ల్వనిచుతి సాధు లెప్డుఁ దనవా రొరులం చెడసెయఁబోవకే
సినుతెఱరు సేవ నెవ్వరికినేని సుధామధురక్రియాంఘ్రిరిక్॥ 6

అదిసరియెకాని సుకుఁ డెందున్నాఁడు?

సా:—నాకును వానిజాడ తెలియలేదు.

మా:—(వితర్కించి) కుమారా! విభీషణుఁడు రామునిపక్షము నవలం
బించుట మనకులమున కేహాని యని క్రుంగిపోవుచున్నాఁడను.

సా:—తాతా! అంతటిధర్మదృష్టిగలవాఁడే! ఆర్యసంతానమే! విభీషణ
కుమారుఁడు! మాతో జనకసముఁ డగుపెద్దన్నగారిని బరిత్యజించి
శత్రువులఁ జేరనలసివచ్చు టెట్లు?

మా:—ఏమా! ఆదశగ్రీవునే యడుగుము! (నిట్టూర్చి) లేకున్న నాదైవ
మునే యడుగుము!

సా:—అదికాదుతాతా! వినఁదగినచోఁ దెలుపుదురని.

మా:—పిల్లఁడ! విను! కేసరిభార్యయందుఁ గాలిదేవునకుఁ బుట్టిన
వాఁడున్నాఁడే-హనుమంతుఁడు - వానిచేత ధ్వంసముచేయఁబడిన
యశోకవనింగని రావణుఁడు విభీషణునితో "కుమారా! చూడుము!
ఆమనుజబాలిశద్వయముచే దగ్గఱకుఁ దీయఁబడినక్రోఁతిపు ర్వెట్లు
విజృంభించినదో! అనియెను.

సా:—తరువాత! తరువాత!

మా:—ఆమాటమీఁద విభీషణుఁ డన్నకు నమస్కరించి యిట్లనియెను.

మ॥ నరజాతి స్మరియింపు! హైహయునిజన్మం బింత లోనెంచి, వా
నరజాతి న్నిరసింతె! వాలిభుజబంధంబుల్ స్మరింగొన్న! న
శ్వరివే! ఏ న్నిటు వేఁడుకొందును, పులస్త్యబ్రహ్మపుత్రా! త్వరన్
సరసీపుత్రి నొసంగుమీ! దివిజసంఘంబుం జెఱ ల్బాపుమీ!॥ 7

సా:- (బహుమానమును గూడిన వింతతో) తాతా! వాలిభుజమున జ్ఞప్తికి వచ్చినది.

ఉ॥ సేతువుఁగట్ట మోసికొని చేర్చెడి శైలశిఖాళి రావుము
జేతుల రోమహీనములఁ జేయఁ జరించు ప్లవంగవీరవి
ఖ్యాతభుజాఢ్యజాళి బరువైనను సైఁపదు మేరువై రవి
ద్యోతితకోమలోరుశిఖరాగ్రము వింధ్య మదేమి సెప్పుదున్॥ 8

(భీతితో) తరువాత! తరువాత!

మా:- ఆవెనుక రాక్షసేంద్రుఁడు కన్నులుగానినిరోషాతిరేకమున బరుషము లాడి విభీషణకుమారుని విరోధులనేనిఁ జేరుసల్లొనర్చెను.

సా:- (ఖేదమున నింగిఁ జూచుచు) అయ్యయ్యో! మహారాజా! పులస్త్య నందనా! వైధర్మమునందు నిన్నే దృష్టాంతముగఁ గైకొని జనులిక ముందు తమకు మూలచ్ఛేదనమును గూర్చుననునసుమానమును గల పనులేనిఁ జేయకుండఁగల రనుకొందును. (ప్రార్థనముగ)

క॥ సిరి యనుభ్రమరికేఁ జరణము
లరిషడ్వర్గములె యగుట నం దొకదాని
విఱిచి వెసఁ గుంటిదానిగఁ
బఱుప గదే! తండ్రి! స్థిరతఁ బడియుండునటుల్॥ 9

(మంత్రితో) రాముని చేఁ బన్నఁబడినవానరవాహినిం గనుంగొనిన తరువాత మనకులమున కిఁక విభీషణుఁ డొక్కఁడే మిగిలియుండఁగల యంకురమనుట సత్యమనిపించుచున్నయది.

మా:- (నిట్టూర్చి) వత్సా! రెండుకటకములసంగతి నీ వానుమట్టుగ నెఱుంగుదువుగదా! ఇప్పుడుచితమెద్ది?

సా:-నాతలంపిది. రాజపుత్త్రుఁడైనయంగదుఁడు పసివాఁడు క్రొత్తకుండ వంటి బుద్ధికలవాఁడు. చెప్పినదెల్ల నమ్మఁగలఁడు.

మా:- అయిన నేమగు.

సా:- రావణునాజ్ఞగా రహస్యముగ వేగువానిచే సంగదునకొకవార్త. ఏమందువా? వానితండ్రిఁ జంపినవారైన రామసుగ్రీవులఁ జంపి కిష్కింధారాజ్యమున కింతటికి నతనినే యేకచ్ఛత్రాధిపతి నొనర్తు మని చెప్పి ప్రలోభింపఁ జేసినచో నతఁడు సుగ్రీవుశిబిరమును విడిచి

రాఁగలఁడు. సుగ్రీవుఁడో తనయిల్లే యహిభయభేదశిథిలితముగఁ దలంచి రామప్రయోజనము నుజ్జగింపఁగలఁడు!

మా:- (నవ్వి) కుమారా! నీయూహ చక్కఁగనే యున్నది. కాని, యంగదుఁ డత్యంతముం బసివాఁడై యున్నాఁడు. యౌవరాజ్యసుఖాదికములచే బందుగులచే మిక్కిలిగ నుపలాలింపఁ బడుచున్న వాఁడు. అట్టివాని విడదీయు టసాధ్యమేగదా! అందుపైని వీనిమాతాపితృబంధువులు సుగ్రీవునకుంగూడ దగ్గఱబందుగు లగుటవలంపవలదే! వీఁ డొకవేళవిడిపోఁబ్రయత్నించిన జూచుచు నూఱకుందురా?

సా:- తాతా! తమ రనినదియు వాస్తవమే. <u>దండనీతి నుపయోగించు</u>టకుఁ గాలముఁగూడ ననుకూలముకావలయునుగదా! కపివీరుల సేతునిర్మాణోత్సాహము నలంచినచో నీపాటికే రాముఁడు మహార్ణవమును దాఁటి సువేలాద్రిసానుప్రదేశములలో విడిసియుండు ననుకొనవలసియున్నది.

మా:- (విమర్శఁదగులు నద్భుతమున)

ఆ॥ ఓహో యబ్బురముగ నొకనరమాత్రుని
వలన నుదధి దాఁట వలనుపడిన
నెట్టిమనుజుచేతనే ద్దశకంఠుప్ర
తాపమెల్ల నింక దాఁటఁగాదె! ॥ 10

(దుఃఖమున)

మ॥ మును దేవాసురపూజ్యరావణపదంబుల్ నేఁడు నిర్మాల్యత
న్గనఁగా రాముఁడు సేతునిర్మితిని నెగ్గన్ దలెనే దీప్తి హె
చ్చ్చన సూర్యుం డలరించుఁ బద్మవితతిన్, జొక్కంబుగా నూరసా
గు నశింపనుఖేద యధేచ్ఛఁగొని త్రాగు న్సర్వదేవౌఘముల్ ॥

(విచార్యించి) సాయనా! సారణా! మునుపే వాలిని సంహరించి తనసేనను వెనుకపాటునఁ జెనకువా రెవరు లేకుండఁ జేసుకొనియెంగదా! లెక్కింపరాని యుక్కుతునియలవంటి మర్కటసైన్యములకు నాయకుఁ డగుసుగ్రీవునకు యూపిరాడనీయని సాహాయ్యమునొనర్చి తనకత్యంత మిత్రునిగాఁ జేసికొనియెంగదా! తన కత్యావశ్యకుఁ డగుహనుమంతునిచే నిచటి యానుపానులన్నియు మూలముట్టుగ

నెఱిఁగికొన్నాఁడుగదా ! ఇఁక నాతఁడు దాఁడివెడలుట కిదిగాక మంచిసమయ మింకొకతఱి యుండునా?

సా: — నిజమే తాతయ్యా ! అదిఅంతియ. ఆత్మద్రవ్యామాత్యసంపన్ను లగువా రెప్పుడును జయసమృద్ధిఁ గలవారగుదు రనువాక్యమునకు నీదాశరథియగు రఘురాముఁడే ప్రథమోదాహరణముగనున్నాఁడు.

మా:—(మ్రాన్పాటునభినయించి)

ఉ॥ పెట్టనికోట వాలి పడఁ; బెంపఱినుండెడిమూకు, నంతకు
న్నిట్టము వార్థిసంవృతముఁ దేఱి నంగనురానిదుర్గమే
పట్టగునన్న ! లక్ష్యమ ? ప్రపంచవిలక్షణసద్గుణాఢ్యుఁ డౌ
జెట్టికి రామభద్రునకెప్పి ! శతయోజనవార్థి దాఁటుటల్ ?॥ 12

(వేడినిట్టూర్పుతో నింగిఁజూచుచు)

శా॥ రెంట న్నీస్తనయుగ్మదుగ్ధముల నార్తి న్ద్రావుచో నాలుగా
జంట ల్మస్తము లేద్చుచు న్గెలనల న్జాల్నాల్కల న్నాక వా
ల్గంటీ ! కేకసి ! పెంచి తీదృశగుణగ్రాము న్దశగ్రీవు ! నా
కంటఁన్నే డెది, వీరసూ ! భగవతీ ! కాంచంగనానోకదా !॥ 13

సా:—(డగ్గుత్తికతో) పాపము శమించుఁగాక ! శమించుఁగాక ! అమంగళము ప్రతిహతమగుఁగాక, ప్రతిహతమగుఁగాక ! బంధుహృదయము లెప్పుడు నాపదల శంకించుచునేయుండు నూఁజిడిల్లుఁ దూఁజిడిల్లుఁడు ! ఇదియునుంగాక,

గీ॥ బాహాపుపుటెల్లఁ గావడిబద్దలగుచు
గుణగణంబుల ప్రావు నెక్కుడుగ నిగుడఁ
బటుధురీణతఁ దాని రావణుఁడు మోయ
జాఱెనే రాజ్య మది దాని సాజమయగు॥ 14

మా:—(కన్నీటినాపుకొనుచు)

గీ॥ తెగి నశించెను నాభాగధేయ మింక
నాది యొకప్రజ్ఞ యని యెట్లనంగఁగలను ?
నీళ్ళు వదలంగ నొక్కఁడే న్మిగిలిన, నది
విశ్రవసు సత్తపోబలంబే యగుఁజుమి !॥ 15

శుకుఁడు:—(తెరఁజిమ్ముచుఁ దత్తరతోఁ బ్రవేశించి)

గీ॥ అలమహోదరు, ధూమ్రాక్షు నాప్రహస్తు
సచివవరుల, సేనానులఁ జక్కడంచి
వసుధ కప్యేకజలధిగాఁ బఱపి బిట్టు
ముట్టడించెను లంక రాముండు నేఁడు॥ 16

మా:—అనుకొననే యనుకొంటిమిగదా! అట్లే జరిగినది?

సా:—తెలియవలసిన విషయములెల్ల నద్దములోని ప్రతిబింబములవలెఁ బెద్దలబుద్ధికి దేశకాలభేదములులేక పట్టుచునే యుండునుగదా!

మా:—(వితర్కముతో మిన్నుఁజూచుచు) రామభద్రా! మంచిది! మంచిది! జయశీలురగువారికార్యసానుకూలత కదీర్ఘదర్శిత్వమే కదా ముఖ్యము!

సా:—శుకా! రాక్షసేంద్రుం డేమొనర్చుచుండెనో చెప్పవూ?

శు:—(దుఃఖస్మితమున) మిత్రమా! ఏమనిచెప్పను?

ఉ॥ చిత్తమునందు సీత కుచసీమలఁ బత్రము నుంచ నేర్చు పె
న్మత్తున రావణుం డమరిన న్వినవచ్చె సువేల రాముపై
రోత్తిడి, సంభ్రమానఁ గరయుగ్మములం దొకకొన్ని దూసెఁ బె
న్గత్తులఁ, గొన్ని మీటెను గుణంబులఁ దక్కిన వట్టి దిద్దఁగన్!॥

మా:-(ఊపిరిఁబుచ్చుకుని) అయ్యో! సారణకుమారా! ఇప్పుడుగూడ హృదయచంచలత్వము సడలఁగూడదా (శుకునితో) నాయనా! శుకా! పురద్వారముకడఁ గాపుంచఁబడిన శౌల్కికయూథాధిపతి నరాంతకుఁ డేమెంచెనో?

శు:—(నిశ్వసించి) ఆకుమారుఁడు ద్వారమర్యాదను జేయనేజేసెను. కాని అంగదునిచే (అర్ధోక్తిలోఁ దలవంచి కన్నీటితో నిల్చును.)

మా:—అయ్యో! బిడ్డా! దశగ్రీవకుమారా! ఇట్టివన్నియుం జూచుట కేకాఁబోలు నాకీచిరాయువు.

నేపథ్యమున-ఓహో! మహాపార్శ్వుఁడు మొదలగుసైనికులారా!

శా॥ జ్వాలాస్య జ్జనని న్మహాస్త్రమయి నాస్థ న్గొల్చి మర్దుం డిసీ!
గోలాంగూలపశు ల్కనందగునె మీకోలెమ్ములు, న్లక్ష్మణు

స్థూలందోఁ త్రియఁగ మేఘనాథుఁ డదె కైకొన్నాఁడు దీక్ష, స్తసి
న్వాలు నైకొనెఁ గుంభకర్ణుఁడు, భయంబా ! యింక నారాముచేఁ॥

సా:—(విని, సంతసమున) తాతా ! మనబలముల కిపుడు మంచియవ
లంబనము లభించినది. తనంతట మేల్కొనినకుంభకర్ణకుమారుఁడు.
మేఘనాథుం బురస్కరించుకొని శత్రువుల నెదుర్కొనుట కలిగెఁ
గదా !

మా:- (నిట్టూర్చి) జయింతుగాత రామలక్ష్మణుల కుంభకర్ణ మేఘ
నాదుల!

శు:- (వగపుతోఁ దనలో) అయ్యో ! అమంగళము శాంతమగుఁగాక
శాంతమగుగాక! కర్తృకర్మభేదము స్పష్టముకాకుండ పలికినాఁ
డేమిగతి?

మా:- (దుఃఖముతో) శుకసారణ కుమారులారా! ఈరాక్షసరాజ్య
లక్ష్మి కుంభకర్ణునిపై నాధారపడియున్నది నేఁడు.

గీ॥ అన్వయవ్యతిరేకంబులందు బలియుఁ
డెవరి నభిషేక మొనరించు నెఱుఁగరాదు
తనకు నగ్రజుఁడైనయీదశవదనునొ?
తన కనుజుఁడైన యావిభీషణునె యేమొ?॥ 19

(నేపథ్యమున)

ఉ॥ రావణు నాన ! యోకమకరాజ! భుజంగపతీ! భయంపడ
న్బోవకుఁడయ్య! యిప్డు పడఁబోనదు పెద్దభరంబు భూమిపై

శు — (సంతసమున) నిశ్చయముగ మనవా రెన్నడియో విశేషపరాక్రమ
మును జూపియుందురు

మా:— (అవధానమున చెవి యొగ్గును మరల నేపథ్యమున)
లావు కరాదు లొక్కొక టిలన్నడ, మిన్నల చొచ్చెఁ, దేలికై
మావరకుంభకర్ణు మెయిమాత్రమె యల్లన ధారుణింబడెఁ॥

మా:— అయ్యో! కుమారా! (మూర్ఛిల్లును)

శు సా - (కన్నీటితో) ఊఁడిల్లుఁ డూఁడిల్లుఁడు.

మా:—(తేఱి) కుమారులారా! రాముఁడు బ్రతికియుండఁగనే సీత యెప్పు డపహరింపఁబడెనో అప్పుడే యిట్లగునని దివ్యదృష్టి నెఱింగియుంటిని. ఇఁక నూఱడిల కేమున్నది?

సా:— ఛీ! యెంతకష్టము దాపురించెను! కుంభకర్ణుని యొడలు పడునను వార్త కూడ రావణప్రభునాజ్ఞయా?

మా:— వత్సా! సారణా! ఇట్టివంటిచో రావణునాజ్ఞయేమిటోయి! హాస్యపరులగునేకపులో రావణు నిల్లెత్తిపాడిచియుందురు

సా:— ఏమిటి! నీచత!

గీ॥ వీర్యముండిన నుండనీ!, చర్యయొకటి
గాదె లోకాన దానిప్రకర్షఁ దెలుపు,
సింహ మామేఘనాదు జయింప కపుడె
ఛీ! ప్రహాసవిభీషిక నేపథ్యసిద్ధి?॥ 21

(నేపథ్యమున:— ఓహో! సేనానాయకులారా! లంకాపట్టణప్రాకార తోరణములం ద్రెంపివేయుఁడు!)

శా॥ ఏదుష్టగ్రహ మడ్డుగా దొడరఁగా నిన్నాళ్లు నింద్రాయుధ
ప్రాదుర్భూతిని దేవసాయకసువర్షం బాగుట ల్కాలెనో!

మా:- (భయమున) అయ్యో! ఇప్పుడింకేమి వినవలసివచ్చునో! (చెవుల మూసికొనును)

మఱల నేపథ్యమున: —

ఆదర్శాంధుఁడు మేఘనాదుఁడు హతుండయ్యె న్నరాపూర్ణమా
నేదోయిప్పిని వీరయజ్వయగు నాయీలక్ష్మణస్వామిచేఁ॥ 22

మా:— సింధుగమునింగినఁ జలి లేదన్నట్లు దుఃఖాతిశయము దుఃఖమే కాదనుట నిశ్చయమే. దుఃప తెగునంతటి యిట్టియాఘాతమునఁగూడ నాయూపిరి యాఁగుట లేదే!

శు:— (స్థైర్యముఁజూచుచు) గగనచరుల విమానశ్రేణులచే దిశాగ్రభాగము లన్నియు నాక్రమింపఁబడుచున్నయవి. అణఁపరాని దారుణక్రోధానలముచే నిగిరిపోయిన దుఃఖసముద్రము గల రాక్షసేంద్రుఁడు దాశరథి జయముకోఱకు సన్నాహమొనరించుచున్నవాఁ డనుకొందును.

మా:- ( లేచి ) అటులయినచో ముసలితనమనుదుర్వ్యాలో మునిఁగిన నామొదలును సయితము గడిగికొన నస్త్రధారాతీర్థము దొరికినట్లే పద! (ఎల్లరు నిష్క్రమింతురు)

ఇది శుద్ధవిష్కంభము

(రంగము:- రణరంగముపైని యాకసమునఁ (బ్రవేశము-విమానములలో నిరువురు విద్యాధరులు హేమాంగద రత్నచూడులు)

ర:- ఆహా! ఎంతకాలమునకు మరల నిరాతంకముగా నాకసమున సంచ రింపఁగలుగుట సంభవించె!

ఉ॥ వాసవనందనోరసుమ భాసితతోరణ! రావణాంకవి
ద్యాసఖ! లంక ! దానఁ గను ! మంతట రథ్యలఁ బోరుఁజూచును
ల్లాసము మీఱు నీరసతుల న్గలకేళిరథాల నిండు ! నో
రా! సరినిండుతో దివియు రాజిలు దేవవిమానపంక్తులన్ ॥ 23

(వగచుచునబ్బురపడుచు) సఖా ! హేమాంగదా !

ఉ॥ ఏదదినీటఁగాక దివిజేశసహస్రదృగ్రసవారి నే
పూని నవాభిరామగతి నున్న పలాదపురోపకానన
శ్రీ నటుచూడు ! వైరిబలశేముషిపైని వితండవాదనా
స్థానముగాఁగఁ గ్రస్తనువై సన్యజయం బటనాడు డింభకుల్ ॥ 24

హే:-మిత్రమా! నిత్య చూడా ! ఏమంటివి ?

మ॥ దనుజేంద్రు ల్మనుజేంద్రు మాజ్ఞను పూల స్వర్భాను నిత్యాపద
న్మనుఁగన్జేసిరె భీమ విక్రమకళాసర్పార్తి స్వర్గవాసీరత
న్మనుఁ జేరావ ముసిం ? దిజ్జయమయుగ్రగంధాక్షరప్రాయలా
తనవేకన్నుల సింప్రమఁదే గెలువఁగసే ద్వారాన స్తంభాకృతిన్ ॥ 25

ర:-చెలికాడా ! చూడుము ! వినుము ! పౌలస్త్యపట్టణవీథులలో యుద్ధసన్నాహమునకై ప్రమోగించు ణదుందుభిధ్వనుల !

సీ॥ దిగ్దంతిదంతపుణాక్షికమయద్వారస్తంభ
తోరణాళి సరాలఁ దొడగువారు,
మనసురాధన్రనకే న్దనరెలే సిగళంబు
లని చెఱ న్బడుదుఃఖ మాఁగువారు,

పటునీరలక్ష్మీసంబంధంబుఁ బొందు కే
ళీసుహృద్గతిగ హాళిఁ గొనువారు,
మండోదరీబంధుమహిమ గర్వితదైత్య
వనితల గుణగౌరవములవారుఁ,

గీ॥ గలుగు రాక్షసవరగృహాంగణములందు
భయదదుందుభిశతకృతోద్భటనినాద
మన్నిరథ్యలనుండి పెల్లగుచు రేఁగ
నెంతవింతసంక్షోభ మందెగసె నరరె !? 26

సే:—(నవ్వి) నిజమేనోయ్ ! ఇప్పుడిచటనో !

మ॥ దనుజారణ్యముఁ గాల్ప రాముఁడె స్వయందావానలుండంచు వి
న్ననుఁ, బ్రేమాతిశయాన సీత నెపుడుం గాంక్షించునాత్మేశుఁ గ
న్నను, మండోదరి ముగ్ధయై గెలుపె యౌనా ! నాశమేయౌన ! యం
చు నెద స్పర్ధితో [illegible]చేతఁ గను మచ్చో నార్తి నెట్లున్నదో !॥

ఎ:—(జాలింగూడిన చింతనగవున) దేవతాసార్వభౌమునిపై గెలుపుం గానిన మగటిమిచే విలుచఁబడిన చిత్తము గలవృద్ధప్రపితామహుఁ డగుసుమేష్టిచే నామావశిష్టుఁ డైన యింద్రజిత్తునంతటివానిని కొడుకుంగాఁ బడసియు, దుఃఖభారహతిచేఁ జేష్టలఁదక్కియున్న దియ్యాను ! విరోధియే యనుకొనుము. అయినను నీయిట్టిపరిహాసము మిక్కిలి యనర్థముసుమా ! (ముందుఁ జూచుచు) మనకు దక్షిణముగ సనతిదూరమున నున్నయీజనసమూహ మేల రెండు పాయలుగ విడఁబడుచున్నదో ? (పరీక్షించి, భయకౌతుకములతో) మిత్రమా ! [illegible]చూడుము !

సీ॥ [illegible] నడుగడ్డునకు భారభీతిచే
ప్రోఁత నించించుక భూమి క్రుంగ॥
చంద్రహాసము దూయుసంరంభమున నొక్క
సారి యుర్వీకరా ల్చంక్రమించి
[illegible]కాశంబుగా నిగిడి దిక్చక్రవా
ళాంతరంబుల నెల్ల నాక్రమింప

గోత్రిధము న్గూత్రగత న్గరియు నిర్వాదికన్ను
లరుహోత్పలసరంబు నాకసంపుఁ
గీ॥ దోరణంబున నిడినట్లు తోఁపఁజేయ
జేవురించినపది మొగా ల్చ్ఛేవమించఁ
బగ మార్గోఁను బెడిదంపువడియు హెచ్చ
భయదగతి రావణుం డదే బయలు దేఱె॥ 28

హే:—(సదానించిచూచి) సఖుఁడా! ఇదివఱకు చూడఁబడినవాఁడే యైనను నవనవస్ఫూర్తిచే నతిభయంకరుఁడుగ నున్నాఁడుసుమా!

చ॥ మఱచితె! న్రజ మొక్కఁతుత్రిటి మాత్రమెగా మిసిమింతుఁజేసె నుప్పరము నుదగ్రనైజబలభాక్కఁగ గ్రమింగెడినీనిజొమ్మువై నొఱసి, సురేంద్రలక్ష్మిని భుజోగ్రవనంబున సంచరించుభీ కరకరిణి న్బొనర్పెఁడె! సఖా! యిప్పుడెట్లయినాఁడొ! చూచితే!॥

ర:—మిత్రమా! చెప్పుటకుసాధ్యమా! మహిమాఘ్యులం, దెల్ల నీరావణుఁడు మొనగాఁడుగదా!

మ॥ అనయం బిందుడ్రెఁడె కొల్వఁడే? అసుకరవ్యాజంబు లొకల్పపృక్షనికాయాభరణాళి నిత్య మిడుచున్; స్కందోవనేయోరుస న్మగుల న్నాటికొసంగుచు న్జలధి దీనత్వంబుతో వట్టిపో యినరశ్నోదధి దండభీతి నెమకండే మించుహొల్లాసలన్॥ 30

హే:—ఔరౌరా! ఈమహావీరుఁడు మాఱులేనిపోరుసంబరాన వనాయుజానేయంబులు దండధరుత త్తడి యగుమహిషంబునకుం జీదరంగొల్పు దీర్ఘహేషలతో రథము న్గడువడి లాఁగుకొని పర్వెత్తుచుండ ధరు ష్మాశియై యేతెంచెఁ జూచితే!

ర;— (భయవిస్మయములతో)

ను॥ ప్రకెటుూక్కన్వాలె మండనాస్యములు, ద్వంద్వం బిస్సి మర్త్యాళిన గ్గలమా నాకని యిబ్బరొహుణతల న్గర్వాన గన్గొంచు దివ్యులశౌర్యానకు మెచ్చుచు ల్లగుదశాస్యుం డాజిరంగంబు వైరుల నాత్మీయుల సంకులాస్త్రసమరికూత్రరంబుగాఁ జేసెడిన్॥ 31

హే;—(కౌతుకముతో) రత్నచూడా! అటు దక్షిణముగాఁ జూడుము!

ఉ॥ ఆన నగస్త్ర్యఁడీ స్వైఱుగ నాఁగుట గ్రొగ్గిటె యైనవింధ్యనె
త్తాని శిఖాళి సేతుసుపథంబునకు న్దగవంట నొండుచో
వానిని వైచుఁ గ్రోఁతిగమి, వచ్చుదశాననుఁ జూచుకౌతుకం
బూని, ద్రుతాన డగ్గఱి, సముద్గతభీతిఁ బలాయనించెడిన్ ॥ 32

ర:—(చూచి, హర్షముతో) అదియేమంత విడ్డూర మిటుకనుము !

శా॥ రక్షస్సైన్యముపైనిఁ జందనతరుగ్రామంబుల న్వానరు
ల్లక్ష న్దందడిసేయఁ దద్గతమహోగ్రవ్యాళరాజంబు లా
పక్షంబం దురగాస్త్రభూతభుజగప్రాయంబులై కిన్కతో
దీక్ష న్దానవదేహయష్టులను బంధించు న్మటాత్పాత్కృతిన్॥ 33

హే:—ఇచట నింకొకవింత !

చ॥ వలచితి ని న్నటంచు బలవంత మొనర్చు నరాదుపూన్కికి
న్దొలఁగి సుమప్రపూర మగుదోయిలిఁ జిమ్మెదు వానిపై నిలిం
పలలన, యౌర! వానరులు వైచినవృక్షహతి న్గతించు దై
త్యులపయిఁ దత్సుమప్రతతు లుంచుచుఁ గౌగిలి గౌరవించెడిన్॥ 34

ర:—(తడవు పరికించి)

చ॥ తమతనుదీప్తిచేఁ బవలు తద్దయు దీర్ఘ మొనర్చు వానరో
త్తములను నీలరాక్షసవితాన మకాండతమస్వినీసమా
క్రమణ మన న్బడ ప్రబలకప్యనలోపరి దైత్యధూమచం
క్రమణవిజృంభణం బనఁగ రాజుచునున్నది చూడు మద్దెసన్ !॥ 35

హే:—(నగుచు) మిత్రమా !

శా॥ చెక్కుల్ శస్త్రములయ్యె నీకపికులశ్రేష్ఠు ల్పొరిం గూర్చు ని
క్కట్లు న్గెల్వ నశక్య, మట్లుకను ! మాకాశాంతరా లన్నపె
ల్లట్లు న్గన్గొత్తదైత్యు లుర్విఁబడఁ నిండంజేయఁగా లేక న
ట్టట్లు న్బర్విచు నాఁ దశాననుని మాద్యత్కీర్తిసందోహముల్॥ 36

ర:—(సంభ్రమముతో) అయ్యయో ! అట నెంతదారుణస్థితి దాప
రించినది !

ఉ॥ క్రొవ్విడి దాలుపే విసరుకొండల దైత్యులు పిండిఁజేయ సం
పాతిలుచిన్న నుల్కలక్రమంపు దశాస్యరుషాట్టహాసవి

ద్యోతితవహ్నులో మెఱపుత్రోవ నిగుడ్చుశరాళి రావణా
ఖ్యాతపయోద మంథతమ మంతట నించుచు దాఁటె నింగికిన్॥ 37

హే:—(క్షణమునిదానించి, చూచి) ఓహో! క్షుద్రులనేకులు కలిసినచో నెంతటిఘటకునైన వంతలన్బాల్పఁజాలు టొకవింతకాదు. ఎందులకనిన వినుము!

ఉ॥ దర్పపుదిక్కుటేనుఁగు మదంపుఁబ్రవృష్టి కవగ్రహంబులై
యేర్పడు కన్నుతారకల నిట్టటుత్రిప్పుచు దిగ్విదిక్కులఁ గ
న్నార్పక, అఱ్ఱుసాచుచు దశాస్యుఁడు కన్గొన, సేతుసృష్టికి
న్గార్పనికొండలూని ప్లవగుల్వడిదాఁటెద రుత్తరాశకున్॥ 38

శ:—(విషాదమున) అమ్మో! కఠినతర మైనయాపదయే వాటిల్లునట్టులున్నది! దయారహితము లగుకృపాణములచేఁ బగతురరొమ్ములు పగిలి నెత్తురులు ప్రవహించునపుడెల్ల సంతోషాతిశయంబున బులకించుచుండు కపోలపాళితోఁ దమదెబ్బలచే నెఱతెగక వడిపోవువిరోధిసైనికుల నెత్తురుటేర్లచే నపారముగఁ బెరుగు వీరపానగోష్ఠీమహోత్సవమున నెల్లెడం దామయై యీరక్కసు లెల్లు ప్లవంగసేనాధిపతుల మీఁదికిం దుముకుచున్నారో!

హే:— (ఆనందమున) మిత్రమా! దుఃఖ మిం కేటికోయి! ఇదిగో!

గీ॥ అల్లదశకంఠు శరపీడ కాఁగలేక
తోఁకలాడించుచు న్బారిపోక నెన్ను
కపుల నోదార్చి ధైర్యంబుఁ గఱపి వైరి
నెదురుచున్నాఁడులే! వాన రేశ్వరుండు॥ 39

క:— (చూచి, హాసఖేదాద్భుతముగ)

ఉ॥ ఏసెను గొప్పచెట్టుఁ బ్లవగేశ్వరుఁ డస్త్రముగా, దశాస్యవ
క్షోజసమపీఠిఁ దాఁకె నది, మాపెను జూపడి చిచ్చునం దదే
మాసె; నయారె! పెద్దగిరి మంటెన వానరనాథుఁ డేయ రా
కాసులరేఁడు వేఁటఁబిసుకన్ దనసీటనె పిండమై చెడెన్॥ 40

హే:— (నవ్వి) సఖుఁడా! దశకంధరునంతవాని కిది యొక గొప్పపనియా?

శా॥ ఆకైలాసమునే యెట న్ధరణి కేఁచుంబైన లేకుండఁ బె
న్వ్రేఁక న్బ్రేఁకఁడె మున్ను రావణుఁడు! తద్వ్యచ్ఛిత్తినే కాదొకో

శ్రీకంఠుండటఁ దాండవించుటకుఁ గా ల్చిందించి చిందించ కే
రేకెత్తు జ్జలనంబు లన్యగిరులక్ రెట్టించు న్మదేకత౯ ॥ 41
క్రౌంచెము విచారించినచో

సీ॥ కపివరుఁడు శస్త్రముగ నేయుకడిఁదిచెట్టు
పడియె బిసకాండమృదుత రావణునురానఁ
దద్గతసుమాళి నాసుమధన్వి పెలుచ
మోదె సీతావియోగప్రముగ్ధు నతని॥ 42

ం:— (నవ్వి) సఖుఁడా! రావణుంగురించి కొల వేమిచెప్పఁగలము? మహాసత్వసమేతుఁడుసుమా!

ఉ॥ వేల్చిన యాత్మశీర్షములు పేలి వెలిన్బడ దేలుమోముల
న్బ్రోల్చిన దేవతాలిపిని మున్నె యెఱుంగఁడె రాముగాధ?, లోఁ
దాల్చెనె భీతి! హెచ్చుతమి ధాతను గొల్చెనెకాని; వీరుల
న్గెల్చినయట్టి వీరవరు గిట్ట కెదుర్కొనువాఁ డెవం డిలన్? 43

మిత్రమా! అటు చూడుము! చూడుము! భయానక మైనయద్భుత విషయము!

సీ॥ విశిఖతతిచేతఁ గొండలు పిండిగాఁగఁ
దోమరాదులచేఁ దరు లుత్తునీఁగిపడగ
రజనిచరనాథునకు కపిరాజునకును
చేఁజఱచు సంకులమహాజి చెలఁగెఁ బోలిగ॥

ఇదిగో:

చ॥ కపిపతిపాదఘట్టనల ఘాతల నూపిరియాడమి న్గళం
బు పెలుచనుబ్బ హారమణిపుంజము త్రెస్సి పడ న్ఫణాళి ర
త్నపతనభీతిచే భుజగనాథుఁడు, కర్ణము లుండమి న్నిరా
ల్నిపుణతమైఁ గదించి ధరణి న్దల లన్నియువంగ మోసెడి౯॥

న:— (విషాదముతో) అరరే! బాహుయంత్రముచే సుగ్రీవుం బీడిఁ దశగ్రీవుం డేమోయనుచున్నాఁడు.

సీ॥ ఓరిశాఖామృగుఁడ! నీనియుద్ధగతుల
మిగుల డస్సితికాఁబోలు వగవఁబోకు?

దొరకుటే! నాదుభుజవనాందోళమందు
సులభముగ నీకుఁ దగుమేలుఁ గొలువుఫలము॥ 46

ర:— (హర్షముతో) మిత్రమా! ఉపాయములమెలకువమేలిమిచే దనను దా వదిలించుకొని వగతుని యెత్తిపోడుపులచే నులుకుఁగొను హృదయముతో వానరేంద్రుఁడు హృదయంగమ మగునుత్తరము నే యిచ్చువినుము!

ఉ॥ పట్టదశంబుఁ గోయఁబడి ప్రౌఢకరంబు లెసంగియు న్దల
ల్గొట్టి తొకొక్కటే, కొసకుఁ గొట్టవుగా తుదిదాని!, నిప్పుడే
న్బట్టి పదింటి నాదుపదివాఁడినఖంబుల నొక్కుమాఱుగా
నెట్టనఁ ద్రుంతు!, నేనుసుఖనే యెవుడే, న్దడవంగ నేలరా?॥ 47

అదియునుంగాక, ఓరీ! రాక్షస!

గీ॥ రావణవధాంత మహాప్రకరణమునందు
సూత్రధారుఁడు రాఘవసూనుఁ డైనఁ
బారిపార్శ్వకుఁడను నేనెలేర! సుఫల
బీజభావుకామృతభుజప్రీతి కిదిర!॥ 48

ఇటులు దానవునంతిరంగం బుచ్చిపోనాడి యొక్కయెగురున నిర్గమించి రావణశిరంబు లదర బోడువ రథధ్వజదండంబు నూఁతగొని దశవదనుం డెట్టకేలకు న్దేఱుకొనుచున్నాఁడు

హే:-(అంతటంగలయంగని యానందమున) నెచ్చెలీ! ఈచుట్టు జూడుము!

ఉ॥ కల్పసుమాళి రావణునికైఁ జనఁ జిక్కినవాని మాలగా
సల్పి దశాస్యకీర్తి మును చాటుగ సింధుసిగ న్బిగించునా
వేల్పులమాల కార్లసుహీరు దొసంగుల కాదిసూచిగాఁ
గొల్పు తలంటుచే భయముక్రుంగ విమానపథాళిఁ గెరెడిన్॥ 49

(విషాదముతో) తేఱుకొను నదశకంఠునిచేఁ గొట్టంబడి మూర్ఛిలినసుగ్రీవుని హనుమంతుఁడు నిలుఁడునోదార్పుమాటలతో వేఱొకచోటికిం గొంపోవుచున్నారు!

ర:—చెలికాఁడా! యుద్ధమందునతొలి తాఁకున మహావీరు లనేకపర్యాయము లోడుచుందురు, గెలుచుచుందురు. ఆమాత్రమునకుఁ జింత యేల?

హే:—(ఇంకొకచోఁబరికించి) నీయదృష్టము నీకుఁ బెంపునే చేకూర్చుచున్నది. ఇపు డిట కెవరు వచ్చుచున్నా రనుకొంమవు ?

మ॥ ధృతిమైఁ గౌశికుఁగొల్చి నేర్చుకొనియె న్దివ్యాస్త్రమంత్రంబుల,
స్మృతిమై భార్గవుతోడ డీకొనియెఁ బోర, స్వైరభోగీణబా
హుతతి న్బానుకులైక కేతు వగుచు న్యోధస్తుతుం డైనవాఁ
డతికౌతూహలియౌచు విల్గొనినవాఁడై రామభద్రుం డదే !॥ 50

ర:—(సంతసమున రాముంజూచి రావణునుద్దేశించి) అహో ! రాక్షసరాజ !

ఉ॥ బాలుఁడుగాఁ ద్రిశూలివిలు భగ్న మొనర్చె. భుజోష్మఁ జెమ్మట
న్దోలి మనోహరార్జవము దూటిచె భార్గవమహాని, కిప్పు డి
య్యాలమునందుఁ జారసిలె నన్యము లెయ్యవిమాని నిన్ను న
వ్వాలిసమానుగాఁ గెడప ! వహ్వారె ! యెంతటిధన్యజీవినో !॥ 51

హే:—(కౌతుకమున) నెచ్చెలీ ! కొంచెము నిశ్శబ్దముగ నుండుము ! రావణుఁ డేమనునో విందము.

ర:—(చెవియొగ్గి) ఏమియిది ? రావణుం డిట్లుపలుకుచున్నాఁడు ? "ఓరీ ! క్షత్రియబాలకా ! బాగు ! బాగు !

చ॥ హరగిరి నెత్తి దింపిన బలాఢ్యున కాముదివి ల్లదెంత ? శం
కరునరభక్తి సీతపయిన న్గలభ్రాంతియు పీడి మాఁసితి
న్విటుని; నికెంతకాలమొ యుపేక్ష నిను న్క్షమఁ గావఁబోవు ది
క్కరిమదవారకాస్మదురుకాండశిఖ ! ల్కను నీపస న్దురిటికా। 52

హే:—(విస్మయముతో) ఔరా ! త్రిజగంబులనేని గడ్డిపఱకగఁ జూచు వీనిదుర్మహంభావాధిక్య మిప్పటికిఁ గూడ నశ్లేయున్నదిమ్మె !

ర:—(విస్మయమున) చెలికాఁడా ! ఇంతమాత్రమునకే నీవు విస్మయము నొందుచున్నాఁడవా ?

చ॥ ఒకతలమాత్రమే మిగిలియుండినవీనికి నర్ధనారిగా
సకలముకంచు శంకరుఁడె నిల్చిన, వీనిమదంబుచావ, గౌ
రికనయ మున్నకా ల్విడిచి హ్రీగొన కుబ్బున దక్షిణంపుఁగా
లొకటికై పండమిా న్పడఁడెటోయి ! హరుండును వింతఁ జూడఁగన్॥

(పైకిఁజూచివితర్కముతో) ఔరా! భగవానుఁడగువాసవుని తేరు వలెనున్నది! దాశరథిం దఱియుచున్నది!

హే:—(చూచి, సంబరమున) నెచ్చెలీ! నిజముగా నదియే నోయీ యిది! చూడుము! ఇంద్రుడు వేగన్నులకు నగపడున ట్లమర్చఁబడిన రంధ్రములే నెమలిపురికన్నులుగ నగపడఁ జేయుకవచముతో నతఁడే మాతలి! (కొంచె మభివర్ణనాదృష్టి నరసి)

శా॥ పైనఁ ద్ర్యక్షులఁ దేరుచప్పరమున స్సబద్ధంబు లౌ వాల్పుర
త్నానేకంబుల యున్కి వేతరబడి న్వ్యాపించు బింబాళి నా
లోన న్దోఁచెడి నింద్రుని ల్లుచిత మాలోచించి మేఘాస్ఫూర్తి నౌ
రా! నిండుంబసఁ జూపె వజ్రి. కసిమర్యాదల్విజృంభింప గన్॥ 54

(చెవియొగ్గి) రావణప్రతీహారికాఁబోలు నెద్దియో యనుచున్న వాఁడు? "ఓరీ! ఇంద్రసారథీ!

శా॥ ఆదేవాసురసైన్యబాహుళికరవ్యాప్తోరుకంపానిమం
బీదైత్యేంద్రభిషక్కు పెల్లడఁచునాఁడే నీపనిం బట్టమిన్
న్నీదర్పంబట రా! యిదెల్లఁ? దొడఁగు న్నే రైచుచున్నాఁడ, న
బ్బో! దీనార్భకుఁ జెప్పి? ద్రోహీ! గతులేమో యింకనీస్వామికిన్॥

ర:—(వినుటనభినయించి) రామభద్రుఁ డేమియనునో? (వి.గా.)వింటివా? "యథారాజా తథాప్రజాః" అనులోకోక్తి నిజమేసుమా! కావుననే తమతస్స మూలచ్ఛేదనముల నొనర్చుదుర్ణయములఁ బొగడుకొనుచు దుర్వినీతు లగుచున్నారు.

హే:—రావణుఁ డేమిచెప్పునో దీనికి? (సింగికేసినుండి దిప్పి) "ఓరీ! అరణ్యముల నుండుతాపసబాలుఁడవు. నీ కేమి తెలియును రా సమానయములు?

ఉ॥ ఓపనవానికోప మఘరోష్టము చే టనువట్లు నాస ఋ
ష్టేపిసయింద్రుతాపసము చిందెను వేఁగనులాన్చుహ్రస్వలన్,
ఓపి త్రిలోక జేతలయియుండి నయాపన మాళి దిక్షతెన్
బ్రోచి పగునామదీయభుజపంజర ముండ నసాధ్య ముప్పదే?॥ 56

ర:—(నగుచుచెవియొగ్గి) రామభద్రుప్రతివచన మదిగో! "ఓరీ! రాక్షసీపుత్రా!

మ॥ భుజశక్తి న్ననుముజ్జగంబుసిరి యొప్ప న్నీకెవ్వా నంటయే
నిజమైన న్నివు నేల కొట్టినతల ల్నివట్లుయాచించితో ?
అజపౌత్రప్రభవుండవే ! సృజనఁజేయన్నేరవే ? యిప్పుడా
భుజసంఘంబె యొసంగునంటివి యగుంబో తెల్ల మావీర్యముల్॥ 57

సీ:—(వినునట్లుండి) రావణుఁ డేమనునో! "ఓసీ! రాచనిసుఁగా! నీముత్తాత యగునరణ్యునకు మున్ను తెల్లము కానేమైనది. నీకి ప్పుడు బహుళముగాఁ దెలియఁగలదు!॥

ర:—(వినినగుచు)ఎట్లుండునో రామభద్రు ప్రతివచనము! విను మదిగో!

ఉ॥ ఈవనరణ్యు నాజి వధియించితి వంటకుఁ జింతలేదు, యు
ద్ధావని గెల్వఁజాలు మగలం దవమానమె ? దానికేమి ? ము
న్లావున హైహయుండు నిగళంబుల ని న్గొనుంప హీనభి
క్షావిధిగాఁ బులస్త్యుఁ డడుగ న్గనుట ల్వ్యథ బిట్టుకూర్చెడిన్॥ 58

సీ:—(విని) రావణుప్రత్యుత్తర మెట్లో? "ఏమిరా! క్షత్త్రియ వటువా ? వాఁగుబోతా ! ఏమినీయపూర్వశిల్పము ? రాక్షసేంద్రుని చరిత్రచంద్రమండలముననే మలినముల నైక్కెదవా ? ఇంక నీవుం డవు!" (సంభ్రమమునఁజూచి) అరరే! మందోదరీభర్త అప్పుడే మొదలుపెట్టనేపెట్టినాఁడు శరసహస్రప్రయోగమున దినము ద్దినంబు నొనర్చుట.

ర:—మిథిలాకుమారీభర్తయుఁ బ్రతిప్రయోగముల సాగించినాఁడులే
(నవ్వి)

గీ॥ రామభద్రుండు పనుపుశరములవలన
నరకఁబడినట్టి రావణునారసముల
ములుకు లున్నముందటిసగా ల్బ్రొందుపడఁగఁ
గెడఁదయిఁ గెలసగము లావెనుకరాలు॥ 59

మఱియు,

క॥ క్షమనాసులు నైంహాల
స్వాలుగపలపైని, నూతనరుపై, మఱియు
స్వసనంబులపై విడువని
తెఱుచున రఘువంశవరు పత్త్రము లాడున్॥ 60

హే:—(భయమున) అయ్యయ్యో!

ఆ॥ మిన్ను నెల్ల నాక్రమించి చీఁకటిఁగూర్చు
రావణీయపటుశరప్రవృష్టి
రాముఁ డెక్కియున్న రథరాజ మైందఱిమ్ము
పొడయె కానరాక మునిఁగిపోయె!॥ 61

(చాలసేపుచూచివిస్మయమున) మిత్రమా!

గీ॥ బహువిధము లగు బాణపరిపంచములను
బహువిధవిశేషబాణప్రపంచగరిమ
వీరు ప్రతిహతిఁ గూర్చుచున్నారు పోర
హెచ్చుఁ గుం దొక్కయింత యెందేని లేక॥ 62

ర:—సఖా! సత్యమే! కాని,

క॥ ఇరువదిచేతుల రాత్రిం
చరుకృతి నిరుచేత రామచంద్రుఁ డొనర్చున్
సరి యని సగటున దోఁచిన
నరవరుపనితనము దశగుణం బనవలదే!॥ 63

హే:—(నవ్వి) నెచ్చెలీ!

క॥ ఇరువదిచేతులతో నీ
యిరుచేతులబాలు నరుని నెదిరెనయేనిన్
నరభోజనుఁ డగుదశకం
ధరుఁడు తొలగనట్టివాఁడె ద్వంద్వాజి మితిన్॥ 64

(దుఃఖభయముల)

గీ॥ కడిఁదిచేవలఁ దెక్కొపుస్తడను వెలయు
లాంఛన మ్మగుమాయూరసింఛ మింద్రు
నరదముననుండి యర్ధచంద్రాంబకమునఁ
బటుమదోద్వేగరావణుం డెటుల నఱికె!॥ 65

ర:—(సంతసమున) సఖుఁడా! కనుము! కనుము! రామభద్రురణకేళి!

మ॥ పడెనే కేతన మన్నలజ్జ రుమఁ బెంపంగా విజృంభించు రా
ముఁడె కెల్పొందుట నిక్కమంచు దిగిభంబు ల్పెన్నదాసారము

ల్జడిఁ గూర్ప, న్సురభించు వాయువులు రెచ్చంగా, శచీబాష్పము
ల్పుడుఁగ, న్దైత్యులజ, న్దదీశుతలకావు ల్పుంగ, నేసెన్సెలల్॥ 66

హే:—(ఖేదాద్భుతమున) కిరీటపతనావమానము నోర్వలేని రాక్షసరా
జెట్లు కుంభీపాతముగా శరవృష్టిం గురియుచున్నాఁడో !

క॥ అగ కే ! తొలుతటిజన్మక
బరిచితమై సీతబిగువుపాలిండ్లకు ని
బ్బానైనసాక్షి కౌస్తుభ
మొఱసెడి రఘురాము నెదనె యొకతూపు పడెన్॥ 67

(చక్కఁగఁజూచి ఖేదమున)

ఉ॥ ఎవ్వరినామమే జగతి నెల్లప్రణాంబులఁ దీర్చఁజాలునో
యువ్వనువంశ్యు రామునుర, మద్దిర ! నాటిన దొక్కశాణమే
జ్జివ్వన వేయిగాయములఁ జిమ్మెడి రక్తము ! లిందువర్మమం
దన్వెడవేయితూటుల, దశాననుశస్త్రవిశేష మట్లనన్॥ 68

ర:—(సంబరమున) రాఘువుపనితన మేమియనదా ! కనుము !

చ॥ పరమపవిత్ర సీతకుచపత్రము మాయఁ గవుంగిలింపఁ ద
త్తఱపడు పాపి రావణునెద న్మను పింద్రగజంబు దంతము
లొప్పఁబడ నాల్గుగాయలుగఁ జొప్పడుగుర్తుల మధ్యమందుఁ గ
చ్చి రఘురాముబాణము పసందుగఁ దూఱెఁ గనుంగొనన్గదే !॥

హే:—(చెవిగఱుగ్గి విస్మయమున) ఎడమపదిచేతులలో నొకదానితోడనే
వచ్చరముం బెఱికివైచి రావణుఁ డేమియో యనుచున్నాఁడు !
"ఓకీ ! మనుజపోతవరా ! బాగు ! బాగు !

తె॥ దానవాసనవిద్యకుఁ
దానటర ! గమూ ప్తిలిపి సుదర్శన ? మదియే
యీగాన పక్షమునఁ దూసఁగి
నానాట్యశిరోభూషణం బయ్యెఁజుమీ ! 70

అట్టి నావక్షస్స్థమంగూడ నెత్తుటఁ గాఱఁజేసిన నీచేతి మఱుకు
సురాసురశిక్ష్యముల మించినది.

ర—అహాహా ! విరోధి వాక్యముల బయలగుచున్న గర్వాతిశయముచే
మిక్కిలికోపమెక్కి,

క॥ ఘనచంద్రహాసమే చే
సినపరిణముల కిణములన్ హసించెడి హారా
ళిని రావణగళముల రా
మునిమార్గణగణము లొక్క మొగిఁ బడుఁ గనవే!॥

హే:—(చమత్కృతిగ) నెచ్చెలీ! చూడుము! సరిజోడైనవానితో యుద్ధము లభించెఁగదాయని రెట్టించిన మదోద్రేకమునఁ ద్రిభువనముల సంక్షోభింపఁజేయు దశగ్రీవునిచే నిరంతరాయముగఁ బ్రయోగింపఁబడు శరజాలంబులే పంజరముగ నెలయ రామభద్రుఁ డంటి సెంపుడుచిలుకవలె నైనాఁడు.

మ॥ భుజకేళీ న్వడిదాఁటు రావణు పదప్రోద్ఘాతల న్గ్రింగి లే
చు జగచ్చాలన మాళిరత్నములరోచు ల్మార్పుచందంబులై
నిజ మానాగధరక్ క్షణంబె తమము న్జెండ న్మణులుంగున్గొనక్
బ్రజ లార్తింబడ రోజచుండవలయు న్వాతాళ శేషేంద్రుఁడుక్॥ 7

ర:—(భయముతో నరసి) నెయ్యుఁడా! అది యట్లుండ పరికించుచున్న యెడ

చ॥ అసురుని దాఁట్లపెన్నకుల కబ్జిజలం బెగయంగఁ దోఁచుపె
న్మొసళుల నీటిమేనుఁగులఁ బోఁగ దిక్కరు లేగ భూధరం
బుసకల మొక్క శేషుపయి మ్రొగ్గిన గుజ్జగునంగ యష్టిచే
ముసరువళు, ల్ఫణాళిపస బోఁ బెనులావయి మోసెడి న్ధరక్॥ 7

(పైకిఁజూచి) విమానము లివనటుం బర్వెత్తుచున్న వెంద వలననో!

హే:—(చమత్కారసహితముగ) అహో! మహావీరుల ద్వంద్వయుద్ధము త్రిభువనభయంకరముగఁ దేలుచున్నయది!

గీ॥ అహహ! కౌశికదత్తదివ్యాస్త్రవిద్య
ధ్యాన మొనరించుచున్నాఁడు తరణికులుఁడు
దేవతారాతి బ్రహ్మోపదిష్టమైన
శస్త్రవిద్యను గోరెడి జ్ఞప్తిఁ గోనఁగ॥ 7

కావున, మనమును దఱిఁజేరుకొందము! (అంతటంజూచి) మిత్రమా! సకలభువనసంక్షోభ మగునట్లున్నది. రామరావణుల సంకులసమర మెటు సందీక సాగుచునదియో కనుఁగొనుము

చీఁకటియలుగు, సూర్యాస్త్రమునఁ జెడ, సూర్యాస్త్రము రాహవీ యాంబకమున, నియ్యది వైష్ణవసాయకమునను, వైష్ణవంబు పౌష్పకేతమున, నియ్యది పాశుపతమున, ని ట్లాయాయస్త్రంబులు నాయా యస్త్రములచేఁ బ్రతిహతంబు లగుచున్నయవి.

వి:—నేస్తుఁడా! ప్రయోగింపుటలో నుపసంహరించుకొనుటలోఁగూడ హెచ్చులొచ్చులు గమనింపఁబడఁజాలకున్నయవి. రాముఁడో గెలువవలయు ననుపట్టుదలతోడనే ప్రయోగించుచున్నాఁడుగదా! అటు రావణుండో రాముం బిలుకుమార్చు తెగువతోడనే విసరుటగపడుచున్నదిగదా! కాని, యుభయాస్త్రాధిష్ఠాన దేవతలలో నీయుత్క్రోషములు కనుపించుటలేదే!

గీ॥ రావణశరాధిదైవము ప్రాముపైని
స్నేహభరమున మృదురీతిఁ జేరుచుండ
రామభద్రాస్త్రదేవత ప్రాక్షసేంద్రు
భీతిచే నల్లన స్సమీపించు నతని!॥ 75

(తెరలో)

చ॥ ఒకతలఁ గోయ దాసప్రభ లున్నశిరంబులఁ జేయుచున్న వా
క్కొక చెయిఁ గోయఁ దద్రక్షిమ మున్నకరంబులఁ జేయుచున్నదో
పిక స్వమునందనుం డిటులు బిట్టు శిరాలుఁ గరాలుఁ దెంచుచో
నికఁ దెగకున్న వే మొదటియేపును ముంచి పరాక్రమించెడిన్। 76

ఇరువురు:—(సంతోషరోమాంచము లడర విని) అహో! ఇట్టి శబ్దజ్ఞాన ప్రవర్తకముచే నెవరయా సకలలోకశ్రోత్రానందంబు సమకూర్చు పుణ్యాత్ములు? (తెరలో) కలకలము.

ఇరువురు:—(భయోద్భ్రాంతములతో) అమ్మయ్యో! ఏమి యీప్రచండ ధ్వని? మాయానారసింహం దైనవారాయణదేవు కఠినకంఠకాహల కోలాహలముతోఁ దుల్యమై యిట్టి యకాలముననే బ్రహ్మాండ భాండమునే పటాపంచలుగఁ బగల్చునట్లు పొడముచున్నది!

ఉ॥ ఉగ్రహలాహలానలము నొండొకమాఱు గ్రసించి యుద్ధతిన్
వ్యగ్రమహోగ్రవృత్తిఁ గొను భైరవమూర్తి యజాండభాండస

మ్యగ్రటసస్ఫురత్కహాకహార్భటియా? యని బ్రహ్మేకచ్ఛనో
బ్రాగ్రముసన్ గ్రమక్రమవినిర్గతరావము లేగె నెద్దియో! 77
(తెరలో)

మ॥ అహిమార్త్యామరలోకభీకరుఁ దివ్యాస్త్రాళిఁ బోర్గొల్పి శా
ణహతి న్దైర్సి నభంబుఁ జొచ్చు తిలల స్నవ్యార్క లేకాదశ
స్ఫురహం జేర్పు న్వరయోగపీఠక సమాకృష్టాజదివ్యాస్త్రస
న్నహ నైష్ఠ్యాకుఁడు శ్రీయ రావణకఠంఠం బాటిచెయ్యన్బడెన్॥

ఇరువురు:—(సంతోషసంభ్రమములై చూచి విస్మయముతో)

ర:—సంగడీఁడా! కనుము! కనుము! ప్రపంచమంతయు సంతరించు సమయమందలి భయంకరప్రళయాగ్నిహోత్రజ్వాలాకలాపమట్లు పింజరితము లసురావతలలు!

హే:—(త్వరతో సమీపించి క్రిందికిఁజూచి జాలితోఁ గూడినవిషాదాద్భుతములతో) అక్కటా! మహావీరుండ వగునోలంకేశ్వరా! కడతేఱితివా!

శా॥ మత్తైరావణనాగకుంభతలము ల్మర్దించు దోఁ జిందు మే
లుమ్మత్తంబు ల్గాని పెక్కులోకవిజయుంబు ల్గావ్యము ల్గూర్పవే!
సత్తి న్మించుభుజాళి నాకనలినాస్యాగండకాశ్మీరప
త్రాళిత్రశ్రీల హరింపవే! యనితె! యంత్యం బందు మన్మన్నతిన్॥
(ఎన్నికతోఁజూచి) మిత్రమా! రత్నచూడా!

మ॥ కడుఁ బర్వాదశకం మొండె మఱిమొగ్గి న్దానిభారాన కే
నడుమ న్దోప్పగ నేలగ్రుంగఁగఁ గ్రిమాన ల్లుట్టుగ ట్టెంతోప్పై
కొడయ న్జూడుమి! యర్థకుండలిత దేహుం డొచు శేషుండు వే
పడగ ల్నిక్కఁగఁజేసి తోపెత్తిసఁగ భూభాండం బెటు ల్మోయునో!

ర:—నెయ్యుఁడా! ఈరావణుని శరీర మొక్కటేకాదోయి యిట్లతిశయమైనవి వానిచేష్టలన్నియు నంతియ తెలియదా!

మ॥ మను లోకా ల్గెలువ న్బయల్వెడలు నిమ్మార్గమ్ము వాడాహతిన్
బెనుకొండ ల్బలియింప నమ్మొదలిరా ల్బిట్టొండాఁ బుం దాఁకిమోత్రి
సిన సద్దీనుస్వహితారత్నములతో, సిబ్బందిక్షితిన్ బెనం
గినమేన్గంబులతో నహీంద్రుఁడు ధరన్ గ్లేశంబుతో మోయఁడే॥ 81

ఇప్పుడు; ప్రాణములుగూడఁ బోవుటచే మిగులబరువెక్కిన రావణుని బొందికట్టె నిజముగా ఘోయశక్యముకాని దే.

హే:— (ఇంకొకవైపు దృష్టిసారించి) అబ్బా! శోకవైక్లబ్యముతో, దశకంఠుకబంధము దెసకు వచ్చుమందోదరిని రాక్షసవనిత లెట్లువలికింగొంపోవుచున్నారో' (నింగికివీనిడి) ఎంతకష్ట మెంతకష్టము! చపలులగు కోతిమూఁకలు కొంటెతనాన వెక్కిరింపఁ గరుణాకాకుస్వరంబునఁగాతరభావంబు గడలెక్క నేడ్చుచు నేమియోఁయనుచున్నది, యీమహావీరాగ్రణి యగురావణుని పట్టమహిషి యగువరవర్ణిని!

శా॥ ఓలంకేశ! సతీత్వభంగ మెదిలే కోనాథ! ఆప్యాయతన్
నీలావణ్యావుమోముల న్బదిటి నేనే ముద్దుల న్దేల్పఁ బె
న్బాళి న్నికరవింశతి న్బొదువుచు "న్నాగాస్యకుంభస్థము
ల్త్రాళు ల్నీ కొకపేట" నావె? నిదురా! ఆముద్దుఁ జెల్లింపవా!॥ 82

ర:— (దుఃఖమున) మిత్రమా! ఇది కనుటకు వినుటకైన దుర్భరమయ్యెడి. విరోధులయందైన నత్యంతదుఃఖముఁగూడ హృదయమర్మము లూఁటక ప్రీలకుండునా! (వితర్కమున) అయ్యో! కాలునకుఁ జేయలేనిది యని యొక్కటేనిఁగలదా?

గీ॥ పూజ లిడఁదగువేల్పుగుంపులను గలిసి
బందిఁ బడినమందారాల ప్రసవతతుల
నుబుసు మకరంద మల్లమందోదరీప
దముల దువ్వాలతోడఁ గర్దమముగాదె!॥

అట్టిమందోదరికిం గూడ నిట్టిదశపట్టవలయునా?

(తెరలో)

మ॥ చనుచున్నా ర్వనదేవత ల్దివిజవృక్షా ల్గొంచు నానందనంబునను, న్నాబాణ వేల్పులాయమునకు న్బత్తెంచు నుచ్చైశ్రవంబును, స్వస్త్రీ ఎల విభీషణానుచరు లొప్పారాన్వామరు ల్బంది మానిచ్చి, వారం గినలేక వాసవుఁడు వాల్చె న్మోమ్ము లజ్జాభృతిన్॥

ర:— (ఆనందమున) నెచ్చెలీ! పదవోయీపద! లంకేశ్వరుని కారాగృహములలోఁ జాలకాలమునుంచి పడియున్న బందుగుల నందఱం జూడఁ గలము

(ఇరువురుం బరిక్రమించి—చూచి-హర్షముతో—నొండొరులతో)

సఖుఁడా! కనుము! కనుము! యుద్ధమునఁ దగిలినదెబ్బలతోఁ దబ్బిబ్బు లగుచున్నవానరుల గొండముచ్చులఁ గోలాంగూలముల, నెలుఁగుబంట్ల నొక్కచోఁ జేర్చి తేర్చ సుగ్రీవునింబంపి, విల్లులక్ష్మణున కందిచ్చినవాఁడై విభీషణుని కైదండతో, విజయలక్ష్మి చేకూఱుటచే నెంతయేని నుబుకు రమణీయత వెలుఁగు చున్న రామభద్రుఁడడుగో!

శా॥ ఆపౌలస్త్యుని శక్తిఘాత నురమం దాగాయపు న్గాయలన్
మోపౌలజ్జ శమింప, దేవవనిత ల్పుష్పాళి వర్షింప, లం
కాపట్టంబు విభీషణుండె కనునుత్కర్షన్ బులస్త్యుండునే
నే పొందన్, మనరామభద్రుఁ డదె లోకైకాభ రాజిల్లెడిన్॥

(అందఱు నిష్క్రమింతురు)

ఇ ది ఆ ర వ య ం క ము



# శ్రీమదనర్ఘరాఘవము



## సప్తమాంకము

(తెరలో)

ఉ॥ శ్రీరఘువంశకర్త, నిశఁ జీకటిచేఁ గడుమూర్ఛ ముజ్జగా
లూఁకరుకునొందఁ దెల్వినొసగూరుచువె, జ్జదయించి, దిక్పతు
ల్చేరఁ, బురస్థితి న్వెలయ, సీత పరాంగణావాసభాషణాం
గారము నిప్పుగుండమునఁ గల్పి పవిత్రిత మీఱి వెల్వడెన్ 1

మఱియు,

మ॥ తన తేజోఽనలమం దొకొక్కఁడుగ దైత్యస్వాముల న్వేల్చి, గొ
బ్బున నాపై దశకంఠుమస్తకతతి న్బూర్ణాహుతి న్సల్పి, నిం
డినస్వస్తి న్బరిపూర్తిఁగాంచి కడు బందిన్వీడి యేతెంచు సీ
తను గన్గో, వగ సిగ్గు రేఁగ, జడత న్దట్టాడెడి న్రాముఁడేన్॥ 2

క్రమముగా,

గీ॥ సరస సుగ్రీవుఁడును విభీషణుఁడు గొల్వఁ
గెలన సీతయు లక్ష్మణుం డెలమి వెలయఁ
బోవుఁ బుష్పకమునను రాముఁడు రవికుల
వృత్తిమేధ్య కయోధ్యకు వేడ్కనిగుడ॥ 3

(ప్రవేశము:— విమానారూఢులై సీతారామలక్ష్మణ సుగ్రీవవిభీషణులు)

సు:— (రామునితో) రామభద్రా!

చ॥ జలధి, దశాస్యకింకరత, జల్లుల నించు గృహోపకాననం
బుల, నదె!; లంక, క్రొంజిగురుమొత్తములన్ రఘురాము విక్రమం
బులఁ దమిఁ జూడు!, నొక్కతలపోవ శతాక్షుల లెక్క వేయిక
న్నుల శతమన్యుమోదము మనోహరమా దశకంఠు చావునన్॥ 4

రా:— దేవి! విదేహతనయా! కనుంగొను మల్లసువేలాద్రిపదమటను,
లంకకుఁ దూర్పునంగూడ

ఉ॥ వానరదైత్యసంచయకబంధము లేగతి నిప్పుడైన లో
కానకు శ్రీప్రజస్థితులఁ గప్పడునో! వెయి నెత్తురేరు లం

భోనిధి క్రొత్తభార్యలుగఁ బొల్చునఁ బాఱునొ! వేలవేలుపుం
జానలు నూత్నవీరవరసంగతిఁ గాంచునొ! నీకతంబుగన్! 5.

మఱియు,

ఉ॥ తోఁట్టల మహాశిరత్నములె తోఁపఁగఁ బాపపడంతు లుండుచో
సట్టిన గంధవృక్షములసంఘము లూడ్చి గ్రహించి వానరు
ల్బిట్టున మింటఁబర్వ నెడ, మూఁగిన రావణియిర్లుటమ్ముపై
న్బిట్టునఁ గమ్మచీఁకటుల వెల్గె మిణుంగురులట్టు లమ్ములుల్॥ 6

సీ:— ఈసీతకై యిచట నేకాఁబోలు మీకు భుజగపాశబంధనము కలిగినది?

రా:— అవును మిథిలాకుమారీ! అవును

గీ॥ నాగతతి నెల్ల నమలి యానల్లఁదాఁటి
కటకటన మహాశిరత్నసంఘముల నుమిసి
భుజగబంధవిమోచనంబును బొనర్చి
మాను నపు డొక్క త్రుటి గరుత్మంతుఁ డిచట 7

(వితర్కించి:— ఎలనగవున) ఈపాముజాతిస్థితి లోకసామాన్యమున కెంత విరుద్ధముగ నున్నది?

చ॥ అవయవ మొక్కటేన విన నారయఁ? దిండ్లకు రెండు నాల్కలా!
కవియ నురంబ? కాళ్లె చటఁ గన్పడకుంటయు? ఉన్న యెన్నొవా
యువుల జగత్త్రిప్రాణము నె యుగ్రతఁ గొంటయు? తల్లి సాధుక
ద్రువ! కనునీదు కొన్ను లిఁకఁ దోఁచుట యేనియు నీస్పృశంబెకా! 8

(ఎల్లరు నవ్వుదురు)

సీ:— (స్మేహాస్మితముగ లక్ష్మణుంజూచి రామునితో) నాథా! లక్ష్మణుని విలక్షణకీర్తికి స్థానభూత మైన క్షేత్ర మెటనున్నదో?

రా:— (ఆనందరోమాంచమున) దేవీ! మైథిలీ! నాకుడిచేతికి సూటిగ నున్న సువేలాద్రిప్రాంతభూమింగనుము! ఇచ్చటమన సేనలకునటుదను జవాహీనులకు నేకైకహేతు లగుచుండు లక్ష్మణమేఘనాదుల కచ టనే ద్వంద్వయుద్ధము జరిగెను.

సీ:— ఆర్యపుత్రా! మగనిపైగల ప్రేమాతిశయముచే గగుర్పాటుతో వెడలుచెమటజలముచే చితాగ్నికిఁ గ్రమముగ శమనము నుద్దీపన

ముం గలిగించుచు నెవరో నిశాచరవనిత లనుగమనవిధిం దీర్చు
కొనుచున్నవారు. ఆదిక్కునసేనా?

రా:— అవును. జానకి! అవును అదియే లక్ష్మణుని వీరలక్ష్మి వరించిన వివాహమంటపము మఱియు, నచ్చటనే

గీ॥ మూర్ఛ మునింగినలక్ష్మణు ముంపుఁ దేర్పఁ
జాలు సంజీవిగిరి నిమిషమునఁ దెచ్చి
కించల వదల్చి జగము దక్కించుకొనియె
వింతమూర్ఖన్యుఁ డగుహనూమంతుఁ డపుడు॥ 9

సీ:— (స్మృతి నభినయించి అనురాగమున) నాథా! కిష్కింధాపతిస్కంధావారమున నేకవీరుఁ డనంబొల్చునాంజనేయుఁ డెక్కడ నగుపడఁడేల?

రా:— దేవి!

చ॥ దశవదనుండు కూలినపదంపడి భాస్కరబింబవర్తియై
దశరథరాజు, నాదుపిత, తానె దయన్గనిపించి యానతీ
య, శుభతరాభిషేకసమయార్హ్యవిధు ల్సమకూర్ప నేగె నీ
నిశ రఘునాథకీర్తిపరిణీత కయోధ్య కసాధ్యవేగియై॥

(విమానవేగమును నటించి) ప్రియా! ఈమహాంబురాశి కంజలింబట్టుము

చ॥ హరియురమందు సుస్థిరతనందియు వీరభుజాంతరంబుల
న్మఱిగెడిలక్ష్మియీవనధిమధ్యమునందు జనించినట్టిదే!
హరు శిరమందు మేలిమణియయ్యును లోకమలంకరించుచం
దురుఁడును వార్ధిమధ్యజనితుండెసుమీ! కను మబ్ధి మేలిమిన్! 11
(విమర్శించి)

మ॥ అయిన న్గ్రసనంతే సుధాప్రకృతి యీయంభోధినీరంబు, విం
త యొకం కెనియు లేదు దాన, సిరియు న్జాబిల్లియు, న్వేల్పుగి
డ్డియు, ధన్వంతరి, కౌస్తుభాదు లటఁ బుట్టెన్గాఁగఁ, త్రైలోక్యవి
స్మయమానాద్భుతగాథ కాదె! మహిమ న్సంద్రంబు సామాన్యమే॥
మఱియు నోదేవీ!

చ॥ ప్రల మొప మూర్త్రిమే కనుచుఁ దక్కన దేహము కానరామిచే
నలిన ఘన్రం [illegible] దజ్జలజో పరిస్థితి

న్నిలిచి యనేకఋక్తతుల నిష్ఠురనిష్ఠ నుతించు నేరి నా
ఫలదుఁడు పద్మనాభభగవానుఁడు నిందె శయించు నెప్పుడున్॥ 13

సీః—(నమస్కరించును)

లః—ధర్మక్రియాచరణముచేత మహామనస్కులు వడయునుత్తమసిద్ధి సర్వత్ర
సమస్తాతిశాయి యనుమాట సత్యమేకదా!

చ॥ అడఁపఁగనీ జగంబుఁ బ్రళయంబున, మబ్బులఁ దాఁపనిమ్ము, పా
ర్లెడిబడబాస్యవహ్నిని ధరింపఁగనిమ్ము, సురాళి నోమనీ,
కడునిడుపైనవ్యాప్తింగనుఁగాక సముద్రి; మఱే నగస్త్యునా
త్తడి నొకగుక్కఁగా! మనకు ధన్యతపంబులె ముఖ్యవంద్యముల్॥

రాః—(సబహుమానముగ) తమ్ముఁడా! మేలాడితివి!

చ॥ సరసుఁ డనుద్ధతుం డసుమి సాగరుఁ డందునఁ జేతిగుంటకే
సరిపడె, నట్టులుంపుమది, స్పర్థ వియత్తల మడ్డగించుచు
న్బెరిఁగెడివింధ్యమే ఘటజువేడుకఁ దీప్ప నడంగెఁగాదె! త
త్పరమమహర్షిసత్తము ప్రభావము మించు ననన్యవేద్యమై॥ 15

మఱియు, నంతు నెఱుంగలేనిగాంభీర్యముల నెసంగియు మహా
నీయుల చరిత్రము లత్యంతమధురములుసుమా!

ఉ॥ ఇంతటిగొప్పవారినిధియే ప్రళయంబగుచో క్షణాన భా
స్వంతుని వేకరాల్పొలిచి వారినిబీల్వఁగ నుప్పుకుప్పయా
నంతటఁ గాలరుద్రు భయదాగ్నికిఁ బెట్టుచు నుప్పు చూర్ణమై
వింతయుగాంతవాయువులు వీవఁగ ధూళిగ లేచి మాయపూ॥ 16

సీః—ఆర్యపుత్రా! కడలినపుమ విడంబించు నాలంక యనునోడకు నేరేడు
దీవికిం గట్టుతాటివలె నక్కడ నదియేమి?

రాః—దేవీ! మేదినీనందినీ! అయ్యది పడినరావణుని జగద్విజయ
స్తంభము! అదియునుంగాక కాకుత్స్థకుటుంబదుఃఖమునఁ బాలి
భాగస్వామియగు భాస్కరపుత్త్రుని సుగ్రీవుని కీర్తిమయమగుమహా
సేతువు!

సీః—(ఆనందమున) ఆర్యపుత్త్రుని గనుంగొనవలయు ననునాశావృక్షమునఁ
దునిఁగినయంకురముల నుజ్జీవింపఁజేసిన మహౌషధమగు నిమ్మహా
సేతువుం గని ధన్యనైతిని (చేమోడ్చి) మహాత్మా! వందనములు!

రా:— దేవీ! విశ్వంభరాసంభవీ!

శా॥ నింగి న్దవ్వయి చూచు దేవతరుణీనేత్రాళికే న్హాయిఁ జూ
పంగం జాలుఁ బయోధి మౌక్తికపుదండ న్బోలి యీసేతు వం
దుంగ న్పట్టెడి నాయకోపమణిదీప్తుల్ చిందుచు న్సర్వర
త్నాంగీనాద్రిశిఖానుబంధరచనాధౌరేయపారీణమై॥ 17

ఇది నిర్మింపఁబడుచుండఁగా

మ॥ ప్లవగేంద్రు ల్పదపెద్దకొండల గుబేల్పాతంబుగా వేయ ను
ద్భవమౌ నుగ్రతరంగమాలికలచేత న్బిట్టుగాఁ దాడితం
బవుచు న్వేన్కకుఁ బాఱె నేల్లిసముదాయం, బౌర! తత్సర్వసం
భవమూలంబు సముద్రమౌ యనెడిసంభ్రాంతి న్బ్రకల్పించుచున్॥

(సుగ్రీవునితో) వానరరాజా!

ఉ॥ సేతువు గట్టుకౌతుకముచేఁ గపిముఖ్యులు వేయుపర్వత
వ్రాతముచేతఁ బొంగిపడి వార్ధి నదీగతి నట్లు మల్పిత
ర్వ్యాతిక్షణాననే గిరినిపాతజగర్తము గుంజ నష్టగ
ర్వాతిశయంబున న్మఱలదా? పొనుపాటున? జ్ఞప్తినున్నదే!॥ 19

సు:— దేవా! మచ్చిత్తచిత్రఫలకమున భవచ్చిత్రతతఃచరిత్రమ్ము దెద్దియేని వ్రాయఁబడనిది కలదా! అదియునుంగాక,

మ॥ నడవ న్గట్ట నగంబుల న్బఱపినంత న్వార్ధి శూన్యంబుగా
నుడుమార్గానకు నుప్పనీ రెగయఁగా. నుడ్డాడుచుండ న్దిమ
ల్గడుశీఘ్రంబున నిమ్నగ ల్తెఱపి నెల్ల న్నిండి, తియ్యందనం
బడి, సంద్ర బోకనాఁడు స్వాకుజలమౌ టేర్పాట రూపించెఁగా॥ 20

వి:— దేవా! మనువంశమాణిక్యమా!

మ॥ పడుపాట న్గృహాల న్జలంబు సుడియ న్బార్శ్వాన మైనాకుఁడు
న్బొడసూప న్గని బంధుదర్శనసముద్భూతాశ్రుధారాతతు
ల్జడిగట్ట న్గడునుబ్బు పెన్దొనలతో జ్వాలాళి రే నోషధు
ల్దోడి దంచు న్నిబిరంబులై నెగడఁ బొల్చున్ సేతుశైలౌఘముల్॥

సీ:— (నవ్వుచు) నాథా! పార్వతీజనకుఁడగు పర్వతరాజునకు యువరాజగు నీ మైనాకుఁడు తాను రెక్కలఁ దక్కించుకొనియు నీసముద్రాంతర్నివాసముచే స్థానముఁ జేయుయ్యెన్గదా!

రా:- (నవ్వి) అవును జానకీ! నిజమే

గీ॥ తండ్రి హిమగిరి సంగతి న్దలఁపఁబోక
తనయుఁ గ్రౌంచుని రక్షించుపనికి నీఁక
తనదు రెక్కల గాచుకో దాఁగె వనధి
దాఁగి మొఱగించుకొనిన దింతయును లేదు॥ 22

సీ:- (నవ్వి పుష్పకమున్జూచి) అహో! విమానరాజమా! ఆకసమున నెగురుకౌతుకముతో మానస ముబలాట పడుచున్నది అందుచేత నింకఁ బైకెగురవమ్మా!

రా:- (కౌతుకస్మితమున) వైదేహి! కనుముకనుము!

గీ॥ ఏకొలంది విమానంబు పైకెఁజనెడి
నాకొలఁది దవ్వుదవ్వగునాశ, లినుని
కాకఁ బైకుప్పకత న్దేలుకంధరములొ
పుష్పకాహతి లోచెమ్మఁబొంగఁజేయు॥ 23 24

మఱియు,

చ॥ దడదడ ద్రోఁగుగర్జనల దందడికోడ భయంకరంబుగాఁ
గడఁగిన కారుమేఘములు కంటెపస న్వరియించుచీఁకటి
న్గడికొనఁజేయ, మబ్బుపయి గుత్తగ వెన్నెలపోఁత నిండ, ని
య్యెడుతల మెన్నిచిత్రకళలూనెనొ! తావుల వెల్వరించుచున్॥ 25

సు:- (క్రిందఁజూచి కౌతుకమున రామునితో) దేవా! ఇపుడు కడు నెడమయిన పుడమిం గనుఁడు!

చ॥ కడునెడమైకొలంకు లొరకొల్లటి పల్లము లంతరింపఁగాఁ
బుడమి తదీయదీప్తులనె పొల్చెడిగా మణికుట్టిమంబుగా!
జడధి భుజంగవేష్టనవశంబునఁ దత్ఫణలై జగాల నె
క్కుడు విలువైన నీలిసనె కుంభక్కనురత్నము నొందినిక్కఁగా॥

సీ:- (ముందుకుఁజూపుచు) కల్పాంతసమయమునఁ బ్రజ్వరిల్లు ప్రళయాగ్నిశిఖలచే నుడుకుసముద్రమున లేచుచుఁ బొంగుగుత్తులవలె నాకసమునంటుచు వేలకొలఁదిగ స్ఫటికాచ్ఛశిఖరాల నొప్పు నీయెదుటి పర్వత మెద్దియో గదా?

వి:- దేవీ!

ఆ॥ మంచుకొండసుమ్ము! మనముందరిది, దీన
మున్ను శివుని చిచ్చుకన్నుమంటఁ
జనినమదనుకొఱకు సంజీవనీపర
మౌషధముగ దుర్గ యవతరించె॥ 28

సీ:- (కౌతుకముతో) అయిన నిచటనేనా చంద్రకిరీటు నిటలనేత్రాన
లమునకు భగవానుఁడగు మన్మథస్వామి యాహుతియైనది?

వి:- అవునుతల్లీ! అవును అయ్యసమశరుని దుర్మరణమున కయ్యుత్తర
ముగఁ గనఁబడు దేవదారు వనములవరుసయే సాక్ష్యము.

ఆ॥ మూఁడుకనులవేల్పు మూవ్వంచకనుసీమ
రోస మెక్క బిగిన కాసె, నైనఁ
బైది దగదగనుచుఁ బ్రజ్వరిల్లినఁగ్రింది
రెండు పొగనె సైఁపకుండె నహహ॥ 29

రా:- చెప్పఁగలమా!

గీ॥ నీలలోహితు నొసటికంటిని జెలంగుఁ
జెప్పఁగిప్పగరా కొక్కగొప్పనిప్పు
భువననాశమున కందుమూసిదాఁచు
దాని కింధనమయ్యె నాత్మభవుఁ డట్లు॥ 30

సీ:- (రామునితో) ఆర్యపుత్రా! అట్టివయారహితుఁ డైనమహాదేవుఁడు
దేవిపై నెట్లు మనసు ద్రిప్పుకొనఁగల్గెనో?

మ॥ స్మరుఁడే అట్లునశింపఁ దత్సహచరు ల్పంగీతలావణ్యనా
ట్యరసాదు ల్తన కేసహాయమును జేయన్లేమి గుర్తించి, భూ
ధరరాట్కన్య యుపస్థమార్చి శుభమొందంజేయు దీవ్యత్తప
శ్చరణ స్ఫూర్తి తపించి యీశుమెయిలో సామెల్లఁ దా నయ్యెఁజూ॥

వి:- (పరిహాసముగ)

ఉ॥ సందియె, [illegible] వచ్చినభాగ్యముగా నెసంగు న
[illegible] నెన్నియుగంబులో కొల్చి పార్వతి
సుందర [illegible] మేనిలో సగం
బొం[illegible] యెకతా॥ 32

సీ:-(సిగ్గుతో) [illegible] వైవాహిక [illegible] జరిగినది?

వి:- అదిగో! ఆముందు గనుపడునదియే యోషధిప్రస్థ మనునది. అదియే నగరాజు నగరము

గీ॥ ఓషధీమయుఁ డైనహిమోర్వీధరుఁడు
ధారవోయఁగ శశిఖండధరుఁడు శివుఁడు
తనదు ముంజేతి భుజగకంకణము దాఁచి
భీతి విడుపార్వతి న్హాయిఁ బెండ్లియాడె॥ 33

రా:- నిక్కమే దేవీ! నిక్కమే

ఆ॥ తండ్రి హిమముకలిమిఁ దద్దయు హేమంత
కళల మెండుగాఁగ వెలయఁజేయ
శివునిచేతి మదముచెల్లి నయహిభూష
భయము వీడి చెట్టవట్టె గౌరి॥ 34

సీ:- (నవ్వుచు) నాథా! మన్మథునంతవానినే యిచటమండించినాఁడీఘనుఁడని యాతని నమ్మలేక కాఁబోలు గౌరి తదర్థశరీరమందే తననుం జేర్చుకొనినది.

రా:-(నవ్వి) అవునుజానకీ ! అదియొకవిచిత్రమే.

చ॥ హరుమెయి దక్షిణంపుసగ మాసతి డాపలిమే న్సగంబుతోఁ
బరఁగుట నామెనెచ్చెలులు పంబినమేలపుఁజూడ్కిఁ జూచుచు
న్సరిగిన తక్కుసాములను జోకగఁ గూర్పఁగ నర్థనారు లి
ద్దఱయి ముఖాముఖి న్వడిగ దాఁటిరి పెండిలిపీఁటఁ జేరఁగన్॥ 35

మఱియు,

మ॥ కుడివైపే తన కేలరా దనెడికోర్కు న్గౌరికి న్దీఱఁ బ్రే
ముడి నద్దంబునఁ దారుమారుపసతో మూర్తి బ్రదర్శించి, యె
ప్పుడు సంశ్లేషమెసంగుట న్సమత సంభోగప్రలంభంబు లో
ప్పిడ నన్యోన్యత మించు నాల్మగల కి శ్లేమోద్తు హాస్తద్వయిన్॥

వి:- దేవీ!

మ॥ తనయిచ్ఛ న్స్తనమొక్కటై యుభయపథ్యంబై తల న్జందురుం
డు నెసంగ న్భుజగుండు సవ్యభుజమందు న్స్రోలఁగా, నెన్నొసం
టను మూఁడౌనయనాన సాము నెఱమంట న్సాము దాక్షిణ్యపూ
ర్తిని చుంయ్యుం యనఁ బొల్చుదైవ మఖలశ్రేయాళి మాకీయుతన్॥

మఱియు,

ఉ॥ వామకుచంబుఁ బత్త్రమునఁ బర్వినచెమ్మట భస్మరేణుసం
క్రామితదక్షిణాంగుళి సుఖమ్ముగఁ దీర్చెడిదైవ మాఁడురూ
పా? మగరూప? పేడియననౌన? భళీ? యివియేవి కాక వే
ఱౌ మఱియేదొయా శివు శుభాంగము మా కొనఁగూర్చు సంపదల్॥

(మఱియొకవైపుఁజూపుచు)

మ॥ అదిగో మంథరపర్వతంబు! మును దైత్యధ్వంసి కేయూరవ
జ్రదళప్రోద్ధతి నైనపెన్వ్రలయవిస్తారంబుల న్వింతయై
పొదలు, న్గూర్మము వీఁపురాపిడిని దన్మూలంబున న్గొంతపో
వదయే నింతకు మించునున్నతినె నిల్వన్వచ్చునం చెంచెదన్॥ 39

సా:—(పరకాయించిచూచి, నగుచు)

శా॥ రెక్కల్తున్గిన మోరుకాయలు పొరి న్నేఁగంగ మంథాద్రి యె
ట్లోక్కో స్సెఁచెను నాగరాణ్మథనరజ్జ్వగ్రత్వ? మీఁదుష్టుఁడై
యుక్కెఁడై జలధి న్గలంచి సిరి నెంతో పాపిఁ బుట్టించి పె
న్జిక్కు న్గొల్పె జగాన లేమికలుము ల్పేకూర్చి, యేగొప్పయో!॥

సీ:—(ఆవేగముతో) ఇతఁడేగదా క్షీరపారావారమును మండమాత్ర
(మీఁగడయే) శేషముగా నొనర్చి చంద్రుం బుట్టించి విరహిణు
లగుస్త్రీలపై దుముకువానిగఁ జేసెను! (అందఱునవ్వుదురు)

వి:—(రామవాక్యముంబురస్కరించుకొని) ఆహాహా!

ఆ॥ వనధిలోన లక్ష్మిఁ బడవేయవలయునం
చెగయుచుండుఁ బూనికి యేమి ఫలము?
శ్రీయఁ ద్రోయఁ జందురుం డందె యుండక
మరలమరలఁ బైకిఁ బరుగు లిడెడు॥ 41

(విమర్శించి)

మ॥ కపటార్థంబుగఁ గైటభారిపృథువక్షఃపీఠ వౌతల్లి! మా
ఖ్యపరాంబా! కినుకొంద వేని, నతి, నిన్నర్థింతుఁ దెల్పంగ, నీ
కెవ్వడి ల్లాజలజంబ? విద్యకొలికా యీ వందులో నుంట? సం
ద్రపుటాచార్యక మొక్కొ? నీచపదవిన్యాసంబ నీనేర్పుటల్?॥ 4

ల:—(నగుచు)అయ్యయ్యో! అటు దేవతలలో నిటురక్కసులన్గూడ శ్రేష్ఠు లగువారి వీరరసోద్రేకమునకు సూచకము లగువాద్యవిశేషముల నృత్తంబు లాడునట్టియు, సకలరాజసమూహములలో దుర్వృత్తి నుద్రేకింపఁజేయు ఖర్జూరసప్రబోధిని యైనట్టియు, సాహసికుల శస్త్రాంధకారముల మిణుంగురుల వెలుంగులఁ బ్రకాశించునట్టియు, మధుదమనుఁ డగువిష్ణువక్షస్థల మనుమేఘమున మెఱవుదీవెగా స్ఫురించునట్టియు లక్ష్మీదేవినా యిట్లుపాలంభించుట?

గీ॥ దొడ్డపేరొందునట్టికౌతూహలమున
మహితగుణు లగువారిసమాశ్రయించి
వీరు లగువారి కరవాలవీథి నెపుడుఁ
దనరుగా యసిధారావ్రతంబుఁ బూని!॥ 43

సీ:—(అనూయతో) తమతమ దురదృష్టములచేఁ గలుగునాయాసముల నలుగులోక మిట్లే లక్ష్మిపై నపకీర్తిగీతముల నాలపించుచుండును, (ముందుఁజూపుచు) పగటియందే ప్రోగుజేసిన వెన్నెలవలెఁ బ్రకాశించు నాపర్వతేంద్రుఁ డెవరు?

వి:—దేవీ!

మ॥ ఇదె కైలాసము! దీని యచ్ఛతెలుపు స్ఫీరప్రదేశాళియం
డ దినేశప్రభలుబ్బ వృక్షములనీడ ల్వాసియు న్దోఁచు న
ల్లదె! యం దొప్రతిబింబరూపములఁ! బద్మానీకమో? విష్ణుమో
డ్పుఁదగ న్భాసిలు శైవమౌళిశశిసంభూతంబు లౌజ్యోత్స్నలా!॥ 44

రా:—ఔరా! శతవిధములుగఁ బరికించినను గనుల కింకనుం గౌతుక మునుం బెంచుచునే యున్నదే!

ఉ॥ అల్లదశాస్యు శాహుపురుషులందలి రవ్వల సత్త్రిరాజిసం
ధిల్లిన యొత్తుగుఱ్ఱులవె! తేటగ స్ఫాటికకూటపాళి వ
ర్తిల్లెడి కినిలో భుజగదేవుపురంబు చరిత్రికూడఁ గో
కొల్లగఁ జూచుచుండు రదిగో! కను! యక్షులు పొల్లుమూఁకలై॥
మఱియు,

చ॥ మును పదికంఁగిళుల్వణపి మోపుగ వింశతిబాహుఁ డొత్తునా
ర్మిన కదియంగఁబడ్డ తనమేఖలచే స్ఫటికాద్రి కసంగ్చె నీ

శునకుఁ దటోర్మికాబహుళుచు న్మౌలిఁబర్వఁగ వారియంత్రసే
చనమున సంవిధానగురుసౌఖ్యపరంపర నిండు హాయిగన్॥ 46

వి:—(సీతతో) దేవీ ! ఇదికనుము !

చ॥ శివు తలపూవువెన్నెలలచే శశికాంతము లూర్చునూటవె
ల్లువలను మొల్కలెత్తి, కడులోలుపలై యమృతంపుఁజేతితో
శివ పెనుప గ్రహించినవి చెట్లిటఁ, దానవె, ధాత్రిత్వవత్సల
త్వవిధి వహించి షణ్ముఖుని బాల్యవినోదము లెల్ల సైఁచెఁగా!॥ 47

మఱియు, నీధరాధరము నుపరితలమున నివసించు మృడానీ
ప్రియుఁడు

మ॥ తనువెల్లన్నయనంబు లౌ మఘవుఁ డాస్థన్భక్తి సాష్టాంగవం
దననిష్ఠన్విరికల్వదండయి యనంగాఁ గాళ్ళము న్వ్రాల నె
త్తినచాపల్యముచేఁ గుమారుఁ డొగి చేఁదీయ న్బటు ల్తానుఁ బ్రే
మవితానంబుగ నవ్వ శంకరుఁడు సంపద్భద్రము ల్మీకిడున్॥ 48

ఇంతియకాక,

మ॥ సరినేదైవము తాండవభ్రమణ భూచక్రంబు తా దిర్దిర
న్దిరిగె, న్బుక్కల రేఁబవళ్ళఁ గనకాద్రి శ్లేష్మము న్వేనవే
ల్తరమౌ చీఁకటివెల్గుమెత్పుతళుకు ల్సాగించుచు న్గిఱ్ఱున
న్సురిగె న్దద్భువనాంతిమేష్టివిభుఁ డెందు న్మిమ్ము రక్షించుతన్॥ 49

ల:—

గీ॥ సింహనఖమొక్క యిది యన్న చెడ్డభీతి
లేడి విడిచి చన న్మచ్చలేని మేల్మిఁ
బురహరునియాఁదల న్మౌళిభూషయగుచు
వెలయుఁ గనుపండువిడుచు జాబిల్లి రేక॥ 50

సీ:—(పరిహాసముగ) తలకాయలదండ, దందశూకములుఁ బుఱ్ఱెలు సొమ్ములుగా ధరించి పల్లకాళ్ళ వసించునీసామికిఁ దానుఁగూడ నొకభూషయగుట సహజముగా తనకుఁ గళంకమగునుగాని సాధువైన లేడియా మచ్చయగునట ?

వి:—(నవ్వి) దేవీ ! భగవానుఁ డగుశంకరుఁడుఁగూడ నలంకారాభిలాష [illegible] సీ[illegible]ంకితాల్పుం ధరించె ననుకొనను, మఱియేమి యనిన.

గీ॥ తనను గొలుచు పిశాచసదస్సు స్వేచ్ఛ
నల్లెడ స్రాత్రుల జ్జరియించుపీలు
సలువనే యీనిశాచరుం దలధరించె
వల్లకాళ్ళనె తిరుగుకపాలధరుఁడు॥ 51

రా:—(సన్మానస్వరమున)

చ॥ జడముడికాపుగా బెగినెసంగఁగఁ జుట్టుట నల్లి పాపమిం
డ డెప్పుడుఁ గాటుచుండ నొకట న్దనబింబము చిక్కఁ, బూర్ణత
న్డొడఁగ నికొక్కచో సెగకనుంబెనుచిచ్చునఁ గాపుసంపెటం
బడుచు నెయుండుఁగా శశి క్షమ న్బొరిఁ, దత్కళకు న్నమస్కృతుల్॥

(పుష్పకముంజూచి) ఓవిమానరాజమా! సుమేరుశృంగముల
పైధిలి చూచును. కొంచెముపైకిఁజనుము!

వి:—(సీతతో) దేవీ! చూడుముచూడుము!

చ॥ నెలనెల నొక్కొకండుకళ ఃర్జరు లాఁకొని త్రావఁ జెంగి వి
చ్చలవిడి మచ్చలేడి పెలుచ న్గళల న్కొనలెల్ల మేయ, నీ
శిలపయిఁ బైలుఁల న్దిగువచెట్టు లధశ్చరతారకగ్రహా
దులప్రభ నీడలీన, నరుదున్మొద మీకనకాద్రి కూర్చెడిన్॥ 53

మఱియు,

ఉ॥ బంగరునేల, నిక్కఫలవ త్తరువు ల్నగుచుండఁ గొండపై
యంగణమందుఁ, బాపటగ నొపెనుబాటఁ జరించునేకచ
క్రాంగుని మేటికాఁకఁ గసకాళ్ళముటెల్లఁ గరంగి రొంపిఁ గూ
ర్పం గడుగాల్దిగంబడ భరంబున లాగెడి సూర్యునశ్వముల్॥ 54

ల:—(సీతతో)

మ॥ వదినా! చూడఁగదమ్మ! పర్వతనితంబంబందు దేవాగసం
పద! ప్రక్కన్ సడిప్రొద్దు మంటలెగిపింవన్గూడ నీవైపుఁ జ
ల్లఁదనంపు న్నిడునీడలన్బఱపి మేల్వాయి న్నుమామోదము
ల్పిదుల న్జుబ్బుచూఱగా శ్రమముపో వింతైనవిం దీనడిన్॥ 55

(వ్రేలఁజూపుచు, హర్షస్మితమున) అల్లదే! పుష్కలావర్తమేఘ
ముల పైపైననే యైరావత మున్నదే!

చ॥ తనభుజశక్తి లీల ననిఁ దద్దయునెత్తి దశాస్యసింహాగ
ర్జనముల రావణుం డరవ జంకున నాఁ డటుగీకపెట్టెనే!
కనుఁ డిపు డెట్టిస్వేచ్ఛ నెటుఁ గాలునొ! వాసవబంధుభామినీ
జనపరిభుక్తదివ్యసుమజాలసుదామసు రేంద్రసీమలన్॥ 56

సు:—నిజమే మాటల కందనట్టివే దశకంఠునియాటలు

చ॥ ఒకరొక రుం ద్రొశొక్కపస నుజ్జ్వలవీరులు, తక్కవేరినం
టకుఁగల! మైన రావణునెడ న్భువి వీరధరిత్రియయ్యెఁ బో
రి కడుగ వాలి యేమియొనరించెనొ? ధాత యొసంగుకన్నువీ
నుకలిమి కాంచనే వినని నోరుమెదల్పఁగ నల్పసాధ్యమే?॥ 57

రా:—(సబహుమానముగ)

శా॥ చంక న్వజ్రపుగావుపట్టున దశాస్యస్వామి బంధించి ని
శ్శంక న్వారిచె వాలి నాల్గుదధుల న్నావిత్రి. సామాన్యుఁడే?
బింకాన న్దశకంఠుఁడే నసదొకో? వీఁడీల్గుకంటె న్మహా
తంకుం డాతనిచావులొచ్చె? అదెకాదా కూర్చె సాహాయ్యముల్॥

సీ:—(రామునితో) ఆర్యపుత్రా! మఱల నీగగనాంగణమెల్ల కర్పూర
శకలగుచ్ఛగౌరవర్ణములతోఁ గనుపించు టెందువలననో!

వి:—(సీతతో) చంద్రలోకసామీప్యమునకు విమానము చేరినది. ఈ
భగవానుని దర్శింపనగు.

చ॥ తొలిమలి ప్రక్కదిక్కుల గతు ల్దిశలం దమరింపఁ బండువె
న్నెలపసఁ గారుచీఁకటుల నెట్టన బిట్టిగఁజిమ్మ, ముజ్జగం
బులకును జూడ్కివిత్తనపుమొల్కగ నేరిని పొడ్పుగట్టుపై
వలచి జనంబు నిల్పుకొను ప్రాణము లాహరిణాంకుఁ డీతఁడే॥ 5

మఱియు,

మ॥ కఱగళు జూటమన్న నెలకట్టున భూషణకాంతిరేఖయూ
దార, తొవచుట్ట, మిర్ల దిగదోపిడిమేపరి, లేడికంటినే
గ్గరితల ముత్తెముంపుసితకాంతిసరాల నలంకరించుమం
తిరి, సురరాట్సుధారసవతీపరిషేత, కనంగనయ్యెడిన్॥
ఇంతయే కాదు

శా॥ ప్రాణాయామగురుండు పద్మమునులన్, గాయంపుటున్మత్తుల
న్జ్ఞానోత్తార్పుడుగాఁడు, సర్వతరుణీసంగాక్షిప్రాగన్నము
న్మానంబు న్దాగలఁ దడంచుమగఁ డమ్మారాయురౌన్నత్యయ
జ్ఞాన న్భైర్వడుయజ్వ, రాజిలెడి శృంగారైకవాదాఢ్యుఁడై॥ 61

ల:—(చూచి, కౌతుకమున)

చ॥ చెవినగ లైనశాలినరిచిర్మొలక ల్విడఁదీసి యచ్చర
ల్కవకవనవ్వుల న్బిలిచి కొన్కఁగ జూపుచు డాచు మండ, మే
యవలయునాస మాటి కిటునట్టిగుకుల్కొని గ్రాసమబ్బమి
న్జివరకు కందు లేడి యెవిచేయునొ సల్పినచందురిగాసెనన్॥ 62

సు:—

మ॥ నెమరు ల్వేసెడియోష్ఠసంపుటముల న్నిశ్చింతఁ బన్నుండుచం
ద్రమునంకేణము మానమాన మొకసిద్ధస్త్రీసమూహంబు మే
లమున న్దాళము వేయుచు న్బెదరుఁగొల్ప న్జంద్రుమూచూడఁబో
వమిచే నెట్టులు చిక్కశల్యమయి పెన్వంత న్గుమారిల్లునో!॥ 63

మఱియు,

ఆ। నెలకునెలకు సృష్టిసలుపఁగావలయుట
నీశుధాంశుకళలఁ దీసి యొకటి
మచ్చుతునకగైన వచ్చునన్మనమున
శిరమున న్ధరించెఁ బరమశివుఁడు॥ 64

రా:—(ఆదరమున నమస్కరించి)

శా॥ నీవే కావె సమస్తదేవతనికి న్నిత్యామృతశ్రాద్ధ, మీ
నీవెల్లేకదె యోషధు ల్పెనుచుచు న్నిల్పు న్జగజ్జీవితం,
బావిశ్వేశుఁడు నిన్నుఁ దాల్పనియెడ న్హాలాహలం బన్నిమ
న్గ్రీవ న్నకొన్కనుకాలపాశముననే న్మృత్యుంజయుం డౌనొకో!॥

(సీతతో)

సీ॥ ఎల్లరకనులకు న్గల్లగా మధుపర్క
సన్మాన మిడుదివ్యసత్త్రి మితఁడు,
నిలువెల్ల సుప్పాంగుబలము ముస్సిటి కా
వేశింపఁ జేసెడివె జ్జాతంపు,

బహిరంతరరతి నుత్పాదించు శృంగార
జనకమై తగురసాయన మితండు,
క్రతుభోక్తలకు నజీర్ణము వాపుసుధ నీను
తతపానశాల కధ్యక్షుఁ డితఁడు,
ముగుద! పాలేరుశుక్తిమేల్ముత్తె మీతఁ
డల్లదాక్షాయణీపతి, యంతెకాక
హరుజటారత్నభూషణాంకురమె యీతఁ
డింక నింతటివాఁ డని యెన్న నెట్లు? 66

సీః—(నవ్వుచు) నాథా! కులరూపయౌవనములలోఁగూడ సమాన లగు నెల్లరసపత్నుల యాఁదల న్నాదమిడు మిన్నగ నీదక్షకన్య యగు రోహిణి నెన్నుకొనుటచేతనే యీవెన్నెలఱేడు రోహిణీప్రియుం డన్న సన్నుతిం గన్నవాఁడు!

రాః—(నవ్వి) అగును జానకీ! నిజమే.

క॥ పెనిమిటిసుఖ మిరువదియే
డ్వనితలకు న్సమమె యైన వాల్లభ్యగతి
న్ఘనసుభగభావ మెదియో
తనరవలయు రోహిణీనితంబినియెడలన్॥ 67

విః—(స్పర్శసుఖ మభినయించి)

మ॥ కలువ ల్విప్పఁగఁ జేసి యం దెగయునక్కన్నంద్రికాపానవి
హ్వాల లౌ వెన్నెలపిట్టలైయెదువల జాడ్యంబు ల్పుట్టినన్నాన్పుచు
న్జలిరాల న్జలమూర్చి తళ్కుమిగులంగా మూకదూత్యంబుతో
వెలయించు న్సకలాభిసారికల తృప్తి న్నాడుఁ డిందుప్రభల్॥ ౬౮

మఱియు,

మ॥ తనరాక న్బ్రకటించి మేల్మిత్రోగ లంతర్ధ్వారలై యాడఁ, జెం
తనె సంద్రసంపృకలధ్వనిస న్బ్రమరి ఝంకారంబుఁ బక్షాహతు
ల్లనకేతంబును దాశి సహాసాటులు మెల్లంగాఁ జకోరీహస
ధ్వనిస రేగి న్నిను వాఁడఁ దేర్చు, దుగనేత్రం బిందుఁ డీయెల్లరన్॥
ప్రియంగాను,

చ॥ సకల మెఱుంగునట్టియభిసారిక లూనుమహాంజనంబు, లౌ
కికనయనాంధపట్ట మనఁ గ్రిక్కిఱిసియ స్ఫుటకాఱుచీఁకటి
స్ఫురితటము కానిభూమి సుకరంబుగ క్షాళనమౌఁ బొనర్చు చా
లుకరము తెల్లచోటుల వెలుంగిడ రేదొర తోఁచు నల్లదే॥ 70

రా:—(హర్షముతో చిరునగవున) ప్రియవాదిని వగునో ప్రియా!

ఆ॥ చందమామ నరయుసంతసంబునకంటె
నమృతబిందుసమము లైననీదు
నుడులజడులె నన్నుఁ గడుబెడంగగు మేలి
సౌఖ్యసారపరవశతను దేల్చు!॥ 71

వి:—(అనురాగమున)

శా॥ భూమూలంబునఁ గల్గురాపిడి శిరోభూషామణుల్ త్రేట ది
వ్యామోఘద్యుతు లీసి చీఁకటులఁ బాయం జేయు నాగావని
న్వ్యామోహ స్థలలూఁచి సీయశమె సేవించుచున్ శ్రవోలేశనే
న్నేమి న్గుండలనాదవర్జితగతి న్శేషుండు పొత్కంపఁడై॥ 72

(నవ్వి)

సీ॥ భోగినులౌ గానగోష్ఠి నిన్నొగడ రెండు
వేల్కనుల శేషుఁడె వినఁ, వినఁడు రెండె
సిన్ననగ హరి కిన్నరవిపులగీతిఁ
నుడియు; వేగనులున్నఁ జక్షుశ్శ్రవుండె? ॥ (లేక)

మ॥ ఇరువేగన్నుల శేషుఁ డాభుజగను ల్వేష్క లిప్సాళింప గో
ష్ఠిరతి న్దావకకీర్తిఁ బాడె విను; సస్సీ! ఇంద్రసంగీతో కిన్నరీ
తరుణీగీతము తెల్లవోనిగుడ క్రొత్రాలెండె యన్నింత వే
సను, నౌశే, వినునెట్లు? వేయికనులే జక్షుశ్శ్రవా లౌనొకో?॥ 73

రా:—(విలక్షణమైన మందహాసమున విభీషణసుభాషితము నాదరించి
చంద్రబింబమును సీతముఖమునుం గని యొక్కక్షణముపలక్షించి)

మ॥ మును తారుణ్యవిలాసినీముఖసమంబుగా జంద్రబింబంబు సృ
ష్టిని బద్మాసనుఁ డానువెంబడినె పుంజీభూతశీతాంశువు
ల్మానలై సాగి నిజాసనాబ్జమునకే మోసంబుఁ గల్పింపఁ దా
ర్కొనునిక్కట్టున జంకి నల్వ తనపూన్కల్మానె నంచెంచెదన్॥

(సీతతో)

శా॥ ఓరమ్యాంగి! భవన్ముఖంబునకు నీడో కాదో యీచంద్రబిం
బారంభం బని తన్నిజం బెఱుఁగ నజ్ఞానీనుఁడే తూకమం
దారోపించి తెలుంగుటల్కని సమత్వాపేక్షతో జాబిలి
జ్జేరన్వైచిన మింటిసిబ్బి గుమ్మురై చిట్టాడు నక్షత్రముల్॥ 7

మఱియు,

మ॥ సుతనూ! నీరజ మున్నపాళమున నే జోడౌనె నీమోముతో
సుతరా మట్లనరాదు, విచ్చుసుత కూర్చున్ దృష్టిఁ దేం జెప్పుడే
నతిథుల్గా నహామెల్ల, సూర్యుఁ గొలుచు న్గామించు నేకాగ్రతన్,
సుతు సాక్షాద్భగవంతు బ్రహ్మఁ గనెఁగా చోద్యంబె యీడౌటకున్

సీ:-(చిఱునగవున దలవంచి) ఆర్యపుత్రా! సుందబింబముతో నిట్ల చందమామ యుండఁగా నొక్కకళమాత్రమునే భగవానుఁడగ శంకరుం డౌఁదలం ధరియించు టేలనో?

రా:-ముల్లోకములకుఁగూడ నియ్యమృతకిరణుఁడే జీవనాధారముగదా అట్టిచో నితని సంపూర్ణముగ నాపినాకధరుఁడే ధరించినచో శి: నిర్మాల్యమై యనుభవింపరాకపోవఁడా? (ఎల్లరు నగియెదరు) అయినను, నీవుకూడ నెలనెల నితనిఁ గళామాత్రునిగఁ జూచుచు యుందువుగదా!

సీ। భువనత్రయములజీవుల కాదిమాహార
సంధానకరణయజ్ఞం బితండు
వలపుబాధల శోకముల నేర్పఁ గామాన
లాలాతచక్ర లేఖాలవంబు
దిక్కుల గడితల్పు లొక్కమ్మడి స్దియుఁ
గుదురుకల్గిన మేటికుంచెకోల
[illegible]న [illegible]రవరులలో ఘనుఁ డెన్వఁడను లెక్కఁ
బూవిల్తుఁ డిడికొను మొదటిగుర్తు
[illegible]॥ హ[illegible]నేత్రాల నసుమోముసిరుల నెదిరి
[illegible] షహఁ[illegible]రాజబీజ మితఁడు

వరపరానందదానసంపద్వ్యాతుండు
కదవె క్రొన్నెలబాలుఁ డెక్కజపుశిశువు॥ 77

సీ:—(అనుమోదమున) సకలగుణసంపన్నులైనవా రెందైన స్వయముగఁ
ప్రకాశించువారే. మఱియల్పుల కధికారమొసఁగ నెత్తికెక్కుదు
రనుటకు శివునిశిరమున నుండు నీశీతకరశిశువే మొదటినిదర్శనము.

రా:—(నవ్వి) దేవీ! మహాక్షత్రియకులసంభవా! ఆమాట నిజమే
సుమా!

ఉ॥ నిం డగువార్ధిఁ జూడఁగ జనింపదుజం, కొకగోష్పదంబుగా
దండితనాన దాఁటె మును దాహనుమంతుఁడు, సేతునిర్మితిన్
గొండలువేయ నీ ర్దివి కెగుర్కొన వట్టినసీసథ స్గన
న్గండె చలించె; మీఱు టధికు న్సిరినాఁడటు లేమి శక్యమే?॥ 78

అటుచూడుము!

చ॥ తొలిమల చల్వరాల్లఱులఁ దోయము నించుచుఁ బాద్యమీయ, భా
ర్యలయినతారలంజలుల నర్ఘ్యము లాజలుఁ గూర్ప, నిండి లో
దొలఁకువెలుంగుమేల్మి మెఱుఁ దుచ్ఛకళంకము చాటునొంద, ని
ర్మలకళమాత్రనే తోలఁగ, నంతట రా జెటుగుప్పనో ప్రభల్॥

ఆ॥ అవి మృగేంద్రు వాడియవుగోరులో యని
మిడికి ముడుఁగు నంకమృగమునలన
నిండు దొడుగుజ్యోత్స్న నెగడుచంద్రుఁ బలాశ
సుమవతంసవతులు చూచుచుంద్రు॥ 80

వి:—క॥ మకుటజట నిడఁగ శంకరు
డాకకళ మును ఫుణికిపుచ్చ నుడురాజుమెయిన్
వికటముగఁ బడినకంతలు
ప్రకటంబుగమచ్చగాఁగఁ బగిణతినొందెన్॥ 81

(నవ్వి రామునితో)

సీ॥ ఆకసంబనుబావి మండూకమైన
యీతఁ డన నెంత? యితనివేల్గని నెంత?
అదరిపాటన నీమెంపుటనము నెదిరి
మెట్లుగర్జిలు చున్నాఁడో యీవెకనుమ!॥ 82

సీ:—(చిఱునగవున) తెలిసె తెలిసె ఆర్యపుత్త్రుని కీర్తికాంతలతో పోటీగొని యోడినందుననే యీతని కీకందు. (ఎల్లరు నవ్వుదురు)
(రామునితో)

చ॥ భుజముల మంధరంబు హరి పూన్కి సుధాంబుధి వేయ బిట్టురేఁ
గుజడధిలోఁ దరంగములకు న్వెలసిల్లెడివన్నెతోడఁ నీ
రజుఁ డపరార్ధకృత్తకళ రంజిలు గౌరతతోడఁ దుల్యమై
నజ రఘువీరకీర్తి గణనం బొనరింపనివారు నుందురే!॥ 83

(తెరలో) దేవా! త్వరపడుఁడు! త్వరపడుఁడు! భగవానులగుపసిష్ఠమహర్షు లనుగ్రహించిన మంగళాభిషేకముహూర్తము సమీపించుచున్నది.

రా:—(ఆలకించి) మమ్మునుద్వరపెట్టుట కయోధ్యనుండి మరలివచ్చెనా యేమి మారుతి?

సీ:—(సంతోషమున) ఆంజనేయుఁడేనా త్వరపెట్టుట? అయినచో భూమి దాఁపుగఁ బోవవీలగునట్లు పుష్పకమును దిగనిండు (క్రిందఁజూచి రామునితో) ఆర్యపుత్త్రా! మఱల నదియేమి! లేఁజీఁకటిరంగున వెలయుధరాతలమున విష్ణువక్షమందలి కౌస్తుభస్తబకమువలె వెలింగిపోవుచుఁ గనుపడుచున్నది?

రా:— (చూచి విభీషణునితో)

గీ॥ తఱిమెన త్రవ్వ లెగిపించు తరణిబింబ
మనఁగఁ దనచుట్టుఁ గాంతుల నినుచుకొనుచు
నడుమ మృగతృష్ణికలవలె యెడములోలయు
విశ్వకర్మకర్మాగారవిధి నదెదియొ?

వి:— అదియే రోహణపర్వతము.

చ॥ పరువడి జ్యేష్ఠమూల నగుపర్వపుజాతరల న్బిడారుటొం
టె రహానిమేయు ముండ్లపొది నిండినదారులఁ, బిడ్డుకొండగా
ప్పుఱుకు నెడార్ల దూరముననుండియె చూడ్కిహరించు చంద్రువె
ల్గురలుచుఁ జల్వరాదొనల నుబ్బగఁ జేయు నురుంగుబుగ్గలన్ 85
(ఎల్లరు విమానము దిగుదురు).

రా:— (చూచి సీతతో) దేవీ! ఆదక్షిణదిశ నిప్పుడరయుము.

ఆ॥ కడలిలోనఁ బుట్టుకలుని యేమో నాఁగ
సింహళంబు సొగసుఁజిందు నుండ
నెగడు కేసరముల నిండుగో మాణిక్య
పర్వతంబు కనులపండువు విడెడి 86

సీ:— ఇందేగదా దర్భలవెన్ను వలె నుండు నగస్త్యమునిహంస ముండునది.

రా:— అవును మైథిలీ ! ఈ మహేంద్రి యే లోపాముద్రావల్లభుం డగు నాకలశసంభవుని రెండవయాశ్రమము.

శా॥ పుట్టె న్గుండను ! పొందుకో కులపతిప్పుష్టి ! స్థరాపాత్రమే
న్దొట్టన్నిండుసముద్రవారి నొకపేనోయింటనే తాగె, మి
న్ముట్ట వింధ్యము నుబ్బుబబ్బగయ నేర్పు న్వ్యాజ్యగా మాన్పె, నా
చుట్టుంబోకను దీర్చె నం, చినుఁడె కొల్పు న్బల్పునాశ్వినతఁ 87
మ ఱి యు,

ఉ॥ వాడుకచన్న రెక్కలనె, పల్మఱుఁ బై కెగురంగఁబూని, త్రో
డ్రోడనె కూలి, డాఁగువసతు ల్పమకూరమి నెండిరికల్గుల
న్గోడున దూఱఁజేసెఁ బెనుకొండలఁ, దారివినని ర్వెపెల్పు లో
జాడత్రుటి, న్మహాత్మునతి సాహసమా !, సరసోక్తి సాధ్యమే 88

మఱియు, శృంగారవిషయములకెల్ల సార్వభౌముఁ డగుమన్మథునకు రత్నఖచితసింహాసన మనఁదగు నాసింహళద్వీపరాజమునఁ బ్రదోషసమయ పారింభములందు

చ॥ పొడిచెడిచంద్రు లేఁతకరము ల్పడినంతఁ జెమర్చుచల్వరా
నడవలు పాదలాక్షవలన న్బడుగుత్తులఁ దెల్పు మించుద్రేవే
ముడి నభిసారిక ప్రియులమోజున నేగెడిచోఁ జకోరము
ల్పడి నెగురంగ జంకె యిలుచాయల మర్లినజాడ లయ్యెడ౯ 89

(మఱియొక దిక్కునకుఁ జూపుచు) అదిగో! ముత్తియములపంటనొసఁగునీటి కాదరు వగుతామ్రపర్ణి మహానది.

ఉ॥ ముత్తెపుఁజిప్పగర్భములఁ బూసలుకట్టినయేటిచిన్కుపిం
డొత్తుఁ గ్రమాన సుందరులయూరువుల, న్మఱి, పూర్వపుణ్యము

న్నత్తున మత్తకాశినుల చన్నులభోగమె ప్రాప్తియున్నవో !
యెత్తఱి నిల్వఁజాల్కఱకలే యగుఁజూ! ఘనమౌక్తికంబులై 90,91

సీ:— ఆర్యపుత్రా! భగవానుఁ డగుసాగరునకు భాగీరథిపైఁ గలపక్షపాతమంతయు నామె పెద్దది యనుహేతువుచేతనేసుమా! ఆ యన నిండైనప్రేమప్రవాహము సహజముగనే సర్వాంగమౌక్తికాభరణయై రమణీయరసపరమావధి యగు సీతామ్రపర్ణియందే కదా మొగ్గుట !

రా:— (చూచి, నవ్వి వేలుచోఁజూపుచు)

గీ॥ అదిగో! మలయాద్రి! అందుండి యాత్మసఖుని
దెమ్మెర న్నంపి మన నెట్లు తేర్పఁ గనుమ!
వలచుప్రియుపయి సఖి తెల్పు వట్టిచాడి
నలుకుమానినిఁ దేర్చుట సులభ మింక 92

ల:— (ముందుఁ జూపుచు)

గీ॥ తనదుకుడియరచేతిలో మినుకువారి
జలముల న్జిక్కవడుతిమింగిలములందు
నుబుకుదయఁ ద్రావు వెంటనే యుమిసె నెవ్వఁ
డయ్యగస్త్యున కిది ద్వితీయాశ్రమంబు! 93

మఱియు,

ఆ॥ నాల్గుసంద్రములను గల్గుక్షారజలంబుఁ
ద్రావ నెంతదప్పి క్రాఁచెనొక్కొ!
నీమహాత్మ్య మంచు నెంచి యచ్చపుజెల
లాతఁ డుదయమంద నందఁ బొలుచు 94

సు:— (నగుచు)

ఆ॥ "ఔర! ఔర! త్రావె నాపోశనంబుగా
నేడువారినిధులనెల్ల నొకట
నీమునీంద్రుఁ డింక నేఁకరి మెసవఁడే"
యనుచు జగము లేదు వణకియుండు 95

(అంతటం గలయంజూచి, హర్షాద్భుతములతో) ఆహాహా! ఇన్ని నాళ్లే చెప్పఁగదా పదునాలుగు భువనములకు నేకదండధారుఁడై

యీరామభద్రదేవుఁడు ధర్మాసనము నధిష్ఠింప దండకారణ్యగృహ-
స్థులగు తపోధనులకు సమృద్ధి !

రా:— (బిడియపుసగెన్వన-విమానవేగ మభినయించి-చూచి) ఏమియిది?
బంగరులేడి విహరించిన యటవీప్రదేశముల పయికే వచ్చితిమే !

సు:— (నవ్వులాటగా) ఇదియేకదా ! మారీచుప్రాణమునే యుపహార
ముగా నొసఁగుటచేఁ దినసుఁదా రక్షించుకొని దశకంఠుఁడు మాయ
జడదారివేషమున నొసర్చినమోసము నెఱింగినయేకైకసాక్షి !
పంచవటి ! (ఆదరమున)

మ॥ ఒకమాఱేకాకికయాంగ విఘ్నకరుఁడై యొంటొంటికోఁ జో భర్తమో
ముకళాకాంతులనుండి సీతకనుదమ్ముల్ద్రిప్పఁచిత్రాభకాం
గకుఁడై, యింతటిరాము రెంట ధనువంటన్జేసె, నేఁడైత్యుఁ డిం
తకుఁజాలె, న్భళి ! రెంటజోత లిడుదు న్మారీచ దేవారికి 96.

సీ:— (లజ్జించును).

రా:—(ప్రస్రవణగిరిం జూపుచు సీతతో నేకాంతముగ)

చ॥ మును పొకరేయి నిందుమణిముక్తసుధీప్తికిఁ గాకిమూఁక స
ల్పినరొద కుల్కి ఘూకతతి పెన్గుహఁ జీఁకటి మేయఁబోవె ! నీ
స్తనపట మే న్దమి న్దివియ దబ్బున నాకులఁ గోయనీవుపూ
నిన వనదేవత ల్పయికె నెట్టిరె కొమ్మల ! జ్ఞప్తినున్నదే ?॥ 97

సీ:-(చిఱునగవునఁ గపోతహస్తముం గూర్చుకుని) భగవానుల రగు
నోవనదేవతలారా ! ఇదిగో మీపరిచారిక యగునీజానకి నమస్క-
రించుచున్నది.

రా:—(ఇంకొకవైపునకుఁ జూపి) దేవీ ! మహనీయ యగుగోదావరీనది
యదిగో ! నమస్కరింపుము ! (జనాంతికముగ)

శా॥ ఓనాప్రేయసి ! దీనిలో యిసుకపై పోర ల్చియంగ్యాళిలో
గా నొనాపొదరింట, మోదుగలమొగ్గ ల్దండఁగాఁగూర్చి నో
గ్లాని నైస్నపనీయరోజములపైగా నుంచి నేనవ్వ, ము
గ్ధానిష్ఠాచ్యుతి గొప్పతప్ప నెడికిన్కన్గూడ హాసింపవే !॥ 98

సీ:—(లజ్జతోఁ గూడినచిఱునగవునమోమువంచి) గోదావరికి నమస్క-
రించును.

రా:—(చుట్టును ముఖముఁద్రిప్పి చూచి వగతో) దేవీ !

చ॥ కురియుమిన్నైన నుండెను మొగుల్దివి, వర్షము లేనిలోటు డె
స్పర మగునస్మదశ్రువులు వాపఁగ మాల్యవదద్రిఁ గాలువ
ల్వాఱెలె, నదేమిచిత్రమొ భవత్పరిపాలితపాదపాళి న
న్నరసియుఁ బల్లవింప, వహాహా ! నెమిళుల్మఱిపాడ వమ్యోదర్॥

సీ:—(ముసరుకొనువగపున గద్గదమగు నెలుఁగునఁ బుష్పకము నుద్దేశించి) విమానరాజమా ! నేనే సీతను. నాహృదయ మొకవజ్రమే సుమా ! తపింపనూ తపింపదు. పగులను పగులదు. అయినను దయచేసి యీ దండకారణ్యాపంక్తిని ద్వరగ దాఁటఁజూడుము !

రా:—(విమానవేగ మగుపడ సీతతో) ఈముందు దోఁచునదియే. మహారాష్ట్రదేశమున కేకైకభూషణ మనఁదగుకుండిననగరము.

చ॥ మలయభవం బొరుల్కనిమంగళవైభవసంయుతంబు నీ
చలువలగాలి యీనగరిజాణల మన్మథనక్రకేళి ను
జ్జ్వల మగుస్వేదవారిఁ గొని భర్తల మేల్పరిరంభగోష్ఠిఁ బై
పులకల నిమ్మడి న్ననుచుఁబో సరసప్రచురప్రచారియై॥ 100

మఱియు,

గీ॥ సౌరభోద్గారికైశికీసరసవృత్తి
వలచి వలపించు నీపల్కుబడులరీతి
నెటులో పసిబట్టి దూరాన నెసఁగునట్టి
శ్రేష్ఠకవులైన నెపు డుపాసించుచుంద్రు॥ 101

సీ:—(దక్షిణదిశ జూపుచు) ఆంధ్రదేశలక్ష్మీకంఠలగ్న గోదావరీహారాలంకారమున నాయకమణి యగుమహామాధుర్య భీమేశ్వరుం దర్శించి నమస్కరింపుఁడు !

ఉ. ఎన్వాని చిందులాట నుసి యెంతయు హెచ్చుచునుండ జంకి దా
దవ్వుగ నాఁ పడిచన దక్షిణపాదమొకంట వెంట రి
ప్రివ్వఁ [illegible]వాకృతిఁ జరించుచుఁ బుఱ్ఱెలదండ పాములు
[illegible] నమ్మోఘు న్బొదువఁ జేసినయంతిమయజ్వ రాజిలుఁ॥ 10

రా:—(నమస్కరించుచు)

శా॥ నృత్తారంభరసానకే తొలఁగ గౌరీదేవి, యైన న్తదు
ద్వృత్తి న్మేనుస లోటు కన్నఁకుట లేదేలేద! పైపెచ్చు స్వా
యత్తంబౌ పెనుచిందు నీప్రడపిన న్వ్యాళాళి నిన్నమ్మ రా
చిత్తభ్రాంతి దిశాదులన్ దిరుగ, నైవమోర్తు నీ కౌఁకవా!॥ 103

మఱియు,

మ॥ అసలే కాలగళుండ, వందుసంయుఁ గాలాంతకంబు నీకంఠము
న్దెసఁగ్రిమ్మె, న్మతి నిహా సర్వాలయబుద్ధి న్పేలఁ జిందాడె, దీ
పసల న్మాచెడికాళరాత్రియొ, శిరోభాగంబు దేహంబు వీ
డిన నెన్నాఁ గనిపింపఁ, దల్లడిలె, ఖండేభూతైర్ధ్యస్థితిః॥ 104

(ఎల్లరునమస్కరింత్రు)

రా:—(మఱొకవైపునకుఁజూపుచు) ద్రవిడమండలమునకుఁ దలమానిక మైనకాంచీపుర మదిగో! మీనకేతనుని యునికిపట్టు! (ఏకాంతమున సీతతో)

చ॥ పొడమినచెమ్మట ల్పొగుపు వోయినదంపతులంటుఁ గౌఁగిళు
ల్వడలుచునుండ మేనఁ జెలుచ న్పులక ల్పూరి రేఁపి చిక్కుదం
దడి నితరేతరాంగముల దార్కొనఁ దొట్టటికంబె నంతొయె
క్కుడు తమిహాయి, వారిలకుఁ గూర్చుచునుండుఁ బయోరుహాననా॥

మఱియు,

క॥ మొగ మెఱుచెమటచిత్తడి
నొగి మకరీపత్రిరాజి యూడిపడ శ్రమక
జిగి సనినకపోలము లిం
పుగఁ జాటు న్తరుణి మేలిపురుషాయితముల్ 106

సు:— (వేఱుదిక్కుఁ జూపుచు) ఇల్లిదే! అనంతదేశసీమంతమౌక్తిక మగు నుజ్జయినీరాజధాని! శృంగారదేవత కిదియే గర్భగృహము.

క॥ తెల్లనివెన్నెట, చేల
న్దెల్లనిచీరె న్ధరించి తెల్లనిమేన
న్బల్లగ నభిసారిక దివి
వల్లభుఁ జేరుటలు బయటఁబఱచు న్నిడల్ 107

మఱియు,

ఉ॥ మేడలమీఁదిజవ్వనులు మిక్కిలినిక్కిడిముక్కు లొప్పఁ గ్రి
జాడలలోఁ జకోరములు చంద్రిక లానినచోటఁ జీకటు
లీడ్వఁగఁజేసి తా మెగురువెన్నెలసిద్దెలరీతి వెల్గఁ బె
ష్వేదుకఁ బిట్టగోడలనె వీఁగుచుఁ జూచుచునుండ్రు వింతగన్ 108

మ ఱి యు,

ఆ॥ ఇచట నంతిపురుల నెగురుచకోరంబు
లచటి యువిదగముల యాస్యసుధల
నింపుకమపు లెంతో నిమురుకొంచుశయించి
యాని యాన వైందవాభ నరుచి 109

వి:— అలకాపట్టణమునకు శాఖయోయన నొప్పునిప్పురమునసే త్రిపుర
ముల దహించునిమిత్తము మహాకాళనాథదేవుఁడువిడిసినది.

చ॥ సుడిభ్రమియించువేగమున జూటము సళ్ళుచు విస్తరింప నే
ర్పడు సురగాంగధార లోకపంజరమై తనచుట్టునొప్ప, ని
ర్గడఁ బ్రచలద్భుజప్రచయకాండము రెక్కలుగాఁగ నంచచొ
ప్పిదులయనాటికానటుఁ డహీనసుఖాన జగంబు నోముతన్ 110

రా.— (అంజలింబట్టి)

చ॥ ప్రళయమున న్ద్రిలోకములఁ బ్రౌఢత స్వాహయొనర్చి క్రిమ్మఱ
న్మొలుచునొ యంచుఁ గాము నటు మూఁడవకంట దహించు నీపదం
బులను సురాసుర ల్మకుటభూరిమణిప్రభ ముంచి కొల్వఁ బె
న్జలువలచూడ్కి వారలను సోఁకిననీ కివె మన్నమస్కృతుల్॥ 111

మఱియు

గీ॥ అయ్య ! ముక్కంటిదేవ ! నీకాగ్రహంబు
సోఁచ వేగ నొసల్కంట దుమికె నగ్ని
యెదుట సమ్మోహనాస్త్రసమేతు మారుఁ
గని చిరము స్వాహ నెంచుచు న్గనదె జడత ?॥ 112

(అందఱు నమస్కరింతురు)

:—(నవ్వి) పాపము ! పదునాలుగుభువనములను బ్రాసించినంగూడ
ఆగి వాఁడు పా చంద్రశేఖరున కాఁకలి తీఱలేదుకాఁబోలు. అన
సొవింగూడ పదసీతపుముద్దవలె మింగినాఁడు. (అందఱు నగుదురు

రా:-(విమర్శించి)

చ॥ శర మగుశౌరి మోయుతఱి సంభ్రమముం డై ఖగరాజు డాసి చి
చ్చుఱ కనుమంట మిన్గురులసోఁకున గాసిలి పాఱిపోవఁగా
సురగగణంబు వంగి సరినొందఁదనంతఁ, బ్రయోగ మొందె శం
కరుశ్రమమై జయంబుఁగొనెఁగా! అలనాఁ డతఁ డుల్కన స్థలి?॥

(ఇంకొకవైపునకుఁ జూపుచు కలచురీకుల ప్రభూతు లగు రాజేంద్రు లెల్లరకు పెద్దరాణి యైన చేదిదేశమునకుఁ భూషణములదండయై యొప్పెడి మాహిష్మతీనగర మల్లదిగో!

ఉ॥ కౌఁగిలి ముద్దు కూటమియె కన్ను పెణంబులుగాఁగ నోడ్డు నీ
నాగరికాల్ప్రగల్భకు సనంగుఁడె పోఁవుడు కాఁడు, తుల్యమే
భోగము, గెల్వ నోడ నను బుద్ధిని దట్టఁగ నీని పెద్దపు
న్దోఁగు మనుంద్రు జూదములఁ, దోఁగుము రవ్వల మోదవారిధిన్॥

(విమానవేగమును నిరూపించి)

శా॥ కస్తూరీవరభూష భూసతికి స్వర్గంగాతరంగైక యూ
నే స్తంపుర్ జెలికత్తె యాయమున సుండ! పేరటవాహిల
న్నస్తినెట్టి యముందు సోదరుడు లాఁగ స్త్రీరి తప్పించి ప్రే
మాస్తోకాఢ్యతఁ దండ్రి చండరవి డాయన్బంపు మోక్షాప్తికన్॥ 115

ల:-(దవ్వునందలిది వ్రేలితోఁ జూపుచు)

ఆ॥ త్రిపురహరుని మౌళిఁ గ్రీడించి యమృతాంశు
బాలమైత్రి నొంది ప్రజలఁ దనిపి
సగరసుతుల దేలించి జలధి కెల్లాలయ్యె
గంగ, యిదిగో! మనయఘంబు లడఁచు॥ 116

రా:- (సంతోషమున)

ఆ॥ సగము చండికొసఁగ సాంబుని జడముడి
సంకుచింప, వసతి సాంబొ యగుట
స్వగుణమైన మేల్లభీరత నిముడుభా
గీరథి! మదంబ! కేలుమోడ్పు!॥ 117

(సీతతో) దేవి! నమస్కరింపుము!

శా॥ తా నాబ్రహ్మగృహంబులోఁ గదలి సంభ్రమంబొందుట ల్నిక్కమే
యైన, న్బొందిఁ ద్యజించి యూర్ధ్వగతి కర్హత్వం బిట న్బొందు జీ
వానీకంబుల వాలుతీవ్రతకు హెచ్చై మేల్వాడి న్బ్రహ్మలో
కాన న్జేర్ప, శివావతంసమణి, గంగాదేవి, విన్నాణమూ! ॥ 118

సీ:-(అంజలింబట్టి) ప్రవాహమనుగొలుసున ముల్లోకముల ననుబం
ధించుతల్లీ! మందాకినీ! ఇవే నావందనముల నందుకొనుము!

ల:-(అన్యత్రఁ జూపి)

చ॥ ధనపతిమీఁద నొప్రణయతత్పరభావఫలంబు వెండికొం
డను విడనీమిచేత నచట న్దన కుండెడియింటివాఁకిటి
న్మనుచు నెగాని, శౌరాలి, పెనుమక్కువ నుల్లముపల్లవింప నా
కనుపడు వారణాశి కటకంబుగఁ జేకొని నిల్చు నిచ్చలున్ ॥ 119

రా:-(ఆనందమున నవలోకించుచు)

క॥ తీరం బెటఁ దోఁపనిసం
సారాంభోరాశి దిగ్భ్రమల నీదుజను
శ్రేణి తరియింప శ్రాంత్యా
గారం బగులంక యిదియె కాదె కుమారా! 120

అదియునుంగాక, భగవానుఁ డగుభుజంగభూషణుఁ డిందేగదా
స్థిరవసతి నిల్చియుండుట

చ॥ మొడనలుపందుఁ బాపదొరమే న్గలియ న్ఫణరత్నపాళిచే
తొడవని గౌరి బాహుపురితోఁ బెనవేసినకంఠసీమతో
నొడల లెడదూట హీనగతి నొందుస్వరంబుల సామగానము
న్పొటలను బ్రహ్మపుష్కలగ వెల్గుశివుం డిదు లోకభద్రముల్ ॥ 121

(వే... కై నొఁ ... పుగు, సీతతో)

ఉ॥ కా ... లాఁగుక ... గొగ్గులు కాచుల నాకరాగ్ర మో
... ! ... నా ... పడు ... సికయితోఁ గట్టిగా
... పె, భవత్కులవృద్ధు లేలు నా
... ! ... బ్బనచూ ... గైకొనన్ ॥ 122

సీత:—(ఎలనగవుస దృష్టిమరల్చి యనురాగమున రాముం జూచుచు నగరముంగూర్చి) అమ్మా! మిథిలా! నానందినమ్మల సందుకొని మా పెద్దలందఱకుంగూడ నాయభివాదనముల విన్నవింపుము!

రా:—(సుగ్రీవవిభీషణులతో) మిత్రులారా! జానకీగనినభూదేవి కీ పట్టణమే పుట్టినిల్లు. మిథిలపేరిటినగరము.

సు. వి:—(కౌతుకముతో) ఓహో! ఇచటనేకదా! భగవానుండగు పార్వతీప్రాణేశునకు ధనుస్సైన యజగవమును శేషుండైన భృగుపతియు భంగపాటు నొందినది. మఱియు సందేహమా! అట్టినీబాల్య క్రీడలలో సీతతో నాటచెలి యైయుండినయిలయక్క!

రా: — (లజ్జ నగు నలంకిసనగవున నొంటఁ జూపుచు) ప్రేయసీ! ఇంక నదే మనయెదుట గౌడులరాజధాని యగు చంపానగరము. మన్మధుని బ్రహ్మచర్యవ్రతమున కైనననములవలె విసఁడుమధురశృంగారవిభ్రమములచే రమణీయమై వెలుంగుచున్నది. (సీతతో నేకాంతమున) ఈయూరనే కలదొకపంత!

శా॥ మే నుబ్బించు గగుర్లకౌగిళులనేల్మి స్స్వల్ప శేషంబు గ
న్నే నెగ్గించినమీఁద సెమ్మె ప్రమిద స్త్రీపంబు లోఁబాటుచేఁ
గ్రీనీడ లతమకొనుబంటి మలయ స్రవంతి నేత్రోత్సుల
త్యానందంబుల వెల్లడింతు రనుభూతంబు ప్రహాశ్చాతుకుల్ 123

ల:— (ముందుఁ జూపుచు) ఆహా! ఆవిచిత్రము సరియుఁగను! ధరామరుల చిరంతననివాస మగు నియ్యంతర్వేదికిం దూముపుసిమ నవిగో! గంగాయమునలు! శ్రీగంధము నొకరును కృష్ణాగరు నొకరును మైపూఁతలుగ నూఁతపఱచుకొని యన్యోన్యము నలఁదుకొనునట్టు లెట్టులున్నవో!

గీ॥ గట్టివడగండ్ల హిమగిరికాపురమునఁ
గరము పాలైనోయేమొ గంగాభవాని!
తండ్రి వేసఁగిరవి యుంకతలమువసతి
నల్లఁబడెనేమొ యీయమునాస్రవంతి! 124

వి:— (యోజించి)

ఆ॥ బలి నడంచువిష్ణు పదనఖంబులకాంతి
స్మరనిహంతృ జూటచంద్రు జ్యోత్స్న
హిమనగంపు నిడుదయేరుల పెనుపునఁ
బ్రతిపదమున వృద్ధిఁ బడసె గంగ 135

మ ఱి యు,

క॥ అలఁతియె ప్రయాగ ? భూమి
నలిగిన క్షేత్రముల నెల్లఁ గడుగొప్పదిసూ!
తిలకింతురు భవవార్ధి క
వలితీరము జనము లిచట వసియించుటనే 126

రా:— (ఆదరమున) వాకొనశక్యమా !

ఆ॥ అట్టి దివిజగంగ యీవైపు ప్రవహింపఁ
బాఱు యమున యివలిప్రక్కనవుర !
ముక్తికిఁ బ్రయాగమునె తీయఁబడినట్టి
ద్వార మనుట కడుయథార్థవాక్కు 127

(సీతతో) వైదేహీ! నమస్కరింపుము!

గీ॥ మగువరో! శ్యామ మనెడియీమఱ్ఱిచెట్టు
సలుపు నద్భుత మెన్నంగఁ దలఁపవశమె ?
దానినీడ వసించునేరైనఁగాని
చూడఁగల్గుదు రాపరంజ్యోతినైన॥ 128

(గాలిరథమువడిం గనఁబఱచుచు సంతసమున)

గీ॥ గట్లపై బారులై చిగు రట్టుయూప
ములె మదన్వయయజ్ఞసంఖ్యలను బలుక
భానుకులజుల పట్టంపురాణి ధరణి
కొనరుపట్టం బిదే సరయూస్రవంతి !॥ 129

ఇదిగో! భగవతియగున యోధ్య!

క॥ ఉన్నాళస్థలపద్మము
లన్నటు లదె శిరములెత్తి యతికుతుకమునన్
నన్నుం గన విప్పారిన
కన్నుంగవ నాకసంబు గాలింత్రు ప్రజల్॥ 130

సు॥ వి:—(పట్టణమును పరకాయించి చూచి)

మ॥ ఒకనూఱధ్వరము లొనరించె శతమన్యుండంట యేగొప్ప ? పే
యికి పైపూచిగ యూపము ల్వొడిమలన్ దెల్పుటన్ గాఁడ త
త్సుకృతాసీతఫలానుభూతి, మఘవస్తుత్యం బయోధ్యా స్థవే
యకశౌనాయకసిద్ధిఁ గన్గొనఁగ సన్యం బెంచునే యేరికిన్॥ 131

రా:—(సుగ్రీవవిభీషణులతో) సచివులారా !

గీ॥ అట్టిరాజులు మాయన్వయంబునందు
మునుపు ప్రభవించు టెల్ల సింధ్రునకు గురుఁ
కలవసిష్ఠర్షి యిడుసహాస్యములలోని
విభవమాహాత్మ్యమేసుమిా ! వింతయేల ?॥ 132

(ముందుఁజూచి హర్షముతో) ఎట్లూ ! ఈమహామహుఁడు వశి
ష్ఠమహర్షియే ! మాయభిషేకమునకు వలయునుపకరణముల
సిద్ధముఁజేసికొని భరతశత్రుఘ్నులతో మనరాక నిరీక్షించు
చున్నాఁడు, (పుష్పకముతో) ఓవిమానరాజమా ! కాకుత్సరాజ
న్యుల ముఖ్యవిహారమంటపముదరికిం దిగుము. (ఎల్లరు విమానముం
దిగిమెదరు) (భరతశత్రుఘ్నులతో వసిష్ఠమహర్షి ప్రవేశము.)

వ:—(భరతశత్రుఘ్నులతో) బాలకులారా !

సు॥ ఘనలంకాపతిబాహుకాననపరిష్కారైకదోశ్శక్తిభా
జనుఁడై యీబుడుతండు లోకములు నిర్జాడ్యంబులఁ జేయుట
కన నేవింతయు; మాసిభాగ్యఫలదా లోక న్నత్తపోనిర్వయము
ల్వెనుక న్బాల్యమునందె పిల్చి కడుపిప్పుష్టి సాధించెడే !॥ 133

(రామునిజూచి హర్షముతో)

మ॥ తిసదోర్దిక్రిమకాండ రాక్షసనిర్మూలనంబు భల్లపరిభం
జనదోర్గంబునఁ గూల్చిగొప్పపని సంపూర్తిగాఁగా వరిం
చిన దీక్షాత్తసుమంగళీసుభగసుశ్రీయుక్తుఁడై క్రమ్మఱ
న్మనపుణ్యంబులకల్మిఁ గంటిఁబడెడి న్నారామభద్రుం డదే !॥ 134

రా:—(సంభ్రమమున సమీపించి సాంగిలి నమస్కరించి)

క॥ బ్రహ్మకె యాత్మజుఁ డగుచున్
బ్రహ్మర్షిత్వమున నలపురాణపురుషునిన్

బ్రహ్మ న్దొలిపెడి రఘువుల
బ్రహ్మకర్మగురున కివిగో ! రాముని ప్రణతుల్॥ 135

వ:—(రాముని గౌఁగిలించుకొని) వత్సా ! రామభద్రా ! నీయట్టివాని నేమని యాశీర్వదింపఁగలనయ్యా !

చ॥ అరితతి కందు వెండియు సమంతయు గుంజి జగంబు మూసకు
న్దరలిచి యంతరాయరహితంబుగ హెచ్చెడి స్వప్రతాపని
ష్ఠురశిఖ నూఁది మేల్పుటపుశోధనతో గుణవర్ణశుభ్రత
న్ధరఁ గళఁ జిమ్ముపిండముగఁ దార్చితిగా స్వకమైనకీరితిన్॥ 136

ఇంతియు కాక,

గీ॥ లోకములమూఁటి నొకయింతలోన దాఁటు
వడి కలుగు నీదు కీర్తిప్రవాహ మొలయఁ
బ్రథమభూపయశోనదు ల్త్రావి శుద్ధి
వెలయు, సింధువు గంగాంబువులనుబోలి॥ 137

అయినప్పటికి నాయాశీస్సున నిట్లగుంగాక !

క॥ రవిశశులపోల్కి జగదు
త్సవసంధానైకదృష్టిధౌరేయుల బా
హువులట్లు వంశరక్షణ
కవుసుతుల న్గడుపుపండఁ గను మిద్వయుగన్॥ 138

సీ:—(వసిష్ఠునకు నమస్కరించును.)

వ:—ఓ జనకవంశసుమంగలీ ! బిడ్డా ! మీకిరువురకుం గలసివచ్చునట్టుల రామభద్రు దీవింపనే దీవించితిని.

సీ:—(సంబరమునఁ దనలో) అమ్మయ్య ! ఇఁక నీరామభద్రున కీడులేని యిల్లాలు నౌదునులే !

ల:—సగరవంశగురువు లగుమైత్రావరుణుల కివే సౌమిత్రి సాష్టాంగ నమస్కారములు!

వ:—బాలకా ! లక్ష్మణా ! నీ వన్నియాశీస్సుల కతీతప్రవర్తనుఁడ వైతి వోయి !

గీ॥ ఇంద్రజిత్తంతవాని నొక్కింత నణఁచి
వర్థిలఁజేసితివి యీప్రపంచమెల్ల

నట్టి నీ వల్లఁగుందు ప్రియంతవాని
కైన నభయమ్ము నిడ దిట్టవైతి కాదె॥ 139

ఆ॥ అయిన మీరునలువు రన్నదమ్ములుఁగూడ
నిరువు రేసిసుతుల వడయుఁడయ్య?
వార లాదిరాజవంశాగమున కష్ట
శాఖలగుచు వృద్ధి సలుపఁగలరు?॥ 140

రా:—(సంతోషమున మఱల నమస్కరించి) భగవానుఁడా! మా యిక్ష్వాకుకుల మతితరముగ ననుగ్రహింపఁబడినది.

భ:—(రామునితో) దేవా! శూన్యమైనయీరాజభవనపు టంతిమ ద్వారమున ద్వారపాలకుఁడగుపదాతి భరతుఁడు నమస్కరించు చున్నవాఁడు,

రా:—(మోదమునఁ గౌఁగిలించుకొని) అన్నా! భరతన్నా!

ఉ॥ అయ్యయొ! ఎంతపాలె భవదంగము! వెన్నెలకంబమయ్యెనే
మయ్య? కవుంగిలిం గొనఁగదయ్య నను న్ముదముబ్బునట్టు! లో
యయ్య! కడుంగడుంజపల యాకమలాలయ కౌస్తుభంబుపై
నెయ్యపుసోదరప్రియత నే కద పీడదు విష్ణువక్షముం!॥ 141

భ:—(సీతకు నమస్కరించును.)

సీ:—అయ్యా! భరతకుమారా! తరణికిరణముల నెలమిఁగొను కమలముల గుంపువలె మీయన్నగారి చెంతఁ జిరకాలస్థాయిగ సుఖము ననుభవించుచుండుము!

ల:—(భరతున కెఱఁగును.)

భ:—సోదరా!

గీ॥ లక్ష్మణకుమార! నన్ను విలక్షణంపుఁ
గుతకమున గాఢపరిరంభగతిఁ బొదువుము!
చందనముకంటె ఘనసారచర్చకంటె
హాయిగదె కూర్చుసోదరు నంగసక్తి॥ 142

(గట్టిగాఁ గౌఁగిలించుకొని) అబ్బ! ఎంతకాలమునకు రఘుకుల [illegible]టాకమునకు యూపదండ మగులక్ష్మణు గాఢాలింగనమున నాదేహము చల్లనం బొరసినది!

ఆ॥ పంక్తిగాఁగఁ జేర్చిపట్టిన యైందవ
కళల గుంపుతోడ నలువ సర్వ
దుఃఖములను దుమిటినె ద్రోయనౌమేల్మితో
సలిపియుండు సోదరులకరాలు !॥ 143

శ:—(రాముని తో) ఆర్య! పాదసేవకుని సేవకుఁడిదే నమస్కరించు చున్నాఁడు!

రా:—(కౌఁగిలించుకొని) ఆహా! మఱలమాలక్ష్మణు పరిరంభణమే నాకమరుచున్నది. (ఏకాంతముగ సీతతో)

ఉ॥ నిండకుచంద్రబింబమును నిల్వఁగఁదీయుచు గేలిచేయున
ట్లుండెడియీముఖంబు గను మోసఖి! లక్ష్మణుమోమె! దేవవే
దండముతోండము న్గరినత న్దడుకర్కశత న్వహించి న
న్దండిఁగవుంగిలించు భుజదండము లేనియుఁ దద్విధంబులే!॥ 144

శ.—(సీతకు నమస్కరించును.)

సీ:—అన్నిలోకములయొక్క శోకశంకువులఁ దొలఁగించు గొప్పగొప్ప చరిత్రల కాస్పదమవై లక్ష్మణతుల్యుఁడవు కమ్ము! వత్సా! మన పెద్ద లెటనున్నవారో?

శ:—మంగళోపచారములు సిద్ధపఱచుకొని మధ్యమాంబయగు సుమిత్రాదేవిమందిరమున మనందఱకై వేచియున్నారు. (సమీపించి లక్ష్మణున కెఱగును.)

ల:—(సంతసమునఁ గౌఁగిలించుకొని) అదృష్టవంతుఁడవై దీర్ఘాయుష్మంతుఁడ వగునీ విందుంటచేతనే మేము భరతన్నగారి నిటవదలి యేగుట!

రా:—(వసిష్ఠునితో) వీరేలంకాకిష్కింధాపతులు! విభీషణసుగ్రీవులు! భగవాను లగుతమకు నమస్కరించుచున్నారు,

వ:—మీరు చాలకాలమువఱకు రవికులపౌలస్త్యవంశముల కీర్తిమాలికలకుఁ దోరణ స్తంభములభాతి నిలిచియుందురుగాత!

రా:—భరతా! శత్రుఘ్నా! మహామహు లగునీపౌలస్త్యసావిత్రులకు నమస్కరింపుఁడు.

భ-శ-సు-వి:—(అన్యోన్యయథోచితసత్కారులగుదురు.)
వ:—(ఆనందముతో) అదృష్టఫలవిశేషముచేతనేకదా ! పదునాలుగేండ్లు
చనినమీఁద నేఁటి కిచటఁ గ్రమ్మఱ నిట్లు కలిసికొనిన దశరథకుటుంబ
మును మేము చూడఁగలుగుట. (సవిమర్శముగ)

మ॥ గెలిచె న్రావణు హైహయుం, డతఁడు బ్రుంగెన్ భార్గవుం డెద్దుపే
రల నీరాముఁడె కాకపక్షధరుఁ డౌ ప్రాయాననే నొంచె, నీ
వలిచారిత్రము బాలగాథ కసదా వాసిం నిజంబెన్న, లో
కుల కల్గైన ముదంబు శ్రేయము నె చేకూర్చె నదుద్గీతముల్॥ 145

(రామునితో) వత్సా ! రామభద్రా ! మాంగలికముహూర్తము
దాఁటిపోనున్నది !

గీ॥ రమ్ము ! రఘుసింహ సింహాసనమ్ము నెక్కఁ
గమ్ము ! తులలేనివిపన నలంకార మందు,
గునియుచుండెడియుత్తరకోసలముల
సలుపు రాజన్యతులుగాఁగ సలుపు లుడిపి॥ 146

రా:—(సింహాసనము నధిష్ఠించును.)
వ:—(మంత్రపూతము లగునుదకములచే నభిషేకించును.)
ఇతరులు — (బహువిధాభిషేకముల నొనర్చి సర్వాంగాలింగితప్రణామ
ముల నిడుదురు )

(తెరలో) మంగళవాద్యములు సంగీతములుం జెలంగును.)
వ:—(ఆనందమున) వత్స ! రామభద్ర !

ఉ॥ జీవులఁ బెన్విభీషికలఁ జేయుపద్మాత్మనిలీల నష్టది
గ్దేవుల నల్పినాఁడవుగదే వెఱబొమ్మల, నట్టినీవె రా
జై విలసిల్లి యభ్యుదయమైతగు ధర్మము నోమఁగాఁ బరీ
భావమదృష్టపూర్వములఁ బర్వనొకో ప్రజ కీర్తిరాస్థలిన్॥ 147

రా:—(బిడియపడును)
వి:—(అంజలింబట్టిమోకరించి) దేవా !

గీ॥ లంకయును బుష్పకంబును లాఁగుకొనియె
రావణుఁడు తొల్లి యలకాధిరాజునుండి